# ఓమ్.

# జయార్థప్రకాశికానుబంధము ౧.

పాషండ పతిత పాకయాజి విమర్శన పై విమర్శనము.

అస్మద్దేశస్థితార్య వర్యులారా,

ఉ. భావజవైరిరాణికిని భావజుతల్లికి వైరమేమియు౯।
భావములంజనింపకటుభాసిల జేసినవాక్సతీమణి౯।
భావమునందలంతు ప్రతిభాయుతుడై నరుండు దానహం।
భావుడు శివీపాకయకుమాయల లోపలజిక్కకుండగ౯॥

శా॥ ఏవంక౯ గనుగొన్న వంకలునేయుక్కు౯ గవ౯ లోపము౯।
ఏవైపు౯ గనువిచ్చినన్దోసగులు౯ హేయంపువాక్యంబులు౯।
భావంబుల్గలవారిబోలకయేసద్భావంబుతో ధాత్రిపై।
శీవీ పాకయచర్యలెంచిగనరే శ్రేయంబున౯ సజ్జనుల్॥

## ఉపోద్ఘాతము.

ఆంధ్రదేశ పాలనా త్యచ్ఛ్థానము స్వీకరించియు నెట్టివిషమ కాలంబునను తమ స్వాతంత్ర్య స్ఫూర్తికై పెనుగులాడి పరాభూతులు గాక మతావేశ పరవశులగు దుర్మార్గుల దుర్దర్షాద్ధత్యము ప్రశాంతము గావించి చిరంతనకీర్తి గడించిన కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు సూర్యవంశజులగు క్షత్రియులనియు, మరియు స్త్రీ శూద్రాదుల కందఱికిని వేదాధికారము గలదనియు, ఇట్లు శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతిగారు, ఋూషణ్మండలములో నచ్చటచ్చట నుపన్యసించుచు నాయుపన్యాసములసారాంశము లనేక కరపత్రములయందు ముద్రించి ప్రకటించుచుండు, అట్లు ప్రకటించిన కరపత్రాంశములనే విపులమగు విషయములతో జయార్థప్రకాశిక మొదటిభాగము అజ్ఞానతిమిరభాస్కరాది గ్రంథమా

పమున జిత్రించుచు నిట్లుజిత్రించినగ్రంధములననుసరించి నాయావిషయ ములను కార్యక్రమములో బెట్టుచున్నారనుసంగతి లోకమునకు విదిత మయ్యేయున్నది.

ఇట్టిశ్రీవారియొక్క ప్రవర్తనములవలన కొన్ని దుష్టకీటకములకు నూపిరివిడుచుటకును వీలులేక విలవిలదన్నుకొనుచు వాటికిదోచినట్లెల్ల ఝూంకారధ్వనులతో బ్రలాపించుచున్నవి. ఇట్లాకీటకములు ప్రలాపించి ప్రలాపించి తుదను అజ్ఞానతిమిరభాస్కర ప్రభావాగ్ని ముందర యీశల భంబులు ఠింగు ఠింగున నేగిరిపడి ప్రాణంబులు విడుచుటతప్ప మరేమి చేయగలుగును.

ఇంతియేకాదు మరికొన్ని దుష్టజంతువ్రల బాధలు బెక్కులుండి నట్లుగ కన్పట్టుచున్నవి. ఇవి శ్రీవారిని నేమియుజేయజాలవని నానమ్మ కము. అయినప్పటికిని జిన్నపామైనను బెద్దకఱ్ఱతోగొట్టుమను నార్యో క్తినిబట్టి యీదుష్టసంతానముల బాధినుండి దొలంగి శ్రీవారొకింత జా గ్రతతోనుండుట కర్తవ్యమైయున్నది. వీరట్టి కట్టుదిట్టముల ననుసరించి యెంతయోజాగ్రతతోడ ప్రవర్తించుచుండినను ఒకప్పుడు వీరికిని యీ క్రిందజిత్రించు గాధానుసారముగ గొన్ని బాధలు తటస్థపడుచున్నవి. అట్టిగాధ నిద్దియని మెదలేని మూర్ఖుడగు నొక పిన్నవాడు తిష్ఠన్మూత్రు డై యుండుసమయమున నాదేశపాలకుడా మార్గమున కార్యాంతరమై వెళ్లుచుండ ఒరే పిన్నవాడా ఛీ ఛీ తిష్ఠన్మూత్రుడవయ్యెదవేమి అని యిట్లు నారాజశేఖరుండనిన నాపిన్నవాడు వేవేగమే గ్రామమధ్యము నకువెళ్ళి అచ్చటయుండు ప్రజలతో రాజుగారు నాతోమాట్లాడిరి మా ట్లాడిరని యిట్లు కేకలువేసి గంతులువైచుచు జూచువారికెల్ల నాశ్చర్య మొనర్చుచుండ యాప్రజలు నాపిన్నవానినిగూర్చి రాజుగారు నీతోనే మనమాట్లాడిరనియడుగ ఒరేపిన్నవాడా ఛీ ఛీ తిష్ఠన్మూత్రుడవయ్యెదవే మి అనియిట్లు రాజుగారు నాతోమాట్లాడిరని చెప్ప యాపిల్లవానిమా టలకాప్రజలందఱు పరిహాసించి వారివారి నెలవులకువెళ్ళిరి.

ఇట్లుగనే శ్రీవారివాదమునకు సరియగు హేతువులుజూపని కొం డరు పిష్టపేషణచర్విత చర్వణములవలె జెప్పిన విషయములనే మరల చెప్పుచున్న, మరియు శ్రీవారు వేదోక్తవిధులచే జెప్పినవాటిని నాధుని కులచే రచియింపబడిన గ్రంథోక్తవిధులనుబట్టి ఖండించితిమని సిగ్గైన నులేక చంకలుగొట్టుకొని జెప్పుకొనుటయు, పైండియు శ్రీవారు శ్రీమ చ్ఛంకర భగవత్పాదరామానుజ మధ్వమతాచార్య శ్రీమద్విద్యారణ్య మహామహులచే రచియింపబడిన భాష్యాదులననుసరించి జెప్పినవిధుల కన్నిటికిని సరియగు ప్రత్యుత్తరములు చెప్పుటకు శక్తిసమర్థతులుజాలక పోవుటవలన యేమియు జేయలేకపోతే వెక్కిరించెనన్న సామెత నవ లంబించి శ్రీవారు జెప్పినవిధులెల్ల బూర్వోక్తులైన భాష్యకర్తలచే రచి యింపబడినవిగావనియు, ఇట్లుగజెప్పుకొనుచు వాదమునకు సరియగు హేతువులనుజూపని పీరు కదుట్లోబడినను డింములోబడినను ఏలాగైన ప్పటికిని సరేననియు, మరియు పెట్టివానిచేతిలోని రాయివలెననియు, అను నీపూర్వోక్తుల రెండిటి ననుసరించి బ్రవర్తించువారై శ్రీవారివా దములకు బ్రత్యుత్తరమిచ్చితిమని జెప్పుకొనుటయే మిగుల్చుకొని ఉన్న ట్లు యున్నదిగాని మరేమియు సరియగు ప్రత్యుత్తరము లింతకన్న నధి కముగ జెప్పినట్లుగ గన్పట్టదు. ఇట్టివాదములను వాదించుటకు వీరేగా క నాబాలగోపాలురలో గూడా శక్తిసమర్థతలు గలవారుందురని మెం తోధైర్యముతో వ్రాయుచున్నాను.

ఇట్టివారిలోను గొందరిని మీరు గుర్తించుటకై కొద్దిగ యిచ్చు ట ముచ్చటించి నాసంగతులను వెనుక విపులముగ వ్రాయుచున్నాను.

౧ గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, కొల్లూరుగ్రామస్థి తాశేష బ్రాహ్మణనామధారులును, ౨ కృష్ణాజిల్లా గుడివాడతాలూ కా శాయపురాగ్రహారవాస్తవ్యులగు కీర్తిశేషులైన హవిర్యాజి కూన పులి పూర్ణయ్యశాస్త్రులవారును, 3 కృష్ణాజిల్లా బందరుగ్రామనివా సులగు కీర్తిశేషులైన పండిత జంద్యాల గౌరీనాధశాస్త్రులు బి. ఏ.

బి.యల్. గారును, ౪ శ్రీమత్పరమహంసేత్యాది సకలబిరుదావళీవిరాజమానులగు శ్రీమదభినవోద్దండ విద్యాశంకర భారతీస్వాములవారును, ౫ శ్రీపుష్పగిరి మఠ శిష్యులగు మల్లాది ఆంజనేయశాస్త్రులవారును, ౬ గుంటూరుమండల రేపల్లిసీమాంతర్గతమైన వెల్లటూరుగ్రామనివాసులగు బ్రహ్మశ్రీ తంగిరాల రామస్వామిశాస్త్రులు మొదలగు మరికొందరును, ౭ సికింద్రాబాదు ఇమాంబావుడి బజారు నివాసులగు మహారాజరాజశ్రీ శివపురపు వీరభద్ర పాకయాజి, బ్రహ్మశ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రులగార్లును, ౮ గుంటూరుజిల్లా రేపల్లి తాలూకా నల్లూరుగ్రామ నివాసులగు మహారాజరాజశ్రీ కోటంరాజు ఆనందరావు గారును, ౯ కృష్ణాజిల్లా బెజవాడతాలూకా వేల్పూరు గ్రామవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ నేతి పూర్ణయ్యశాస్త్రులవారును, ౧౦ నెల్లూరుజిల్లా నెల్లూరుతాలూకా ఇందుకూరిపేటవాస్తవ్యులగు కీర్తిశేషులైన ఇంగువ చెంచురామయ్య (సభాపతి) బ్రహ్మశ్రీ చివుకులకృష్ణయ్యశాస్త్రులవార్లును, మరియు బ్రహ్మశ్రీ వేదశిష్ట్ల కృష్ణయ్యగారును, ౧౧ కృష్ణాజిల్లా గుడివాడతాలూకా లింగాలపోస్టుకుచేరిన కానుగొల్లుగ్రామనివాసులగు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాన్తప్రవర్తక శ్రీమన్మాడభూషి (వాదమత్తేభ కంఠీరవ) సింహాద్రిస్వామాచార్యులవారును, ౧౨ గుంటూరు పురనివాసులగు శ్రీమాన్ కాశీ కృష్ణమాచార్యులవారును, గుంటూరుమండల తెనాలి సీమాంతర్గతమగు నల్లపాడు గ్రామవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ పెందుకూరి నృసింహశాస్త్రులవారును, మరియు తెనాలిగ్రామనివాసులగు పానకాలశాస్త్రులవారును, ౧౩ కృష్ణాజిల్లా బందరులో నోబిల్ కాలేజి సంస్కృత పండితులైన బ్రహ్మశ్రీ శిష్ట్లా నృసింహశాస్త్రులవారును. ఈ మొదలగువారై యున్నారు. ఇంకియే కాదు యీక్రిందవివరించువారు మరికొందరుగూడా గలరని తెలియబరుచు చున్నాను.



# వేళంగి అల్లరిమూక సభ.

ఆంధ్రదేశపాలనాత్యుచ్ఛస్థానము స్వీకరించియు నెట్టివిషమకాలంబునను తమ స్వాతంత్ర్యస్ఫూర్తికై పెనుగులాడి పరాభూతులుగాక మతావేశ పరవశులగు దుర్మార్గుల దుర్నయౌద్ధత్యము ప్రశాంతముజేసి చిరంతనకీర్తి గడంచిన కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు సూర్యవంశపు క్షత్రియులై యున్నారనియు, మరియు తదితరులగు స్త్రీశూద్రాదులకందఱికిని వేదాధికారము గలదనియు, ఇట్లు శ్రీమత్పరమహంస స్వామి. జి. యస్. బి. సరస్వతిగారు అచ్చటచ్చట నుపన్యసించుచు గోదావరిజిల్లా కాకినాడతాలూకా వేళంగియనుగ్రామమునగూడ గొన్నిదినములనుండి బైపధిని యుపన్యసించుచుండిరి.

అట్లు ఉపన్యసించుచుండ 1920 సం॥ అక్టోబరునెల 16 తేదికి సరియగు రౌద్రినామ సంవత్సర భాద్రపద శు ౫ దివసమున కాకినాడ, పిఠాపురము, కాండ్రేగుల, వుట్టకొండ, మండపేట, మున్నగు గ్రామములనుండి బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు, బ్రహ్మశ్రీ శతావధానులు దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారు, బ్రహ్మశ్రీ ఉప్పులూరు గణపతిశాస్త్రులుగారు, బ్రహ్మశ్రీ భాగవతుల లక్ష్మీపతిశాస్త్రులుగారు, బ్రహ్మశ్రీ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రులుగారు, బ్రహ్మశ్రీ భమిడి సత్యనారాయణశర్మగారు, ఈ మొదలగు శాస్త్రులును నిలోకబిరుదావళులుగలవారు. శిఖండినిముందిడుకొని యుద్ధమునకువెళ్ళిన అర్జునునివలె బూర్వోక్తులగువారందరు జేరుకొని కృష్ణాజిల్లా గుడివాడతాలూకా లింగాలపోస్టుకు చేరిన కానుగొల్లు గ్రామ నివాసులగు శ్రీమన్మాడభూషి సింహాద్రిప్పళాచార్యులను వారిని ముందిడుకొని బూర్వోదాహృతములైనవారందరు వేళంగిగ్రామమునకు చనుదెంచిరి.

ఈఆచార్యులవారు నొకానొక సమయమున రైలుప్రయాణములో బూర్వోక్తులగు శ్రీ శ్రీ శ్రీ స్వాములవారికి సంభవించి స్త్రీశూ

ద్రాదులకు వేదాధికారముగలదను మీవాదములో నొకటిమాత్రమునే గ్రహించి ఖండించెదనని బడాయిని ఉడాయించి డోలాయించుటచే శ్రీవారప్పుడు శుక్లయజుర్వేదము 26 అధ్యాయము 2 వ మంత్రమగు స్త్రీశూద్రాదుల కందరికిని వేదాధికారము గలదని నిర్ణయించునట్టి శ్లో॥ యథేమాంవాచమను నీమంత్రమును సంపూర్ణముగ అంగలూరు నుండి 7–8–18 తేదిన వ్రాసిబుత్తెంచిరి.

అందులకాచార్యులవారు ఆగడపు మంత్రి అందరికంటె నధికుడనునట్లును, అయ్యవారిని జేయబోయి కోతియైనట్లును, అను నీరెండు నాణ్యోక్తుల ననుసరించి 29–8–18 తేదీన యొకయుక్తిమును శ్రీవారి చేరవ్రాసి బుత్తెంచిరి. అందులకు శ్రీవారు 20–9–18 తేదీనఆచార్యులవారియుత్తరము సశాస్త్రీయముగా నుండక బోవుటచే ఖండనంబొనర్చి పత్రికకు ప్రతిపత్రికనువ్రాసి దిరుగా బుత్తెంచిరి.

అందులకాచార్యులవారు అంగిటబెల్లము ఆత్మలోవిషమనునట్లు శ్రీవారియుత్తరము సశాస్త్రవిధిననుసరించి యుండుటచే నందులకు బ్రత్యుత్తరమివ్వజాలకను తమయసమర్థత వెల్లడియగుననుభీతిచేతను మతత్రయ విద్వాంసులజేర్చి సభయొనర్చినచో మీవాదమును ఖండించెదనని ఆలినొల్లనివానికి యాలకూరలో నుప్పు జాలదన్నట్లు శ్రీవారికొక పత్రికనువ్రాసి బుత్తెంచిరి.

అందులకు శ్రీవారు (1) 19–11–18, (2) 4–12–18. (3) 19–12–18. (4) 2–2–19. (5) 13–9–20. తేదీలలో వ్రాయబడిన ప్రత్యుత్తరము లన్నిటియందును, అజ్ఞానతిమిరభాస్కరమున యుదహరించిన వరత్తులప్రకారము మతత్రయ విద్వాంసుల వల్లగాని తదితరులగు పండితులవల్లగాని సభజేయబడినప్పుడు మేమట్టిసభకొచ్చుటకు బాధ్యులమైయున్నామనియు, మరియు మేము స్వయముగా సభచేసి మిమ్ములనుబిలుచునంతటి యావశ్యకత మాకుబట్టియుండ లేదనియు ఇట్లుగ శ్రీవారు వ్రాసి బుత్తెంచియుండిరి.

ఇందులకాచార్యులవారు తానుబట్టిన కుందేటికి మూడేకాళ్ళన్నట్టు పూర్వోక్తమైన మతత్రయ విద్వాంసుల సభజేయుమని శ్రీవారికి వ్రాయుటయేగాని శ్రీవారిప్రశ్నలలో నొకప్రశ్నకైననుసరియగు ప్రత్యుత్తరమిచ్చుశక్తిచాలక వెఱ్ఱివెంగళాయవలె వదరుచు చండాలవర్గమున తలక్రిందుల వ్రేలాడుచుండుటతప్ప మరొండేమియు గన్పట్టజాలదు.

ఇట్లు పూర్వోక్తమైన నావేళంగిగ్రామమున 16–10–20 తేదిన పూర్వోదాహృతులగు వారినందరిని పోగుజేయుటకు నాగ్రామములోనుండు పౌరోహిత బ్రాహ్మణనామధారులు కొందరును, మరియు కాకినాడతాలూకా యండమూరుగ్రామవాస్తవ్యులగు మహారాజరాజశ్రీ కాకర్లపూడి వెంకటసుబ్బరాజుగారు మొదలగువారు కొందరును కారకులై యున్నారని మేమీక్రిందియంశములను గొన్నిటినిబట్టి నూహించుచున్నాము.

ఈవేళంగిగ్రామమున జరిగిన యీపరిషత్తనుపేరున వర్ణించిన యీసభకు సుమారు నాలుగువేలమంది ప్రజలు వచ్చియుండిరనియెన్నదగియున్నది. ఈసభలో శ్రీవారితో వాదించుటకై వచ్చినవారిలో ముఖ్యులైనవారు శ్రీమన్మాడభూషి సింహాద్రిప్పలాచార్యులవారును పూర్వోక్తులైన శాస్త్రులును తోకబిరుదావళులు గలవారునై యున్నారు. మరియును కొంతమంది వైష్ణవులునుగూడా వచ్చియుండిరి. ఇట్లు వచ్చినవారందరు నావేళంగిగ్రామమునయుండు సౌభాగ్యవతి పాతూరి బుల్లివెంకమ్మగారి సత్రమునకు జేరిన పిమ్మట వారిలోవారు గొన్నివిషయములను చర్చించుకొని తుదకు శ్రీవారివద్దకు కాకినాడ తాలూకా యండమూరు కాపరస్తులగు పూర్వోదాహృతులైన మహారాజరాజశ్రీ కాకర్లపూడి వెంకటసుబ్బరాజుగారినిన్ని మరికొంతమందినిన్ని శ్రీవారిసమీపమునకుబంపిరి. ఇటుల వచ్చినవారు శ్రీవారివద్దకువచ్చి ఈసత్రములో నిచ్చటనే సభజరుగబోవుచున్నది. కాబట్టి మీరు దయచేయువలయునని శ్రీవారినికోరిరి. శ్రీవారంతట యిదియెక్కడిసభ యని ప్రశ్నించ అటులవచ్చిన పూర్వోక్తులగువారు శ్రీవారికి ప్రత్యుత్తరము జెప్పినదే

మున్నను ఇదివరలో గొంతకాలము క్రిందట మీతో పత్రికావాద మొన ర్చి (ఓడి) న శ్రీమన్మాడభూషి సింహాద్రిప్పళాచార్యులవారు మీ వాదమును ఖండింపబోవుచున్నారు కాబట్టి మీరు దయచేయవలయు నని శ్రీవారితో జెప్పిరి.

అటుపిమ్మట శ్రీవారిందులకు జెప్పినదేమన్నను (౧) ఈసభ అజ్ఞానతిమిరభాస్కరములో నుదహరించిన షరత్తులకు వ్యతిరిక్తముగనుండునట్లు గన్పట్టుటచేతనున్ను, (౨) మాకుముందుగ నేటితారీఖునయీ సత్రములో సభజరుపబోవుచున్నామని నోటీసుద్వారా దెలియబఱచకబోవుటచేతనున్ను, (3) మరియు అజ్ఞానతిమిరభాస్కరములోని జెప్పియుంచిన షరత్తులలో నుభయులకు అనుకూలమగు పంచాయతీదార్ల ప్రస్తుతమిచ్చట లేకబోవుటచేతనున్ను, ఇట్టిసభ కరుదెంచుటకై వెనుదీయవలసి వచ్చునట్లు గన్పట్టుచున్నదని బూర్వోక్తులగు మ. రా. రా. శ్రీ కాకర్లపూడి వెంకటసుబ్బరాజుగారు మొదలగు వారితో శ్రీవారు చెప్పిరి.

ఇంతియేకాదు మీరుయిట్టిమధ్యస్థరహితమైన సభకుమమ్మును బిలుచుచున్నారు. మేమీక్షణమే మీరుకోరినప్రకారము బయలుదేరి వచ్చెదముగాని యిట్టిమధ్యస్థరహితమైన సభలవలన ముందుముందు మాకు గలుగు నష్టములకు మేము బాధ్యులమైయుందుమని మీరొకపత్రికను కాగితముమీద వ్రాసియిచ్చెదరేని మేము మీవెంటనే బయలుదేరివచ్చుచున్నామని శ్రీవారు ప్రత్యుత్తరము చెప్పిరి. అటుపిమ్మట యిట్లువచ్చిన వారొకరిముఖము నొకరు జూచుకొని శ్రీవారి ప్రశ్నలకొకదానికైనను సరియగు ప్రత్యుత్తరముచెప్పక మూతిగాలిన పిల్లిబరుగిడున చందమున శ్రీరాజుగారు మొదలగువారు వెళ్ళిరి. శ్రీవారంతట మరికొంతమంది ప్రముఖులను గలుపుకొని నాచార్యులు మొదలగువారు ఆసత్రములో నొక హాలులో గూర్చొనియుండుస్థలమునకు నొకభాగమున శ్రీవారును కూర్చొని ప్రత్యేకముగ (స్త్రీ) శూద్రాధ్యయనవిధిని గూర్చి ఉపన్యాసమును జెప్పుటకు ప్రారంభించిరి. అంతట శ్రీవారియుప

న్యాసమును వినుటకై యానభకరుదెంచిన ప్రజలందరును శ్రీవారి చు ట్టున్నమూగి వీరి యుపన్యాసమును వినుచు సంతోషాధిక్యముచే మధ్య మధ్య కరతాళధ్వనులు జేయుచు శ్రీవారి ప్రత్యర్థులగు నాచార్యులు మొ దలగువారి అల్లరి ప్రసంగములను యీ కరతాళధ్వనులచే నడుగంట జేసిరి.

ఇట్టి సమయములో మహారాజరాజశ్రీ దివాన్ బహదూరును డిస్ట్రిక్టుబోర్డు ప్రసిడెంటును అయిన దురుసేటి శేషగిరిరావుపంతులుగా రు కాకినాడనుండి మోటారుబండిమీద నాసభకువిచ్చేసిరి. శ్రీపంతు లుగారు వచ్చినతోడనే శ్రీవారుపన్యసించుచుండు స్థలమున కరుదెంచి కొంతకాలమువరకచ్చటనే కూర్చొని శ్రీవారియుపన్యాసములో చాలా భాగమునువిని పరమానందమును బొందిరి. అటుపిమ్మట శ్రీపంతులవా రు శ్రీవారి ప్రత్యర్థు లుపన్యసించుచోటుకు వెళ్ళి నాయుపన్యాసములను గూడా కొంతకాలమువరకు విని శ్రీవారి ప్రత్యర్థులగ వచ్చినవారితో కొన్ని మాటలుజెప్పి వెంటనే తిరుగ మోటారుమీద కాకినాడకు వెళ్ళిరి.

శ్రీవారటుపిమ్మట మధ్యాహ్నము రెండుగంటలకు ప్రారంభించి వయుపన్యాసమును సాయంకాలము ఏడుగంటలవరకును జెప్పి అప్పుడు సభ ముగింపు జేసిరి.

అటుపిమ్మట మహారాజరాజశ్రీ దివాన్ బహదూరును డిస్ట్రిక్టు బోర్డు ప్రసిడెంటును అయిన దురుసేటి శేషగిరిరావుపంతులుగారు శ్రీ వారిప్రత్యర్థులగ వచ్చిన వారితో జెప్పిన విషయములేమన్నను అందు లో ప్రముఖులగు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రుల్లవారిని గూ ర్చి ఇట్టి మధ్యస్థరహితమైన సభను మీమ్ముల నెవరుజేయమని జెప్పిరని ప్రశ్నించ అందులకు శ్రీశాస్త్రుల్లవారు మేము శ్రీవారితో వాదములా నచ్చుటకిట్టి సభను ఏర్పాటు జేసియుండలేదనియు, జనసామాన్యమున కు కొన్ని ధర్మములు బోధించుటకై యిచ్చట సభయొనగూర్చితిమని యూ, ఇట్లుగ తమయల్లరిగ్రంధములోని గడబిడాధ్యాయమునంతయు మరుగుబఱచి బూర్జ్వోక్తరీత్యా ప్రత్యుత్తరమునుజెప్పిరి.

ఇందులకు శ్రీ పంతులుగారు సెలవిచ్చినదేమన్నను మీరు కొన్ని ధర్మములను బోధించుటకై ప్రత్యేకము సభయేర్పఱచినప్పుడు శ్రీవారితో మీరు మీవాదమును ఖండించుటకై యిచ్చట సభ జేయబోవుచున్నామనియు, అందులకు తాము దయచేయవలయునని యిట్లుజెప్పుటకై మహారాజరాజశ్రీ యండమూరు కాపురస్థులగు కాకర్లపూడి వెంకటసుబ్బరాజుగారిని నందులకు బంపితిరనియు, మరియు ధర్మములను బోధించుటకై వచ్చినదే నిశ్చయమైయుండినచో మూలయింట త్రుప్పు పట్టియున్న నొకబండెడు తాళపత్రగ్రంథములను యిచ్చటికి దీసుకొని వచ్చుటకు గతమేమనియు, ఇట్లు ప్రశ్నించినందులకు శ్రీ బ్రహ్మయ్యశాస్త్రి మొదలగు లోకబిరుదావళులు గలవారందరు ప్రత్యుత్తరము జెప్పలేక నిరుత్తరులైరి.

శ్రీ పంతులవారంతట నాసభికులను శ్రీ బ్రహ్మయ్యశాస్త్రులుగారినిగూర్చి ఈక్రిందవ్రాయునట్టి కొన్ని మాటలుజెప్పిరి. అవియెవ్వియనినచో ఇటుపై యిట్టి అల్లరిసభలు జేయకనుండవలయుననియు, ఒకవేళ యట్లుజేసితిరేని అల్లరులుసాగుననియు, ఈవివాదములు మతసంబంధమైన వివాదములైయుండుటచే సహిజాగ్రతతో ప్రవర్తించవలయుననియు, ఈవచ్చినసభికులు యోగ్యులైయుండుటచే యీపాటికేపాటి యల్లరులు లేక నిచ్చట యభిమానము గలవారిచ్చట వినుచుండిరనియు, ఇట్లుగ నుడివిరి.

అంతటను శ్రీవారికి ప్రత్యర్థులుగవచ్చినవారిలో కొందరు శ్రీ శ్రీ శ్రీ స్వాములవారు పంచాయతికిగా నుండుటకు డిస్ట్రిక్టు కలెక్టరుగారిని డిస్ట్రిక్టు జడ్జిగారిని వీరిలో నెవరినైనను పంచాయతీదారునిగా నుంచవలయునని జెప్పుచున్నారు. అందువలన సరియగు పంచాయతి కుదరక పోవుటచే ఇట్లు సభజేయవలసివచ్చెనని సత్యమును వెల్లిబుచ్చిరి.

ఇందులకు శ్రీ పంతులవారు పంచాయతీదార్లనుకూలముగ తటస్థపడనప్పుడు సభయే మానుకొనవలయునుగాని ఇట్టి యల్లరిసభలు జేయుట ప్రమాదకరమనిజెప్పిరి. ఇంతియేకాదు పంచాయతీదార్లలో బూ

ర్వోక్తులగు డిస్ట్రిక్టు కలెక్టరుగారు, డిస్ట్రిక్టుజడ్జిగారు వీరిలో నెవరైన ను తటస్థపడకపోయినప్పుడు వారుయిద్దరిని మీరుయిద్దరిని ఎన్నుకొనినయా నలుగురువోగా నైదవవారిని బ్రాహ్మణులలో నెవరినియుంచక సర్వ సములగు సన్యాసులలో నొకరిని ముఖ్యనాయకునిగా నుంచుట శ్రే యోదాయకమై యుండును. ఇట్లుకాదనియెదరేని అన్యమతస్తులలో వి ద్వాంసులుగనుండువారిని ముఖ్యపంచాయతీదారునిగ యుంచుట సర్వ సమ్మతమై యుండునని ఇట్లుచెప్పి వారువెళ్ళిరి.

(౧) అంతటను శ్రీ పంతులవారివాక్యములనుగూర్చి ప్రజలందరు నీక్రిందివిధమున అర్థమును జేయుటకు మొదలిడిరి. అట్టియభిప్రాయము తెల్పినచో బ్రాహ్మణులను సభానాయకత్వముక్రింద నుంచు ట నుంచబడిగాదని జెప్పినమాటచే అట్టిబ్రాహ్మణునికి ఏలాగైనను అభి మానముండక తప్పదనియు అట్టియభిమానమువలన సభాకార్యములలో గొన్నిటికి నష్టముగలుగుననియు, (౨) సర్వసములగుసన్యాసులు బ్రా హ్మణులైనను సభానాయకత్వము క్రింద యుంచినప్పుడు శ్రేష్ఠముగా నుండునని జెప్పినమాటచే ప్రస్తుతమున శ్రీవారుగూడా సర్వసములగు సన్యాసియగుటచే వీరిప్పుడు జెప్పువిషయములు సత్యములై యున్నవని యు, (3) మరియు శ్రీపంతులవారు కాకినాడ నుండి వచ్చిన వెంటనే శ్రీ శ్రీ శ్రీ స్వాములవారివద్దకువచ్చి అచ్చట శ్రీవారికి నమస్కారముజేసి కొంతకాలము శ్రీవారిసన్నిధియందు గూర్చొని వారి యుపన్యాసమును విని అటుపిమ్మట శ్రీవారిప్రత్యర్థుల సభకువెళ్ళి వారికేరికిని నమస్కార ములుజేయక వెళ్ళిపోవుటచే ప్రజలందరు శ్రీమత్పరమహంస. స్వామి. జి. యస్. బి. సరస్వతిగారు జెప్పిన మాటలే సత్యములై యున్నవని యూహించిరి.

అటుపిమ్మట వేళంగిగ్రామస్థులగు కూర్మకులావతంసులగు సూ ర్యవంశజ క్షత్రియులైన మహారాజరాజశ్రీ మాక్కి వీరన్నతాదరిగారు శ్రీవారి ప్రత్యర్థులసభకువెళ్ళి యచ్చటగూర్చొని వినుచుండిరి. ఇట్టితరి యాసభలోనుండునట్టి శాస్త్రియను తోక బిరుదావళులు గలవారందరు

ఒక రోకరు కొంతకాలముచొప్పున యుపన్యాసములు జెప్పుచు బజా
ను ఉడాయించి డోలువాయించుచుండిరి. అంతట మహారాజరాజశ్రీ
మార్ని వీరన్నచౌదరిగారు ఏదైనా నొకప్రశ్న యడుగ వలసివచ్చిన
ప్పుడు అడిగినచో ఉపన్యాసాంతమున జెప్పెదమని ప్రతియుపన్యాసకు
డు జెప్పుచుండెనుగాని అందులో నొకరైనను వీరిప్రశ్నకు ప్రత్యుత్తర
ము జెప్పరైరి.

అటువిమ్మట తుదకు శ్రీమన్మాడభూషి సింహాద్రిస్వామాచార్యు
లులేచి ఆర్యులారాయని యిట్లు సంబోధించుచు తమయల్లరిపంచాంగ
ముతో నిండియుండు గ్రంథములోని గడబిడాధ్యాయమ్మునుజెప్పి ము
గించినవెంటనే బూర్వోక్తులగు మ. రా. రా. శ్రీ మార్ని వీరన్నచౌద
రిగారు మీయుపన్యాసములో నాకొకసందేహము గలిగియున్నదనియు
అందులకు ప్రత్యుత్తరము జెప్పవలయుననియు ఇట్లు ఖండితముగనడుగ
తుదకు మీసందేహమేదియో జెప్పుడని శ్రీ ఆచార్యులవారుజెప్పిరి. ఇం
దులకు మ. రా. రా. శ్రీ మార్ని వీరన్నచౌదరిగారు మాకు శ్రీవైష్ణ
వులుగురువులైయున్నారుగదా, అట్టిశ్రీవైష్ణవులు మాకు చక్రాంకనము
లుజేసి ఓమ్ నమోనారాయణాయ అని యిటుల నుపదేశము జేయుచు
న్నారు. ఇటుల నుపదేశించు యీమంత్రము వేదోక్తమా లేక పురా
ణోక్తమా అనియిటుల ప్రశ్నజేసిరి. ఇందులకు శ్రీ ఆచార్యులవారు జె
ప్పినదేమన్నను అట్టి ఓమ్ నమోనారాయణాయఅను నీమంత్రము వేదో
క్తమైనదిగాని పురాణోక్తమైన మంత్రముగాదని ప్రత్యుత్తరముజెప్పిరి.
అందులకు మ. రా. రా. శ్రీ మార్ని వీరన్నచౌదరిగారు ఈమంత్రము
వేదోక్తమైనమంత్రమగునెడల మాకెట్లు మీరుపదేశముజేయుచున్నారని
తిరుగా ప్రశ్నించుటయేగాక అటుల నావేదమంత్రమును మీరుపదేశముచే
యునెడల మేము తక్కిన వేదమునంతయు నెందులకు పఠించగూడదని
నాక్షేపించిరి. ఇందులకు శ్రీ ఆచార్యులవారు ప్రత్యుత్తరమిచ్చినవిషయ
మేమన్నను అట్టి యీమంత్రమును శూద్రుల కుపదేశముజేయునప్పుడు
స్వరములేక నుపదేశము జేయుబడుననియు, తదితరులగు ద్విజులకుపదే

శము జేయునప్పుడు స్వరసహితముగ జెప్పబడుననియు, ఇట్లుగ ప్రత్యుత్తరమిచ్చిరి.

అంతటను మ. రా. రా. శ్రీ మార్ని వీరన్న చౌదరిగారు ఇట్లు శూద్రులకు స్వరరహితముగ నామంత్రము నుపదేశము చేయునప్పుడు స్వరాపరాధ దోషము శూద్రులకు సంభవించ కుండునాయనియును, శూద్రులకు స్వరరహితముగ నామంత్రము నుపదేశము చేయవచ్చునని యును, మరియు ద్విజులకు స్వరరహితముగ నుపదేశము మొనర్చవలన నియును, ఇట్లుగ శాస్త్రవచనము లెవ్వియైనను యున్నవాయనిన యున్నవని శ్రీ ఆచార్యులవారు ప్రత్యుత్తరమిచ్చిరి.

అటుపిమ్మటను మ. రా. రా. శ్రీ మార్ని వీరన్న చౌదరిగారు అట్లుగ శాస్త్రవచనముండినప్పుడు నాగ్రంధమును జూపమని గోరినప్పుడు ప్రస్తుతము నావద్దయాగ్రంధమును లేదనియు, బసలోనున్నదనియు అవసరముగలిగినప్పుడు రహస్యముగ నాగ్రంధమును జూపెదననియు, ఇట్లుగశ్రీఆచార్యులవారు ప్రత్యుత్తరమిచ్చిరి. అందులకు బూర్వోక్తులగు వీరన్న చౌదరిగారు యుద్ధమునకు వెళ్లువాడు నాయుధములేక వెళ్ళునట్లు మీరునువాదమునకు వచ్చునప్పుడు వాదములకుపయుక్తములగు గ్రంథ సముదాయమును దీసుకొనిరాక ఎట్లు యీసభకు విచ్చేసితిరని ప్రశ్నించుచు నాకావుస్తకముయొక్క పేరునైనను దెలిపినచో నేనైనను జూచుకొనిమెదనని యిట్లనుగునరికి గ్రంధముయొక్క పేరుగూడా ముఖస్తముశేదని శ్రీఆచార్యులవారు ప్రత్యుత్తరమిచ్చుచు మీరంతఖండితముగ నడుగుటచే మీకాగ్రంధమునుజూపుటకు వలనుపడదని వెనుకముందు నాలోచించుకొనక ప్రత్యుత్తరము జెప్పిరి.

అటుపిమ్మట మ. రా. రా. శ్రీ మార్ని వీరన్న చౌదరిగారు మేమును ఇట్టి అల్లరిమూకతోనుండు సభలోనుండుట యోగ్యమైయుండ లేదని జెప్పుచుసభనుండి బయలుదేరివచ్చునరికి శ్రీ ఆచార్యులవారు జేపిడినిబొందిరని ప్రజలనుచు మిన్నుముట్టునట్లు కరతాళధ్వనులు ప్రబలింపజేసిరి.

అటుపిమ్మట మ. రా. రా. శ్రీ మార్ని వీరన్నచౌదరిగారును
తదితరులగు కూర్మకులావతంసజులైన సూర్యవంశజులగు క్షత్రియులైన
కమ్మవారును, కాపువారును, వెలమవారును, రెడ్డివారును ఈ మొద
లగువారు శ్రీ శ్రీ శ్రీ స్వాములవారు యుపన్యాసమిచ్చు స్థలమునకు వ
చ్చి అచ్చట శ్రీవారి ప్రత్యక్షలసభయందు జరిగిన సంగతులనన్నింటిని
పూసగ్రుచ్చినట్టుల నచ్చటిప్రజలకెల్ల దెలియునట్లుగ నుపన్యాసపూర్వక
ముగ వచించిరి.

పాఠకమహాశయులారా.

అశ్లీలశృతి తత్వబోధకత్వరూపకవచ సంవృతములు జగద్వంచ
నాపాండిత్య పీఠమందు నిరంకుశ రాజ్యమును జేయనభిలషితులై స్వమ
తస్థాపనపరమతఖండన సద్విద్యాశూన్యులై న్యాయమార్గమునకు బహు
దూరమున స్వచ్ఛందవిహారము జేయ గొంతెమ్మ కోర్కెలం గోరువార
లై ఉత్తమోత్తమత్వమునందుగోరి అధమాధమస్థితికి వచ్చియున్నది
నెఱుంగక మాన్యమ స్థితినంగీకరించజాలని బూర్వోక్తులగు నిపండితం
మన్యుల స్థితిగతులను వ్రాయబూనుట పనిచెరుపు? వ్యర్థము? అనవస
రము? అయినను న్యాయైకరక్షణ సమర్థత్వమును. స్వధర్మపరిపాలన ప
టిష్ఠతను గలిగి సర్వసమత్వము వహించు నాఖ్యసంఘమై వారమగు మా
కిది కొంతవరకు దెలుపవలసిన యంశమగుటచే నివ్రాతకు గడంగితిమి
ఇందలి సత్యాసత్యములు తమడెందంబులకు గోచరమొనర్చియుంచుట
చే నట్టివిశేషవిషయములందు బొందుపరచక సంగ్రహముగ ఈ
పండితులు మ. రా. రా. శ్రీ మార్ని వీరన్నచౌదరిగారి ప్రశ్నలకు ప్ర
త్యుత్తరము జెప్పజాలక పరాభవము బొందిరనియు, ఇందుచే శ్రీ శ్రీ శ్రీ
స్వాములవారి పక్షమువారికి జయము గలిగినదనియు, ఇట్లు దెలియబ
ఱచుచు నాసంగతి నీపత్రికా పుత్రికను జిత్రించి తద్వారా వెల్లడిపఱచు
చున్నారము. ఇట్లు తమవిధేయులు.

వేళంగి గ్రామము కమ్మవారు.

౧ మార్ని వీరన్నచౌదరి, ౨ యార్లగడ్డ కొండయ్యచౌదరి, 3 మెర్ల రామన్న
చౌదరి, ౪ మెర్ల పెదరామన్నచౌదరి, ౫ మెర్ల రామయ్యచౌదరి, ౬ మెర్ల జగ్గన్న

చౌదరి, ౭ మెర్ల బల్లిరామన్న చౌదరి, ౮ మెర్ల వీరన్న చౌదరి, ౯ మెర్ల సత్తెయ్యచౌదరి౯॥ రామన్న చౌదరి, ౧౦ మెర్ల సత్యయ్యచౌదరి, ౧౧ రామన్న చౌదరి, ౧౧ మెర్ల పున్నయ్య చౌదరి, ౧౨ మెర్ల వెంకయ్యచౌదరి, ౧౩ మెర్ల రాజయ్యచౌదరి, ౧౪ మెర్ల సత్తెయ్యచౌదరి, ౧౫ మెర్ల సత్యనారాయణమూర్తిచౌదరి, ౧౬ మెర్ల సుబ్బరావుచౌదరి, ౧౭ మెర్ల రామయ్యచౌదరి, ౧౮ యరపాటి రామయ్యచౌదరి, ౧౯ యు. జగన్న చౌదరి, ౨౦ యరపాటి జగ్గయ్యచౌదరి కుమారుడు, ౨౧ యరపాటి అమ్మన్న చౌదరి, ౨౨ యరపాటి రామన్న చౌదరి, ౨౩ యరపాటి క్రిష్ణమ్మచౌదరి, ౨౪ మూర్తి నారదులచౌదరి, ౨౫ గుణ్ణం వెంకటస్వామిచౌదరి, ౨౬ గుణ్ణం సత్తెయ్యచౌదరి, ౨౭ గుణ్ణం బ్రహ్మశంకరచౌదరి, ౨౮ పాతూరి కిష్టమ్మచౌదరి, ౨౯ పాతూరి అమ్మన్న చౌదరి, ౩౦ పాతూరి అమ్మన్న తాతయ్యచౌదరి, ౩౧ మెర్ల వెంకన్న చౌదరి, ౩౨ మెర్ల వెంకన్న చౌదరి, ౩౩ దేవళ్ళ సత్తెయ్యచౌదరి, ౩౪ దేవళ్ళ రామన్న చౌదరి, ౩౫ మూర్తి వెంకన్న చౌదరి, ౩౬ మూర్తి అమ్మన్న తాతయ్యచౌదరి, ౩౭ చుండ్రు రామన్న చౌదరి, ౩౮ ముత్యాల వీరన్న చౌదరి, ౩౯ మెర్ల అమ్మన్న తాతయ్యచౌదరి, ౪౦ చోడె రామన్న చౌదరి, ౪౧ నిమ్మలపూడి వెంకయ్యచౌదరి, ౪౨ నిమ్మలపూడి గోవిందయ్యచౌదరి, ౪౩ యరమాటి లింగన్న చౌదరి, ౪౪ యరమాటి వీరన్న చౌదరి, ౪౫ చందుర్తి సుబ్బన్న చౌదరి, ౪౬ చుందుర్తి వీరన్న చౌదరి, ౪౭ చుందుర్తి వీరయ్యచౌదరి, ౪౮ వల్లూరి శంకరయ్యచౌదరి, ౪౯ పుంతవిల్లి చిన్నయ్యచౌదరి, ౫౦ నిమ్మలపూడి వెంకటాద్రియ్యచౌదరి.

## కాపులు వేళంగి.

౫౧ బండారు కొండయ్య (నాయుడు) ౫౨ దేవినీడి వెంకన్న (నాయుడు) ౫౩ కార్లి బాపన్న (నాయుడు) ౫౪ సుంకర గంగరాజు (నాయుడు) ౫౫ సుంకర వెంకన్న (నాయుడు) ౫౬ సుంకర గంగన్న (నాయుడు) ౫౭ కార్లి పుల్లయ్య (నాయుడు) ౫౮ కార్లి సూరన్న (నాయుడు) ౫౯ ఎలుగుబంటి తమ్మయ్య (నాయుడు) కూరాడ ౬౦ తలాటం కొండన్న (నాయుడు) మామిడాడ ౬౧ కొండెపూడి వెంకన్న (నాయుడు) వోదూరు ౬౨ కొండెపూడి వీరన్న (నాయుడు) ౬౩ కొండెపూడి సత్తిరాల(నాయుడు) ౬౩ కొండెపూడి సత్యనారాయణ(నాయుడు) ౬౪ కొండెపూడి వెంకట్రియుల (నాయుడు) ౬౫ కొండెపూడి శివరావు (నాయుడు) ౬౬ అడ్డంకి రామచంద్రుల (నాయుడు)

## విశ్వబ్రాహ్మణులు, వేళంగి.

౬౭ వేల్పుకొండ సూరన్న, ౬౮ వేల్పుకొండ వీరభద్రుడు, ౬౯ వేల్పుకొండ పద్దరాజు, ౭౦ వేల్పుకొండ సాంబయ్య, ౭౧ భవిరి భీమలింగం, ౭౨ పడాల అప్పలస్వామి, ౭౩ లావేటి వెంకన్న.

## వైశ్యులు, వేళంగి.

౭౪ పట్నాల సూరన్న, ౭౫ కందుల వెంకటరాజు, ౭౬ కందుల వెంకన్న.

## బ్రాహ్మణులు, కొంకుదురు.

౭౭ గాడేపల్లి చంద్రశేఖరరావు, ౭౮ ముప్పునూరు వెంకట్రామయ్య, ౭౯ తొస్సిపూడి కరణం.

## రెడ్డి వారు, కొంకుదురు.

౮౦ తాడి రామన్నరెడ్డి, ౮౧ సబ్బెళ్ల పద్దయ్యరెడ్డి, (గ్రామ మునసిఫ్) ౮౨ పడాల రామిరెడ్డి, ౮౩ కర్రి సోమిరెడ్డి, ౮౪ పులగం రామిరెడ్డి, ౮౫ సబ్బెళ్ల సుబ్బారెడ్డి, ౮౬ పడాల వెంకటరెడ్డి, ౮౭ మేడపాటి సుబ్బిరెడ్డి, ౮౮ కర్రి సత్రెడ్డి, ౮౯ మల్లిడి గంగిరెడ్డి, ౯౦ శ్రీమంతుల వీరన్న, (కాపులు) ౯౧ కొవ్వూరు గంగిరెడ్డి, ౯౨ కొవ్వూరు సుబ్బిరెడ్డి, ౯౩ పత్తి గంగిరెడ్డి, ౯౪ పడాల చినరామిరెడ్డి, ౯౫ సబ్బెళ్ల అమ్మిరెడ్డి, ౯౬ మైనేని రాఘవయ్యావర్మ, (కమ్మవారు) ౯౭ బొప్పన ప్రభాకరవర్మ, (కమ్మవారు) ౯౮ కొవ్వూరి వీర్రెడ్డి,

## విశ్వబ్రాహ్మణులు, కొంకుదురు.

౯౯ కడియం సత్యనారాయణ, ౧౦౦ వరకొండ గురవయ్య, ౧౦౧ కడియం వీరలింగం, ౧౦౨ కానూరి కన్నయ్య, ౧౦౩ కానూరి సూర్యనారాయణమూర్తి. ౧౦౪ అంటికట్ల అప్పలస్వామి.

## రెడ్డి వారు, బలభద్రపురం.

౧౦౫ పత్తి నారాయణరెడ్డి, ౧౦౬ సబ్బెళ్ల నారాయణరెడ్డి, ౧౦౭ మండ పట్టియ్యరెడ్డి, ౧౦౮ పత్తి పట్టియ్యరెడ్డి, ౧౦౯ మేడపాటి బుల్లిరాయుడురెడ్డి, ౧౧౦ కొవ్వూరి మునియ్య కు॥ గంగిరెడ్డి, (కొంకుదురు) ౧౧౧ సబ్బెళ్ల సత్రెడ్డి, ౧౧౨ పత్తి రామిరెడ్డి, ౧౧౩ కర్రి వెంకటరెడ్డి, ౧౧౪ పులగం వెంకటరెడ్డి, ౧౧౫ పప్పు మునలయ్య, (కొంకుదురు).

## రెడ్డివారు, తుస్సిపూడి.

౧౧౬ ద్వారంపూడి భీమారెడ్డి, ౧౧౭ తుస్సిపూడి గ్రామమునసబు, ౧౧౮ పడాల కాసుఅనేరామిరెడ్డి, (కుంకుదురు) ౧౧౯ కర్రి నారాయణరెడ్డి, ౧౨౦ కొవ్వూరి సోమిరెడ్డి, ౧౨౧ కొవ్వూరి సత్తిరెడ్డి, ౧౨౨ సత్తిమూరారెడ్డి, ౧౨౩ ములగపాటి వెంకటరామరాజు, (క్షత్రియులు కుంకుదురు) ౧౨౪ కొవ్వూరి భామిరెడ్డి, ౧౨౫ కొవ్వూరి ధర్మయ్యరెడ్డి, ౧౨౬ తాడి నారాయణమూర్తి, ౧౨౭ తాడి మూర్రెడ్డి,

## రెడ్డివారు, మాచవరము.

౧౨౮ కొవ్వూరు అమ్మిరెడ్డి, ౧౨౯ కొవ్వూరు మూర్రెడ్డి, ౧౩౦ కొవ్వూరు వీర్రెడ్డి, ౧౩౧ కొవ్వూరు వీర్రెడ్డి, ౧౩౨ కొవ్వూరు రామిరెడ్డి, ౧౩౩ వెలగలసత్తిరెడ్డి, ౧౩౪ వెలగల భామిరెడ్డి, ౧౩౫ వెలగల వెంకటరెడ్డి, ౨౩౬ వెలగల సుబ్బిరెడ్డి, ౧౩౭ వెలగల సోమిరెడ్డి, ౧౩౯ సత్తి తిరపయ్యరెడ్డి, ౧౩౯ సత్తి సోమిరెడ్డి, ౧౪౦ సత్తి పెదముత్తారెడ్డి, ౧౪౧ సత్తి చినముత్తారెడ్డి, ౧౪౨ సత్తి గంగిరెడ్డి, ౧౪౩ మందాపరదేశిరెడ్డి, ౧౪౪ మండా భూపారెడ్డి, ౧౪౫ మండా అప్పారెడ్డి, ౧౪౬ మండా సోమిరెడ్డి, ౧౪౭ మండా ఆదిరెడ్డి, ౧౪౮ మేడపాటి సోమిరెడ్డి, ౧౪౯ మేడపాటి రామిరెడ్డి, ౧౫౦ మేడపాటి వీరెడ్డి, ౧౫౧ మేడపాటి సత్తిరెడ్డి, ౧౫౨ మేడపాటి చందారెడ్డి, ౧౫౩ నల్లమిల్లి గంగిరెడ్డి, (మణేదాము) ౧౫౪ నల్లమిల్లి అచ్చిరెడ్డి, ౧౫౫ నల్లమిల్లి మూరారెడ్డి, ౧౫౬ పడాల వెంకటస్వామిరెడ్డి, ౧౫౭ పడాల అమ్మిరెడ్డి, ౧౫౮ పడాల వీరపిరెడ్డి, ౧౫౯ ద్వారంపూడి భామిరెడ్డి, ౧౬౦ ద్వారంపూడి గంగిరెడ్డి, ౧౬౧ ద్వారంపూడి సుబ్బారెడ్డి, ౧౬౨ సబ్బెళ్ల వెంకటరెడ్డి, ౧౬౩ సబ్బెళ్ళ రాజారెడ్డి, ౧౬౪ సబ్బెళ్ళ రామిరెడ్డి, ౧౬౫ తేతల సుబ్బారెడ్డి, ౧౬౬ తేతల పుత్రారెడ్డి, ౧౬౭ తవలంపూడి పెదవీరారెడ్డి, ౧౬౮ తవలంపూడి కొండలరెడ్డి, ౧౬౯ తవలంపూడి వీర్రెడ్డి, ౧౭౦ తవలంపూడి భామిరెడ్డి, ౧౭౧ తవలంపూడి ఆదిరెడ్డి ౧౭౨ కర్రి చంద్రారెడ్డి, ౧౭౩ కర్రి మూర్రెడ్డి, ౧౭౪ కర్రి శేషారెడ్డి, ౧౭౫ గొలుగూరి శేషారెడ్డి, ౧౭౬ గొలుగూరి వీర్రెడ్డి, ౧౭౭ గొలుగూరి వీర్రెడ్డి, ౧౭౮ కోనాల వెంటారెడ్డి, ౧౭౯ పులగం గద్దెమ్మరెడ్డి, ౧౮౦ పోతంశెట్టి పాపారెడ్డి, ౧౮౧ పోతంశెట్టి పెద్దయ్యరెడ్డి, ౧౮౨ చింతా బూలోకరెడ్డి, ౧౮౩ తాడి రామిరెడ్డి, ౧౮౪ మేడపాటి సోమిరెడ్డి, ౧౮౬ పచ్చా మూర్రెడ్డి, ౧౮౭ కర్రి వెంటారెడ్డి, ౧౮౮ గుడిమెట్ల వద్దారెడ్డి, ౧౮౯ సత్తి మూరారెడ్డి, ౧౯౦ సత్తి సత్యనారాయణరెడ్డి.

కాపులు, మాచవరం.

౧౯౨ బూదేటి గంగరాజునాయుడు, ౧౯౩ బూదేటి సుబ్బన్ననాయుడు, ౧౯౪ బూదేటి పూచరనాయుడు, ౧౯౫ కంచుముత్తి వెంకయ్యనాయుడు ౧౯౬ కంచు అబ్బిరెడ్డి వెంకయ్యనాయుడు, ౧౯౭ పెట్లా సుబ్బన్ననాయుడు, ౧౯౮ పెట్లా తాతయ్యనాయుడు, ౧౯౯ పెట్లా చాగంటిసోమన్ననాయుడు. ౧౯౯ శిరికొంవ వెంకటప్పయ్య, నూజవీడు. ౨౦౦ వీరమాచనేని నారాయణచౌదరి రేపల్లి తా॥నల్లూరు.

ఇందులకు మాత్రుకలో 500 సంతకములు గన్పట్టు చున్నవి. వాటిని గ్రంథవిస్తరభీతిచే నిందు బ్రకటించ్చనైతిని.

# క్రియారహితమైన కుప్పిగంతులు.

స్వస్తిశ్రీమదఖండ భూమండలాలంకారేత్యాది సకల బిరుదావళివిరాజమాన శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతి.

బ్రహ్మశ్రీ చోడవరం సిద్ధాంతిగారికి.

౧ 1920 సం॥ ఆగస్టు నెల 19 తేదిరాత్రి మహారాజరాజశ్రీ పాతూరి వీరయ్య, సౌభాగ్యవతియైన బుల్లి వెంకమ్మగార్లచే ప్రతిష్ఠింపబడిన సత్రములో జరిగిన మాయుపన్యాస సభయందు స్త్రీ శూద్రాదులకు వేదాధ్యయనాధికారము లేదని నిషేధించునట్టి వచనములు జూపమన్న జూపకపోవుటయేగాక మేము స్త్రీ శూద్రాదులకు వేదాధ్యయనాధికారము గలదని శుక్లయజుర్వేదము ౨౬ అధ్యాయము ౨ మంత్రమునకు జెప్పిన అన్వయముగాక మాప్రతిపక్షులు జెప్పుటకును, జూపుటకును, బాధ్యతకలిగియుండునట్టి వ్యతిరేకాన్వయమును జూపవలసి వచ్చినదానికి గూడా మమ్ములను విద్యారణ్యభాష్యగ్రంథమును జూపమని అల్లముదినిన ఆంజనేయులపగిది వచించియుంటిరి. మీరిట్లు వచించుటకు కారణములెవ్వియైయుండునో అట్టికారణములును బూర్వోక్తమైన నిషేధవచనములును జూపుటకు బాధ్యులైయున్నారు.

౨. ఇదియునుంగాక నింద్రసరస్వతీ సంప్రదాయములో జగద్గురుపదమున కధికారము లేదనియు, భారతి సంప్రదాయమునకే జగద్గురుపదవి కధికారముగలదనియు, ఇట్లుగ సిద్ధాంత మొనర్చెదమనివాదించియుండుటచే నిందులకును బాధ్యులై యున్నారు.

౩. మరియును వాదసభను గూర్చి అజ్ఞానతిమిరభాస్కరమున యుదహరించిన పద్ధతులలో ప్ర ప్రథమమున యుదహరించిన పద్ధతిలో జెప్పబడినరీత్యా మేమును మీరును ఒప్పుకొనిన పంచాయతీదార్లలో నలుగురుబోగా నైదవవారిని నిర్ణయించుటయందు డిస్ట్రిక్టు కలెక్టరు మొదలగువారిని సభాధ్యక్షులుగా నియమించుటను మీరొప్పుకొనక బోయిన కారణమేమైనదియు దెలుపకబోతిరి.

అనిబిసెంటు ముద్రి వెంబడి యుండి స్వరాజ్యము కావలయునని తాళము వేయుచుండు బ్రాహ్మణులతోపాటు మీరు చేరకబోతిరి కాబోలు. కాబట్టి పైవివరించిన విషయమునకు తగుకారణ మెద్దియైయుండునో అట్టికారణమును దెలియబఱచుటకు బాధ్యులైయున్నారు.

౪. ఈ ఒకటి రెండు మూడు ప్రశ్నలకు తగు కారణములు (శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతి. కొంకుదురు గ్రామము, రామచంద్రపురం తాలూకా, గోదావరిజిల్లా. అని యిట్లు అడ్రసువ్రాసి పంపవలయును. ఇందులకు వ్యతిరిక్తముగవ్రాసి పంపిన చో వాపస్సు చేయుటయే గాక మీరు ప్రత్యుత్తరము వ్రాయనివారుగా భావింపబడును.

౫. ఈవిషయములనుగూర్చి వ్రాయునట్టి వ్రాతలు సర్వజనులకు దెలియునట్టిదియు, కోర్టులలో నుపయోగించునట్టిదియు, నైన యాంధ్రిభాషయందు వ్రాయవలయునే గాని తదితర భాషలలో దేనియందైనను వ్రాయకూడదు. అట్లు వ్రాసితిరేని మీరు మాకు ప్రత్యుత్తరమివ్వనివారుగా నెన్నుకొనుచున్నాము.

౬. ఈయుత్తరములో బైనుదహరించిన యట్లు 1920 సం॥ ఆగష్టునెల 20 తారీఖు మొదలుకొని ఈసంవత్సర సెప్టెంబరు నెల 20

తారీఖులోగా తగుకారణములు పై మూడుప్రశ్నలకు మీరువ్రాయక పోతిరేని ఉపన్యాసస్థలములో శాస్త్రివెంకటాయకేకలువేసి అట్లుగనే గంతులు వైచుచు నుపన్యాసములు చెడగొట్టినందులకై చోడవరం శాస్త్రివెంకటాయసిద్ధాంతి దుశ్చేష్టలు. అను శీర్షికతోను, శ్రీమదనార్య కువాదీంద్ర ప్రబల ప్రతాప ప్రచండ బృహన్మహావంచక సువివాద విముఖ ప్రముఖ దుర్భాషా ప్రౌఢ వాచస్పతి దుర్లక్షణా విచక్షణ దీక్షిత దుర్భాగ్యవంశోద్భవ పాతకభూయిష్ట చోడవర శాస్త్రివెంకటాయ సిద్ధాంతి బహదరు వారను బిరుదు గద్యంబులతోను కరపత్రములను ముద్రించి మీదుశ్చేష్టలను లోకము వారికి దెలియ గలందులకై ప్రకటించుచున్నాము.

౨. ఇదియునుంగాక నుపన్యాసములు చెడగొట్టినందులకును, మాసంఘమునకు కలుగజేసిన నష్టములకును, ఈకరపత్రములు ముద్రించుట మొదలగు వ్రయములకును, అయిన నష్టము అక్షరాలా పదివంచలరూపాయలకు క్రమప్రకారము మీవల్ల రాబట్టబడునను సంగతి ఇందుమూలమున దెలియబఱచుటయైనది.

౩. వెండియు నీరిజిష్టరీయుత్తరమును బుచ్చుకొనక బోయినను పై విధులననుసరించి ప్రవర్తింపబడునను సంగతి కూడా ఇందుమూలమున దెలియబఱచుటయైనది.

22–8–20,
మకాం,
కొంకుదురు.

శ్రీమత్పరమహంస,
స్వామి. జీ. యస్. బి. సరస్వతి.

**Note**:—అనియిట్లు వ్రాసి బంపియుండినను నేటివరకు ప్రత్యుత్తరములేక బోవుటచే మొట్టమొదట నీపత్రికను లోకమువారు గుర్తెరుగుటకై ప్రకటింపబడినది.

26–10–20,
మాజపేట.

శ్రీ
స్వహస్తమమ.

# బడాయి లుడాయించి డోలువాయించుట.

శ్రీమత్పరమహంస,
స్వామి జీ. యస్.
బి. సరస్వతిగారు.

మహారాజరాజశ్రీ ప్రబుద్ధాంధ్ర పత్రికాధిపతులగు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి.

౧. 1920 సం॥ సెప్టంబరు నెల 15 తేది మీచే ప్రకటింపబడిన ప్రబుద్ధాంధ్ర పత్రిక 1 సంపుటము. 6 సంచిక 4 పత్రము. 1 కాలము. 50 పంక్తిలో స్త్రీ శూద్రాదులకు వేదాధికారముకలదు అనుమాటకూడా అట్టి సుభాషితమే అనియిట్లు గప్పాలుకొట్టి బడాయిని ఉడాయించి డోలువాయించి బుఱ్ఱకాయనూది పాములవాని మాయను జేసి గడబిడాధ్యాయమును వ్రాసితిరి. అయ్యది బుడబుక్కలవాడు సద్య జెప్పినట్లయ్యెను.

౨. భళా వితండావాద మదవేదండ తాండవం బాడుచు కార్యాలమగు మాపై తొడతట్టి బుట్టలోని భట్టిపాములను బారవిడిచి తేలెల, ఏమిఫలము.

3. ఇందులకు సరియగు ప్రత్యుత్తరము వారము రోజులలో లిఖితరూపముగ నివ్వకబోయినను, రిజిష్టరు యుత్తరమును పుచ్చుకొనకబోయినను, రిజిష్టర్డు యుత్తరము పుచ్చుకొని ప్రత్యుత్తరమివ్వకబోయినను, బుద్ధిలేనివ్రాతలు వ్రాసిన బుద్ధిహీనులగు మీకు బుద్ధి వచ్చుటకై బడాయి లుడాయించి డోలువాయించుట అనునీశీర్షికతో కరపత్రములు ప్రకటించి లోకము వారికి మీదుశ్చేష్టలను వెల్లడించుటయే గాక ముమ్ముందు న్యాయస్థానములకు కూడా నెక్కుటకు సంసిద్ధులమై యున్నామని ఇందుమూలమున దెలియబఱచుచున్నాము.

21–9–20,
మకాం,
కొంకుదురు.

శ్రీమత్పరమహంస,
స్వామి. జీ. యస్. బి. సరస్వతి.

**Note**:—అని యిట్లువ్రాసి బంపియుండినను నేటివరకు బ్రత్యుత్తరము లేకబోవుటచే మొట్టమొదట నీపత్రికను లోకమువారు గుర్తెరుగుటకై ప్రకటింపబడినది.

26—10—20, } నూజవీడు. }

శ్రీ
స్వహస్తామమ.

---

శ్రీమన్నాడభూమి సింహాద్య్రప్పళాచార్యులవారి

# లేఖకు బహిరంగలేఖ.

స్వస్తిశ్రీమత్పరమ హంసేత్యాది సకల బిరుదావళి విరాజమాన స్వామి జీ. యస్. బి. సరస్వతిగారు.

శ్రీమదనార్య కువాదీంద్ర ప్రబల ప్రతాప ప్రచండ బృహన్మహా వంచక సువివాద విముఖ ప్రముఖ దుర్భాషాపౌఢ్రవాచస్పతి దుర్లక్షణా విచక్షణ దీక్షిత దుర్భాగ్య వంశోద్భవ పాతక భూయిష్ఠ కానుగోల్లు వెత్తివెంగళాయ సింహాద్య్రప్పళాచార్యుల బహద్దరువారికి.

అయ్యా!

౧. మీరుపేర 20—10—18 తేదీ యిచ్చిన లెటరులోతప్ప తదితర కాలముల యందు మావాదమునకు సరియగు ప్రత్యుత్తర మివ్వలేకపోవుటచే ఇటుపైమాకును మీకును వాదము లనపసరములని యిచ్చిన 19—11—18=4—12—18=19—12—18=2—2—19 ఈనాలుగు లెటర్లలో మేము మీకు అడ్రస్సుయిచ్చి ప్రత్యుత్తరము వ్రాయమని జెప్పియుండలేదు. అందుచేత మేము మీలెటర్లను దీసుకొనలేదని మాకు వ్రాయుట మీకు ముఖ్యముగ బాధ్యత కలిగి యుండజాలదు.

౨. ఇంతకు బూర్వము వ్రాసినలెటర్లలో నన్నిటియందును మావరత్తుల ప్రకారము సభజేసినప్పుడు మేమట్టి సభకువచ్చుటకు బాధ్యులమై యున్నాముగాని మాషరత్తులవినా మీయంతటమీరు ఇంటిలో

కుండలవద్దకూర్చొనియుండు ముసలమ్మల సమీపమున ఫ్ఛమూలయింటిలో నో జేయబడిన సభకు మేమువచ్చుటకు బాధ్యులము గాజాలమని ఇం తకు బూర్వమే దెలియబఱచి యున్నాము. ఇట్టిస్థితిలో మేము మీసభ కు రాలేదని వ్రాయుట తెలివితక్కువలో మరియు తెలివితక్కువై యున్నది.

3. ఇటుపై మీలెటరులో నుదహరించి యుండు నామముగల వారెవరును మమ్ముల సభకు రమ్మనమని చెప్పియుండలేదు. అయినను ఝండమూరుకాపరస్తులగు మహారాజరాజశ్రీ కాకర్లపూడి వెంకటసు బ్బరాజుగారును మాకు పేర్లుతెలియనివారిలో మరికొందరును మమ్ము లను సభకురావలసినదిగా బిలిచిరి. ఇట్టిస్థితిలో సభ యెక్కడదని మే ము ప్రశ్నించ సింహాద్రిప్పళాచార్యులవారు మీవాదమును ఖండనజే యబోవుచున్నారు కాబట్టి మీరు ఆసభకు రావలయునని బిలిచిరి. అం తట మేమందులకు ప్రత్యుత్తరము చెప్పినదేమన్నను ఇదివరలో సింహా ద్రిప్పళాచార్యులవారు పత్రికావాదమున మాతోవాదించి యోడిబో యియుండుటచేతనున్ను, ఇట్టిసభలు జేయుటకు ముందు మాకు దెలియ బఱచకబోవుట చేతనున్ను, మాఅనుజ్ఞను బొందకబోవుట చేతనున్ను, మావరత్తులప్రకారము చేయనట్టి సభకున్ను మేమురాజాలమని యిట్లు చెప్పితిమి. అయినను మీరువచ్చి పిలుచుచున్నారు. కాబట్టి మేమును సంసిద్ధులమైయున్నాముగాని ఇట్టిమధ్యస్థరహితమైన సభవలన మున్ముం దు మాకుకలుగునష్టముల కన్నిటికి మేము బాధ్యులమై యుండుమనిస రియగు కాగితమును వ్రాసియిప్పించితిరేని మేమీతక్షణము బయలుదేరి వచ్చుచుంటిమి. అందులకు బూర్వోక్తులగు వారెవ్వరు బాధ్యులమై యుందుమని నుడవక వెళ్ళిపోవుట తేటస్థపడినది. ఇట్లు మేము సంభా షించుకొనిన సమయములో వాదమును వినుచుండినవారు మహారాజ రాజశ్రీ మెర్ల చినరామన్నచౌదరిగారును, ఈపెదరామన్నచౌదరిగా రును, కొంకుదురు గ్రామమునసపును, మరియు తాలూకాబోర్డుమెంబ రును, అయిన సబ్బెళ్ళ వద్దయ్యరెడ్డిగారును, వడాల రామిరెడ్డిగారు

ను, తాడి రామన్నరెడ్డిగారును ఈమొదలగు ప్రముఖులు నాసమయమున నూరుమందచ్చటయుండిరి. అవసరము తటస్థపడినచో పై సంగతులు వారివలన రుజువుపరచగలము.

౪. ఇదియునుంగాక మేమద్వైత మతస్థులమై యున్నామని 15–1–18 తేదీన పల్లటూరు వైదిక పిశాచవృత్తులను కరపత్రమందు మేము ప్రకటించి యుండుటయేగాక మాకును మీకును జరిగిన రిజిష్టరీ యుత్తరములలో పెక్కుస్థలములయందు గనుబరచి వ్రాసి యుండినప్పుడు అదిగుర్తెరుగక ఇదియార్యసమాజ వాదమని తిండి ఎక్కువై తెలివి తక్కువగ వ్రాసియున్నారు.

౫. ఇప్పుడు యిందువలన మీకు తెలియ బఱచునదేమన్నను మాకును మీకును గలిగిన పత్రికా వాదము వల్లగాని, మరియు రౌద్రి సం॥ భాద్రపదశు ౪ రోజున వేళంగి పాతూరివారిసత్రములో మీరుజరిపితిమని వ్రాసిన యవకతవక సభవల్లగాని, మావాదమును ఖండింపజేయలేకబోవుటచే పూర్వోక్తములైన మాపత్రికలలో వ్రాయబడిన నియమానుసారము మీరోడితిరనియు ఇందుపైన బొందు పఱచిన బిఱుదు గద్యములతోను ఇటుపై మిమ్ముల విచారించకనే శాస్త్రిపంగళాయ సింహాద్రిప్పళాచార్యుల దుచ్చేష్టలను కరపత్రములందు మావాదమును ఖండించుటకు శక్తిసమర్థులు చాలక శాస్త్రిపంగళాయవలె అల్లరి సభలు చేసినట్లు వ్రాసితిరని ప్రకటించుటయే గాక మరియును మహారాజరాజశ్రీ మార్ని వీరన్నగారు మీతోను మీకు సహాయ భూతులుగా రాబడిన పండితులతోను ఓనమో నారాయణాయఅను నీమంత్రమును గూర్చి వాదించి మిమ్ములపరాభూతులుగచేసి నట్టును మీరుపాతూరివారి సత్రములోకి వచ్చునప్పుడు సింహద్వారము గుండ వచ్చి వెళ్ళునప్పుడు ప్రక్కద్వారముగుండ వెళ్ళినట్టును బూర్వోక్తులగు మ. రా. రా. శ్రీ మార్ని వీరన్నగారు మాతోచెప్పిరిఅప్రకారము కరపత్రములుగూడా బ్రకటింపమని మమ్ములగోరి యుండుటచే మిమ్ములను మీతో వచ్చిన

పండితులను గలుపుకొని తేచిరిగా మగధీరులు అందులకుగాదు అల్పా చమనమునకు అను శీర్షికతో నొక కరపత్రికయును, ఇట్లుగ రెండుకర పత్రములను ముద్రించి ప్రకటించుచున్నామను సంగతి ఇందువల్ల దెలి యబఱచుటయైనది.

౬. ఇంతియేకాదు. మాలెటరును మీరు బుచ్చుకొనక బో యినను బుచ్చుకొనినను, మాకు జమాఖర్చులేదనియు, మావిద్యుక్త విధి ననుసరించి యీయుత్తరమును వ్రాసిబంపితిమని కూడా దెలియ బఱచుచున్నాము.

28-9-20,
మకాం,
కొంకుదురు.

శ్రీమత్పరమహంస,
స్వామి. జే. యన్. బి. సరస్వతి.

ఇటుపై శ్రీవారికిని వేళంగి గ్రామ వాస్తవ్యులగు శ్రీమాన్ అను మంచిపల్లి నృసింహాచార్యులు, బ్రహ్మశ్రీ గుండు రామమూర్తిశాస్త్రులున్, బ్రహ్మశ్రీ గుండు రామబ్రహ్మశాస్త్రులున్ ఈమొదలగువారితో డను వాదప్రతివాదములు జరుగుచున్నవి. అందుల విషయములన్ని యిచ్చట వ్రాయుటకు గ్రంధవిస్తరభీతిచే విరమించితిని.

## ఉపక్రమము.

అశ్లీలశృతి తత్వబోధకత్వరూప కవచ సంవృతమగు జగద్వంచ నాపాండిత్య పీఠమందు నిరంకుశ రాజ్యమును జేయ నభిలషితులై స్వ మతస్థాపన పరమతఖండన విద్యా శూన్యులై న్యాయమార్గమునకు బ హుదూరమున స్వచ్ఛందవిహారము జేయ గొంతెమ కోర్కెలం గోరు వారలై ఉత్తమోత్తమత్వము నందగోరి అధమాధమస్థితికి వచ్చియు న్నది నెరుంగక మాధ్యమస్థితి నంగీకరించజాలని బాహ్యోక్తులగుయీ పండిత వర్యులలో మేటియగువారు శివపురపు వీరభద్రపాకయాజిగారై యున్నారు.

అశ్రుత్యై ధర్మరతుడైన కదీక్షా పకతంత్ర ధార్మికానుగ్రహో పరి భాషి పాషండ పతిత పాకయాజిగారి గాథ యగాధమని యోధాన యోధులు పరిశోధించ సాధ్యముకానందున యూరక విడిచినట్లు పాడ గట్టినను నీరు చూరకలోతు నిజముగ దెలియదను వాక్సరణిబట్టి నేనిది బూనియుం గాలుసేతులాడక కర్తవ్యమేమని యాలోచించి రోటిలో తలదూర్చి రోకటిపోటుకు వెరవనగునాయని యొక్కింత ధైర్యమూని వీరివిషయమైన చర్యలను నాశక్తికొలది చర్చింప సాహసించితిని. ఇం దుగల సంగతులకు మించినవి నామిత్రులేరికి మనోగోచరములైనను నాకు దెలిపి నన్ను యుద్గ్రంథమును రచింపునటుల జేయుమరని కోరు చున్నాను.

పాకయాజిగారి పాషండత్వ నిరూపణము.

శ్లో॥ పాషండినోవికర్మస్థా న్బైడాలవ్రతికాన్ శఠాన్।
హైతుకాన్బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపినార్చయేత్॥
మనుస్మృతి ౪ అధ్యాయము ౩౦ శ్లోకము.

ఇందులకర్థమేమన్నను పాషండులనగా వేదబాహ్యమైనటువంటి లింగమును ధరించి పూజించువ్రతము ముఖ్యముగాగలవారు. వీరితో సమానులైనవారు బైడాలవ్రతికులును, బకవృత్తులు గలవారును, శఠు లనగా వేదవ్యతిరిక్తతర్కములచే ప్రవర్తించువారును అయియున్నారు. ఇట్టివారు అతిథులుగవచ్చినేని మాటమాత్రముచేనైనను గౌరవించరా దు. అనియిట్లు జెప్పిన యభిప్రాయమున కనుగుణ్యముగనే కుల్లూకు భట్టుకూడా బై శ్లోకమునకు నీక్రింది విధమున వ్యాఖ్యానముజేసి యు న్నారు.

వ్యాఖ్యానము.—పాషండినఇతి॥ పాషండినో వేదబాహ్య వ్రత లింగధారణశాక్త్య భిక్షుఖ్యాగణకాదయః। వికర్మస్థాః ప్రతిషి ద్ధజీవినః। బైడాలవ్రతిక బకవృత్తివక్ష్యమాణలక్షణౌ। శఠాః వేదేషు అశ్రద్ధదానాః హైతుకావేదవిరోధి తర్కవ్యవహారిణః।

ఏతానతిథి కాలోపస్థితాన్ వాఙ్మాత్రేణాపి నపూజయేత్। పూజారహితే అన్నదానమాత్రంతు శక్తితోపచ మానేభ్య ఇత్యనుజ్ఞాతమేవ॥

అనియిట్లు మనుస్మృతి వచించియుండుటచే యీపాకయాజి వేదబాహ్యమైన పాషండ మత మవలంబించిన వారగుటవలన పాషండులని చెప్పఁచున్న వాడను. మరియు నీయభిప్రాయము క్రిందవ్రాయు గ్రంథ సందర్భమునుబట్టి విపులముగ తెలియుచున్నది.

బృహన్నారదీయే.—శ్లో॥ లింగాంకిత తనుం దృష్ట్వా చక్రాంకితం తథా। స్నానమేవ తథాకార్య మథవాసూర్య మీక్షయేత్। పతితంత స్తులింగాఢ్యం చక్రాంకిత మథాపివా। వాఙ్మాత్రేణాపి నార్చేత పాషండాచారతత్పరం। శూద్రవత్స పరిత్యాజ్యో జీవచ్ఛవ సమాకృతిః। తస్మైదత్తంచ హవ్యంచ కవ్యంచాపివృథా భవేత్। తద్దర్శనాత్పరిత్యాజ్య మన్నం మంత్రాదిమంత్రితం! అపిశూద్రేక్షణాద్భుంక్తే ల్లింగచక్రాంకినం వినా। అపిచేన్నిగమాచార రతోవేదాంగతత్పరః। లింగచక్రాంకమాత్రేణ ససద్యః పతితోభవేత్॥

మార్కండేయపురాణే.—బ్రాహ్మణానాంచ గాయత్ర్యా సంవాదో భూన్మహాన్పురా అతస్తయాపి సంశప్తాః పాషండాశ్చశదేవతాః। వేదోక్తకర్మహీనాశ్చ తాంత్రికాచారతత్పరా।యూయంకతా భవంత్యేవమితి తానాహసారుషా। అతః కలియుగేప్రాప్తే భవిష్యంతి ద్విజాధమాః। వేదార్థహీన పాషండా లింగచక్రాంకాది చిహ్నితాః। జ్ఞానకర్మ పదభ్రష్టాః కామక్రోధాదిపీడితాః। దురాత్మాన స్సత్యధర్మవర్జితాశ్శాపభోగినః। కతాత్రింశత్సహస్రాబ్దే పూర్ణేనష్టాభవంతితే। నిశ్శేషతాంగతాః పశ్చాదద్వైతానుచింతకాః। సత్యధర్మ పరాభూయోం భవిష్యంతినసంశయః॥ ఇతి.

ఆనందగిరి శంకరవిజయము. పంచమప్రకరణము.

అనియిట్లు నానందగిరి శంకరవిజయము ౫ ప్రకరణము ౩౯—౪౦ పేజీలయందు జెప్పబడియున్న పై వచనములయొక్క యభిప్రాయమే మన్నను, లింగధారణాది చిహ్నములను ధరించినవానిని జూచితిమేని స్నానముజేయుటగాని సూర్యునిజూచుట గలిగినప్పుడుగాని తద్దోషపరిహారమగుననియు, పాషండాచార తత్పరుడగు లింగధారణాది చిహ్నములు గలవానిని వాఙ్మాత్రముచేనైనను గౌరవముజేయగూడదనియు, ఈపాషండాచార తత్పరులగు వారిని శూద్రునివలె పరిత్యజించవలయుననియు, ఇతనికి హవ్యకవ్యములలోని యేపదార్థమునైనను యివ్వగూడదనియు, పాషండాచారతత్పరులగు లింగధారణాది చిహ్నములు ధరించినవారు జూచినచో గాయత్ర్యాది మంత్రములచే ప్రోక్షింపబడిన యన్నమైనప్పటికిని పరిత్యజించతగినదనియు, వేదవేదాంగతత్పరుడైనవాడైనప్పటికిని లింగధారణాదిచిహ్నములు గలిగియుండినచో నాతఁడు ణము పతితుడగుచున్నాడనియు, ఈపాషండాచార తత్పరులగు లింగధారణాది చిహ్నములు గలవారు వేదోక్తకర్మలు లేనివారనియు, జ్ఞానకర్మ పదభ్రష్టులనియు, కామక్రోధాదులచే పీడింపబడిన వారనియు, దురాత్ములనియు, సత్యధర్మములు లేనివారనియు, శాపభోగులనియు, అని యిట్లుగ దెలియబడుచున్నది.

ఈపాకయాజి శ్రౌతధర్మసంజీవని సంపుటము 1 సంచిక 1 పేజీ 10, 11 లో స్వచరిత్రమున తాము లింగధారణాది చిహ్నములనుధరించుకొనిన శైవబ్రాహ్మణుల కుటుంబమున జన్మించితిమని జెప్పుకొనియున్నారు. అందువలన యీపాకయాజిగారిని పాషండ పాకయాజిగారని జెప్పుట యగుచున్నది. ఇందువలన వీరికి వేదాధికారమును వేదాధ్యయనాధికారమును లేనట్టు దెలియుటయేగాక వీరిని భోజనకాలమప్పుడైనను, తదితరకాలమప్పుడైనను జూచుటకు వీలులేనంత హీనత్వముగు వాక్యములవలన దెలియబడుచున్నది. ఇట్టిస్థితిలో వీరు గోదావరి పెంటలవరదయను వ్యాసమును వ్రాయుచు నందులో 13 పేజీయందు "అని యనుకొమ్మని మాకు వేదముచెప్పినది. అనియిట్లు వేదాధ్యయ

నాధికారములేని తమకు వేదాధ్యయనాధికార మున్నట్టు బడాయిని ఉడాయించి డోలువాయించియున్నారు. మరియు వీరు పాషండషండుల లో శ్రేష్ఠులును, శూద్రతుల్యులును, అపాంక్తేయులునై యుండయిట్టి లక్షణోపేతులగు వీరు నీయవకతవక వ్యాసమును వ్రాసి నాశ్చర్యజనక మును గలుగజేయుచున్నారు.

పాకయాజిగారికి పతితత్వ నిరూపణము.

ఇంతియేగాదు కృష్ణామండలంబున బందరు తాలూకా వడ్లమన్నాడు పరగణాలోచేరిన గండ్రమనుగ్రామమునందు గండ్రపు లింగయ్యగారను శైవబ్రాహ్మణులొకరుగలరు. ఈయనభార్య నొక పంచమునితో కొద్దికాలము నుండి సంపర్కము గలుగ జేసుకొనినదనియు, మరియు కొంతకాలము వాని సమీపమున మాలవాడలో నివసించియుండినదనియు, అను నీవిషయమునుగూర్చి యీప్రాంత్యములయందు శైవబ్రాహ్మణులను వారిరుతెగల వారై యున్నారు. ఇందులోనొక తెగవారు గండ్రపు లింగయ్య భార్యను గలుపుకొని యీకధానాయికి యింట భుజించినవారును, ఇట్లు భుజించినవారితో గలసి భుజించినవారును జేరి ఒక తెగవారై యున్నారు. రెండవది యట్లుగాదు కధానాయికి యింటభుజించినవారినిగాని అట్లు భుజించినవారితో పంక్తిని భుజించిన వారినిగాని దమపంక్తికి రానీయమను తీవ్రమైపట్టుదలగలవారు. అని యిట్లుమనము గుర్తెఱుగతగియున్నది.

ఇందులో సంఘ సంస్కార దుర్వాదప్రచారణ దీక్షాబద్ధ కంకణ కవిరాజి పాషండ పతిత పాకయాజిగారు గండ్రపు లింగయ్య భార్యతో గలుపుకొని యీకధానాయకియింట భుజించినవారగు మొదటికక్షలో జేరినవారై యున్నారు. ఈపాషండ పతిత పాకయాజిగారు మొదటికక్షయగు తమకక్షలో జేరని తదితరులను నోటీసు బెదిరింపుల వలన తమకక్షలోదింపుకొనుటకును, తాము శ్రుతిధర్మసంజీవనిపత్రికాధిపతులై యుండుటచే మిథ్యావచనములను పత్రికల కెక్కించి నెంతెమో గొప్పగనుండునటుల లిఖించి చందాదారుల మనంబుల సంతుష్టి పరచుటకును, ఇట్లుగ యత్నించువారై యుండునట్టు గన్పట్టు చున్నది.

ఇందులిఖించిన వైవిషయములో నేనేనియు మీకు నూతనము గజెప్పక కృష్ణాజిల్లా బందరు బుట్టయ్యపేటలో నివసించు మహారాజ రాజశ్రీ చాగంటి వియ్యన్నగారిచే బ్రకటించుచు మూడుకరపత్రములను ఇందు బొందుపఱచుచున్నాడను.

ఇంతియేగాదు యిందువిషయమై అవసరముగలిగినచో ఋజువు పరచుటకును సంసిద్ధుడనైయున్నాను.

# గంద్రపుకక్ష.

శివపురపు వీరభద్ర పాకయాజిగారికి,

బహిరంగలేఖ.

అయ్యా,

మీరు 15 జూలై 1920 సం॥ ప్రచురించిన శ్రుతిధర్మ సంజీవనీ పత్రికయందు గంద్రపుకక్షయను శీర్షికతో కొన్ని యంశములు ప్రకటించియున్నారు. దానిలోని కొన్ని వాక్యములను బరిశీలించిచూడ నాకొంట్లకు నాశ్చర్యము గలుగుచున్నది. యజించిన మీకే సత్యమును బ్రకటింప సాహసింపలేక దానిని గప్పిపుచ్చుచున్న బాహ్నికృతజనంబేమి కాదలంచునో! వర్ణాశ్రమాచారములనిల్పు బద్ధకంకణులయిన మీరు మావంటి వాహ్నికృతజనంబునకు నిట్టి దారులు చూపుటమాత్రము కేవలము శోచనీయము.

ఇప్పుడు మీరు స్వీకరించిన పదవికమాత్ర మీక్రింది కారణముల వలన మీరర్హులుకారని విశదపరచుచున్నవాడ.

1. మీరు మీపత్రికయందు శైవబ్రాహ్మణులయందు రెండుకక్షలున్నవని యొప్పుకొనియున్నారు. అట్టిచో నిరుపక్షములవారు మిమ్ము లను మాధ్యస్థునిగా గోరనప్పుడు గంద్రపుకక్షపై దీర్పుచెప్పుటకు మీక ధికారమెట్లులవడు?

2. మీకును శైవబ్రాహ్మణులచే వెలివేయబడిన గండ్రపు లింగయ్యగారి పక్షమునకును సంబంధ మున్నట్టునానమ్మిక. నమ్మిక యన నేల? అవసరము వచ్చినపట్టున ఋజువుచేయగలను. అట్టిచో మీరు చేయబూనిన యీపని స్వార్థపరాయణత్వమును సూచించును గాని లోకోపకారము కానేరదు. మీ కంటియున్న కళంకమును బోగొట్టుకొనుటకు మీరు యత్నించుచున్నారని లోకము విశ్వసించుచున్నది.

3. గుడివాడ, బందరు, బెజవాడ, ఏలూరు తాలూకాలయందున్న శైవబ్రాహ్మణులను దత్సంబంధమున్న స్మార్త బ్రాహ్మణులను యీకక్షకలగుండుపఱచుచుండగా మీరు గుడివాడ, బందరు తాలూకాలలోనున్న శైవ బ్రాహ్మణులలోనే కలవర మున్నదని వ్రాయ సాహసించితిరి.

తుదకు వేయేల? గండ్రపు లింగయ్యగారిపక్షమున తానితందాన పదాలు పాడుచు తాళము వేయుచున్న మీకు మతవిషయక చర్చయందు జొరఁగూడదు శైవబ్రాహ్మణులను శాసించు నధికారము లేదని ఘంటాపథముగ చెప్పుచున్నాను.

కావున గండ్రపు కక్షపై మీరు వ్రాయబోవు దీర్ఘ్యాని విమర్శకాని శైవబ్రాహ్మణులు సమాదరించవలయునని మీకు సద్బుద్ధియే యుండినయెడల దానివలననే మీకు ప్రాయశ్చిత్తము చేయించు కొనుగాని యిరుపక్షములవారిచే మాధ్యస్థపదవిని పొందిగాని జేయవలసియుండు అట్లుకానిచో ప్రయోజన మేమియు నుండబోదు.

బందరు,  
బుట్టాయ్యపేట,  
12-8-20.

ఇట్లు  
చాగంటి వియ్యన్న,  
శైవమతాభిమాని.

# గండ్రపు కక్ష.

శివపురపు వీరభద్ర పాకయాజిగారికి  
ద్వితీయ బహిరంగలేఖ.

అయ్యా?

మీరు 4-8-20 వ తారీఖున వ్రాసి యంపిన "రిజిష్టర్డు కార్డు" అందినది, తల్లేఖ ప్రకటిత భవత్పరిజ్ఞానము నాకు చిరునవ్వో, వికటాట్టహాసమో, కల్పించినది. ఇట్టిలౌకిక జ్ఞాన వంతులైన మీరా శ్రుతిధర్మముల పునరుద్ధారణ జేయుట! మతధర్మముల స్థాపించుట! కట్టా! విచిత్రము.

మీరు నన్ను వెలి (బహిష్కార) పత్రిక పంపుమని గోరినారు. బ్రాహ్మణ సంఘము కానిండు? తద్భిన్న సంఘము కానిండు, హిందూ సంఘము పతితుల బహిష్కృతులజేసి యాత్మరక్షణ జేసికొనుట ద్వివిధము.

(1) మతాధ్యక్షుడు, అనగా పీఠాధిపతిచేత బహిష్కార పత్రిక గొనుట.

(2) సంఘమునందలి శిష్టమనుష్యులే యాకృత్యమును స్వీకరించుట.

ఇందు మొదటివిధము సాధారణముగా సంఘము నిర్జీవమై యున్నయప్పుడవలంబింపబడు రెండవ విధానము సంఘము జీవవంతమై ఆత్మరక్షణ శక్తివంతమై యున్నయప్పుడవలంబింపబడును.

మన శైవబ్రాహ్మణ సంఘము సజీవమై యుండుటజేసి ప్రథమవిధానమును శరణుబొందక రెండవవిధానమునవలంబించుటయే సర్గికము. ఇయ్యది పత్రికా మూలముననే జరుపబడు టగత్యముగాదు. కావున గంద్రపు లింగయ్యగారి బహిష్కారమునకు వెలిపత్రిక యనవసరము. కాని గంద్రపు లింగయ్యగారు వెలిపెట్టబడెనను విషయము తెలియ కొనగోరుదురో! అట్లయిన వినుడు.

1. గండ్రపు లింగయ్యగారి జనకమాతయగు పరసమ్మగారి ఉత్తరక్రియలకు మాహేశ్వరబృంద మేల రాలేదు?

2. స్మార్త మతాచార విధిని కర్మ జరుగుటకు కారణమేమి?

3. పెడసలో మాహేశ్వరబృందము సమావేశమగుటకు కారణమేమి?

4. ఆసమావేశములో గండ్రపు లింగయ్యగారి కుటుంబమును శైవబ్రాహ్మణ సంఘములో చేర్చుకొనుటనుగూర్చి యేల చర్చింపబడినది.

5. గండ్రపు లింగయ్యగారి గురువుగారైన పండితారాధ్యుల మహాదేవయ్య అయ్యవార్లంగారును, కాశీనాథుని భద్రయ్యా అయ్యవార్లంగారి కుమారుడు బ్రహ్మయ్యగారును, కాశీనాథుని అల్లమయ్య అయ్యవార్లంగారి కుమారుడు మల్లికార్జునుడుగారును, గండ్రపు లింగయ్యగారి భార్య సోదరుడగు సింగరాజు గంగాధరరావుగారును, ప్రాయశ్చిత్తము చేసికొనుటకుగల హేతువేది.

6. మన సంఘనాయకులును, ఆంధ్రపత్రికాధిపతియు నగు మ. రా. రా. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు గండ్రపు లింగయ్యగారింట భోజనము చేసినవారికల నెల్లర ప్రాయశ్చిత్తము చేసికొమ్మనుటకు కారణమేమి? అట్లు వారందరేల చేసికొనిరి.

7. గండ్రపు లింగయ్యగారికోడలు (తాళ్ళూరి సీతారామయ్య గారి పుత్రిక) బంధుత్యాజ్యమై విధివిధాన విహీనతమై యేల యత్తవారింటికి పంపబడినది.

8. కాశీనాథుని బ్రహ్మయ్యగారి పుత్రుడగు మృత్యుంజయరావుగారు గండ్రపులింగయ్యగారి కుమార్తెను పెండ్లియాడినప్పటి నుండియు వారింటి కెవ్వరేలబోరు?

9. అయ్యా! స్వామీ! మహానుభావా! పాకయాజిగారు! మీరు మీవియ్యంకునిగారింటికి గానసమునకు వెళ్ళినప్పుడు భోజనమిడక మాటలతో నోదార్చి గడపతొక్కనీయకుండ నవలికేల మిమ్ముల సాగనంపిరి? అత్తవారింటికై వెళ్ళిన మీకుమరునకు జరిగినదియేమి? ఎందులకు?

10. నిజమాడిన నిష్ఠురముకదా! మీరు మీ వియ్యంకునిగారి కేమని బెదరించి యుత్తరమువ్రాసితిరి? మతోద్ధారక రెండవకోడలిని ఏమిచేసెదనని వియ్యంకుని కుత్తరమువ్రాసితిరి? ఎందులకట్టి యుత్తరమువ్రాయవలసి వచ్చినది! ఏమి పరోపకారశీలత! కన్నుమూసికొని పాలుద్రాగినంతలోకము చూడజాలదో! ఇంకనుమీకు కృత్రిమపదస్వీకరణముచే గల్గిన గర్వము వీడకున్నది గదా! కాలిపత్రిక నాల్గురోజులలో నంపకున్న జేయునదేది!

బందరు
బుట్టయ్య పేట,
21-8-20.

ఇట్లు,
చాగంటి వియ్యన్న,
శైవమతాభిమాని.

## గండపుకత్తు.

---

శివపురపు వీరభద్ర పాకయాజిగారికి,
తృతీయ బహిరంగలేఖ.

అయ్యా!

మీరు 23-8-20 వ తారీఖునవ్రాసియంపిన "రిజిష్టరు" అందినది. తగుసమాధానము లేమింజేసి కల్గిన తబ్బిబ్బు యీ యారతారలంబడిన యుత్తరమునకుం గారణము! ఎట్టిమాట! శ్రుతిధర్మోద్ధారకాబద్ధకంకణులకిట్టితబ్బిబ్బుపాటుకల్గునా? ఇదినాయప్రాజ్ఞతాదోషమా!

1. నాద్వితీయబహిరంగలేఖయందు నెన్నండు గ్రంథపు లింగయ్యగారు ప్రాయశ్చిత్తము జేసికొనెనని వ్రాసి యుండలేదే. అట్టిచో నేనట్లు "సెల" విచ్చితినని కార్డునందేల వ్రాసితిరి! నామొఱక చాలమి క్షమింపుడు. పెద్దలనోట బయలుదేర్పు సుద్దియంతయు నిబద్ధయని యిప్పుడెఱింగితి.

2. ముంజేతి కంకణమునకు నద్దము కావలయునను మీముబోట్లకు నాబోట్లేమి చెప్పగలరు? మీరు 22-6-20 వ తారీఖున మీ రెండవ వియ్యంకునికి వ్రాసిన యుత్తరమునందు మీతోడియల్లుడు మ

ల్లంపల్లి మల్లికార్జున శాస్త్రిగారు వెలిబడి యుండెవనియు వారియింట కూడ కుమారుడే భుజియించె ననియు నప్పటికి నింకను మీ కుమారుడు మీయింటికి రాకయుండుటచే నపవిత్రుడనుగాక పవిత్రుడనుగనే యుంటిననియు నేలవ్రాసితిరి? దీనినెల్ల నెఱింగియు నిద్రమైకమున నున్నవానివలె నెఱుగ నట్లేల నటింతురు? ఇది శ్రుతిశిరోద్ధారకుల లక్షణమో! ఆత్మవంచకుల లక్షణమో!

3. అబముసుబ మెరుంగని ముక్కుపచ్చలారని మీ రెండవ కోడలిని నేమిరో చేసెదనను నాటియుత్తరపు బెదరింపులచే శివలెంక పున్నయ్య మల్లంపల్లి భైరవప్రసాదరావు గారలు మీయింట భుజియించుటం జేసి సనాతన వీరశైవాచారసంపన్నులగు శైవబ్రాహ్మణులు వారి గడపనైన నేల త్రొక్కుటమానిరి. మహానుభావా! మేల్కొని నిదురించువాని నెవరు లేపగలరు. బూటకములతో స్వమతస్థులను చిరకాలము మోసపుచ్చుట సాగదుసుండీ.

4. వర్ణ సాంకర్యము గల్గిన నితరులునగుదురేమోయనుభీతి నిని వ్రాయుచుంటిని గాని, నేనేమిత్రివ్వి తలకెత్తుకొనుటకు గాదు. ఇయ్యది నాతెరమును గాదు.

5. కావున మీకు శైవబ్రాహ్మణ సంఘోద్ధరణము జేయవలెననియున్న విధివిధానసహితముగా బ్రాయశ్చిత్తము జేసికొని సంఘమునందు జేరుట శ్రేయస్కరము.

బందరు, బుట్టయ్యపేట,
3-9-20.

ఇట్లు
చాగంటి వియ్యన్న,
శైవమతాభిమాని.

ఇట్టికరపత్రములెన్నియో యీవిషయమును దెలియజేయునట్టి కరపత్రములు గన్పడుచున్నవి. వాటినన్నిటిని యిచ్చట ముద్రించుటకు గ్రంథము విస్తరించునను భీతిచే ముద్రించుట మానితిని.

ఈ బహిరంగ లేఖలు మూడింటిలోను మొదటి దానియందు పాషండపతితపాకయాజి తమచే ప్రకటింపబడు శ్రుతిధర్మసంజీవని అను

సీపత్రికలో 1920 సం॥ జూలై నెల 15 తేది ప్రకటించిన గంద్రపు కథ యను శీర్షికయందు బూర్వోక్తమైన గంద్రపు లింగయ్యగారి భార్యవిషయమై బ్రకటించిన దానియందు ముఖ్యాంశములగు చండాలను సంసర్గాదులమాటలను గూర్చి ప్రస్థాపించక వాటినన్నింటిని మఱుగు పఱచి ప్రకటించియున్నట్టును. ఇట్లు యీపాషండపతిత పాకయాజిగారు ప్రకటించిన విషయమై మ. రా. రా. శ్రీ చాగంటి వియ్యన్నగారు ఆశ్రుతిధర్మ సంజీవని పత్రికలో బ్రకటించిన గంద్రపుకథనుగూర్చి నాక్షేపించుచు బహిరంగ లేఖయను నొక కరపత్రమును ముద్రించి 12–8–20 తేది బ్రకటించియున్నట్టు దెలియుచున్నది.

అందులో 2 వ పేరాయందు "మీకును శైవబ్రాహ్మణులచే వెలివేయబడిన గంద్రపు లింగయ్యగారి బసముసకును సంబంధమున్నట్టు నానమ్మిక. నమ్మికయననేల అవసరము వచ్చిన పట్టున ఋజువు చేయగలను. అట్టిచో మీరు చేయబూనిన యీపని స్వార్థపరాయణత్వమును సూచించునుగాని లోకోపకారము కానేరదు. మీకంటియున్న కళంకమును బోగొట్టుకొనుటకు మీరు యత్నించుచున్నారని లోకము విశ్వసించుచున్నది.

ఇట్టివాక్యములచే పాషండపతితపాకయాజీగారికిని గంద్రపులింగయ్యగారి భార్యయొక్క కథకును సంబంధముండినట్టు ముఖ్యముగ మనము గుర్తెరుగ దగియున్నది.

ఇదియునుంగాక పాషండపతితపాకయాజిగారు యీకథలో జేరియుండుటచే వీరినికూడా వెలిబెట్టినట్టు యీక్రింది వాక్యములవలన ముఖ్యముగ మనము గుర్తెరుగ దగియున్నది.

తుదకు వెయ్యేల గంద్రపు లింగయ్యగారిపక్షమున తాని తందానపదాలు పాడుచు దాళము వేయుచున్న మీకు మత విషయక చర్చయందు బ్రాహ్మణ శైవబ్రాహ్మణులను శాసించునధికారము లేదనిఘంటాపథముగ చెప్పుచున్నాను కావున గంద్రపుకథపై మీరు వ్రాయబోవు దీర్ఘ గాని విమర్శగాని శైవబ్రాహ్మణుల సమాదరించవలయు

సని మీకు సద్బుద్ధియేయుండిన మొదల దొలుదొల్తనే మీరు ప్రాయశ్చిత్తము చేయించుకొనిగాని యిరుపక్షములవారిచే మాధ్యస్థపదవిని పొందిగాని చేయవలసి యుండును. అట్లుకానిచో ప్రయోజనమేమియునుండబోదు.

ఇటుపైన పాషండపతితపాకయాజిగారు మ. రా. రా. శ్రీ చాగంటి వియ్యన్నగారిపై కినుకజెంది ఏమియుజేయుటకు శక్తిసమర్థతలు జాలక బుడ్డబెదిరింపులతో నిండియుండునట్టి నొక రిజిష్టరి కార్డును 14–8–20 తేదీన మ. రా. రా. శ్రీ చాగంటి వియ్యన్నగారి పేర గంద్రవు లింగయ్యగారినిన్ని తత్కుటుంబమునున్ను వెలిబెట్టినట్టు బహిష్కారపత్రికను మీరు పంపదగియున్నారని యొక రిజిష్టరినోటీసును పంపియున్నారు.

ఈరిజిష్టరీ యుత్తరమునకు మ. రా. రా. శ్రీ చాగంటి వియ్యన్నగారు 21–8–20 తేదీన శివపురపు వీరభద్ర పాకయాజిగారికి ద్వితీయబహిరంగలేఖ అను సీర్షికతో నొకకరపత్రమును ముద్రించి ప్రకటనజేయుచు తద్వారా ప్రత్యుత్తర మంపి యున్నారు. ఆపత్రికలోని యీ క్రింది వాక్యములచే బహిష్కార పత్రికను పంపదగినదని పాషండపతిత పాకయాజిగారు వ్రాసినట్టు మనము గుర్తెరుగ తగియున్నది.

"మీరునన్ను వెలి (బహిష్కార) పత్రిక పంపమని గోరినారు. బ్రాహ్మణసంఘముగానిండు తద్భిన్న సంఘము గానిండు హిందూ సంఘము పతితుల బహిష్కృతులజేసి యాత్మరక్షణము జేసుకొనుట ద్వివిధము.

1. మతాధ్యక్షుడు అనగా పీఠాధిపతిచేత బహిష్కార పత్రిక గొనుట.

2. సంఘమునందలి పెద్దమనుష్యులే యాకర్తృత్వమును స్వీకరించుట.

ఇందు మొదటివిధము సాధారణముగా సంఘము నిర్జీవమై యున్నయప్పుడు అవలంబింపబడు రెండవవిధానము సంఘము జీవవంతమై

ఆత్మరక్షణశక్తివంతమై యున్న యప్పుడు అవలంబింపబడు మనశ్శైవబ్రాహ్మణ సంఘమున జీవవంతమై యుండుట చేసి ప్రథమవిధానము శరణు బొందక రెండవ విధానము నవలంబించుట నైసర్గికము. ఇయ్యది పత్రికామూలముననే జరుపబడుటగత్యముకాదు. కావున గండ్రపు లింగయ్యగారు వెలిపెట్టబడినను విషయము తెలుసుకొనగోరుదురో అట్లై నవినుడు."

అను నీమొదలగు వాక్యములచే దెలియుచున్నది. మరియును మధ్యవర్తితప్ప తదితరులడుగుటకు నీలులేనట్టి గండ్రపు లింగయ్యగారిని వెలిపెట్టిన పత్రికను జూపమని పాషండ పతిత పాకయాజిగారడుగుట యెప్పుడుగలిగినదో అప్పుడు వీరికిని గండ్రపు లింగయ్యగారికిని సంబంధముండినట్లు దెలియుటయేగాక బూర్వోక్తమైన హేతువులవల్లను ఈపాషండ పతిత పాకయాజిగారినిగూడా వెలిపెట్టినట్లు దెలియుచున్నది.

ఇంతియేకాదు. పాషండ పతిత పాకయాజిగారిని వెలిపెట్టినట్లు ఈద్వితీయబహిరంగలేఖలోని 9, 10 పేరాలలోనుండు యీక్రింద విషయములచే మరియు బలపఱచి చెప్పుచున్నది. అది యెద్దియనినచో 9 పేరాలోని,

"అయ్యా! స్వామి! మహానుభావా! పాకయాజిగారూ! మీరు మీవియ్యంకునిగారింటికి యీనడుమ వెళ్ళినప్పుడు భోజన మిడక మాటలతోనోదార్చి గడపత్రొక్కనీయకుండ నవలకేలమిమ్ములసాగనంపిరి. అత్తవారింటికై వెళ్ళిన మీకుమరునకు జరిగినదియేమి ఎందులకు.

10. నిజమాడిన నిష్ఠురముగదా మీరుమీవియ్యంకునికేమని బెదరించి యుత్తరమువ్రాసితిరి. మతోద్ధారకా! రెండవకోడలిని యేమి చేసెదనని బెదరించి వియ్యంకునికుత్తరము వ్రాసితిరి. ఎందులకీ యుత్తరమువ్రాయవలసి వచ్చినది. ఏమిపరోపకారశీలత! కన్నుమూసుకొని పాలుత్రాగినంత లోకము జూడజాలదో ఇంకను మీరు కృత్రిమ

పదస్వీకరణము చేయగల్గిన గర్వము పీడకున్న దికదా! వెలిపత్రికనాల్గు రోజులలో నంపకున్న జేయునదెద్ది."

అను నీవాక్యములచే కూడా పాషండ పతిత పాకయాజిగారిని వెలిబెట్టినట్టు దృఢముగ మనము నమ్మదగినంత విశ్వాసముతో గూడి యున్న వాక్యములై యున్నవని తెలియుచున్నది.

మహారాజరాజశ్రీ చాగంటి వియ్యన్నగారి ద్వితీయబహిరంగ లేఖకు పాషండ పతిత పాకయాజిగారు 23-8-20 తేదిన యొకరిజిష్టరీకార్డువ్రాసినట్టు బూర్వోక్తులగు వియ్యన్నగారిచే 3-9-20 తేదీన బ్రకటించిన తృతీయ్యబహిరంగలేఖవలన తెలియుచున్నది. అందులోను దహరించిన విషయములీక్రింద వ్రాయుచున్నాను.

"మీకు 23-8-20 తారీఖున వ్రాసియుంపిన రిజిష్టరుకార్డు అందినది. తగుసమాధానము లేమింజేసి కల్గిన తబ్బిబ్బే యీ యీర తారలంబకిన యుత్తరమునకుం గారణము. ఎట్టిమాట! శ్రుతిధర్మోద్ధారణ బద్ధకంకణులకిట్టి తబ్బిబ్బుపాటు కల్గునా, ఇది నాయభిప్రాజ్ఞతాదోషమో"

అనునీవాక్యములచే మహారాజరాజశ్రీ చాగంటి వియ్యన్నగారి లేఖకు సరియైన ప్రత్యుత్తర మియ్యనట్టు మనకు బోధపడినదిగదా, ఇంతియేగాదు పై యుత్తరములకంతటికిని ప్రత్యుత్తరమియ్యక బోయినను బాధకములేదుగాని నాయుత్తరములలోనుండు యీక్రింది వాక్యములకైనను ప్రత్యుత్తరమిచ్చిరో తీరవలయును.

౧ "అయ్యా! స్వామీ! మహానుభావా! పాకయాజిగారూ! మీరు మీవియ్యంకునిగారింటికి యీనడుమ వెళ్ళినప్పుడు భోజనమిడకమాటలతోనోదార్చి గడపతొక్కనీయకుండ నవలికేల మిమ్ముల సాగనంపిరి. అత్తవారింటికై వెళ్ళిన మీకుమరునకుజరిగినదేమి ఎందులకు"

౨ "నిజమాడిన నిష్ఠురముగదా మీరు మీవియ్యంకునిగారికేమని బెదరించి యుత్తరము వ్రాసితిరి"

3 "ఇంతియేకాదు. మతోద్ధారకా! రెండవకోడలిని యేమి చేసెదనని బెదరించి వియ్యంకునికు త్తరమువ్రాసితిరి"

అను నీమూడు విషయములకు ప్రత్యుత్తరము లిచ్చియుండియే తీరవలయును. ఇట్లుండు యీమూడువిషయములను సిగ్గుగల పురుషుడు నెత్తిమీద భారముంచుకొని తిరుగాడునవికావు ఇట్టిస్థితిలో పావండపతిత పాకయాజిగారు వేదచతుష్టయముల భారమునువహించి ధర్మములవెల్లడించు అభినవవ్యాసులై యుండ యీస్వల్పభారమును వహించలేకపోవునా, అయినను సిగ్గుగలమానవుడు మాత్రము పై మూడు ప్రశ్నలకు తగుసమాధాన మివ్వకయుండడని మున్మాటికి నాయభిప్రాయమును మీరు గుర్తెరుగుటకై యిచ్చట వ్రాయుచున్నాను.

ఇంతియేకాదు తృతీయబహిరంగలేఖలోని 2 వ పేరాలో వ్రాసిన విషయమునైనను గమనించి అంశములకు సరియగు ప్రత్యుత్తర మిచ్చియుండలేదు. అదియెట్టిదని యెదరేని యీక్రింద వ్రాయునదియై యున్నది.

"2. ముంజేతి కంకణమునకు నద్దముకావలయునను నీమురిబోట్లకు నాబోట్లేమి చెప్పగలరు. మీరు 22-6-20 వ తారీఖున మీరెండవ వియ్యంకునికి వ్రాసినయుత్తరము నందు మీతోడి యల్లుడు మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారు వెలిబడి యుండెనవియు, వారియింట మీకుమారుడే భుజియించెననియు నప్పటికి నింకను మీకుమారుడు మీయింటికి రాకయుండుటచే నపవిత్రుడనుగాక పవిత్రుడనుగనే యుంటిననియు నెలవ్రాసితిరి. దీని కెల్ల నెఱింగియు నిద్రమైకమున నున్నవానివలె నెఱుగునట్లేల నటింతురు ఇది శ్రుతిధర్మోద్ధారకుల లక్షణమో ఆత్మవంచకుల లక్షణమో" అనియిట్లు తమ వియ్యంకుని పేర వ్రాసిన యుత్తరములోని విషయమునకైనను ప్రత్యుత్తర మివ్వక జెల్లముగొట్టిన గుండ్రాయివలె కదలక మెదలకయుండుట యగుచున్నది. ఇట్లువియ్యంకుని పేర యుత్తరము వ్రాయలేదని ప్రత్యుత్తర మిచ్చుటకు మూడుగుండెలుండవలయును గదా! ఎక్కడినుండి వచ్చును. ఇంతియేగాదు "అబముహంబ మెఱుంగని ముక్కుపచ్చలారని మీ రెండవకోడలిని నేమి చేసా

చేసెదనను నాటి యుత్తరపు బెదిరింపులచే శివలెంక వున్నయ్య మల్లం పల్లి భైరవప్రసాదరావుగారలు మాయింట భుజించుటజేసి సనాతన వీర శైవాచార సంపన్నులగు శైవబ్రాహ్మణులు వారిగడపనైన నేలత్రొ క్కుటమానిరి. మహానుభావా! మేల్కొని నిదురించువాని నెవరులే పగలరు. బూటకములతో స్వమతస్థులను చిరకాలము మోసపుచ్చుట సాగదుసుండీ''

అని యిట్లు జెప్పినవిషయములకు పై విషయములకును పాషండ పతిత పాకయాజిగారు 22—6—20 తారీఖున వీరివియ్యంకుని పేర యు త్తరమువ్రాసినట్లు మ. రా. రా. శ్రీ చాగంటి వియ్యన్నగారు తృతీ య్యబహిరంగలేఖలో ప్రచురించియుండ ఇందులకైనను ప్రత్యుత్తరము వ్వాకను, మరియు బూర్వోక్తులగు మ. రా. రా. శ్రీ చాగంటి వియ్యె న్నగారు ప్రచురించిన పత్రికలనైనను తమ స్వపత్రికయగు శ్రుతిధర్మ సంజీవనిలో ముద్రించకను చెవులుదెగిన మేక యరచినట్లుగను, మరి యు కరేపాకు గోయువాడు గొణుగుకొనునట్లును, మరియు నాశ్రుతిధ ర్మసంజీవని 6, 7, 8, 9, 10, 11 సంచికలలో నేమేమో శాస్త్రమొ త్తివ్రాతలన్నియు వ్రాసియున్నారు.

ఈసంచికలలో పై ప్రశ్నలకు తగుసమాధానములులేక బోవుట వలనను నామిత్రులగు మ. రా. రా. శ్రీ చాగంటి వియ్యన్నగారు, ఈక్రిందవ్రాసిన విషయమునుబట్టి పాషండ పతిత పాకయాజిగారు పతి తులై యుండుటచే ప్రాయశ్చిత్తార్హులని దెలియబడుచున్నది. అదియెద్ది యనినచో.

''కావున మీరు శైవబ్రాహ్మణ సంఘోద్ధారణము జేయవలెన నియున్న విధివిధానసహితముగా ప్రాయశ్చిత్తముజేసికొని సంఘము నందుచేరుట శ్రేయస్కరము''

అని యిట్లు నేవంకరటింకరులు లేక ప్రకటించియుండుటచే పా షండ పతితపాకయాజిగారు ప్రాయశ్చిత్తార్హులగు పతితులై యున్నారని ధృఢముగ వ్రాయుచున్నాము.

ఆహా! తెలిసె నేటితో పాషండ పతిత పాకయాజిగారి మహిమ. ఈపాషండ పతిత పాకయాజిగారు పాషండులనిన్ని, పతితులనిన్ని, వేదాధికారములేని వారనిన్ని, వేదాధ్యయనాధికారము లేనివారనిన్ని, అపాంక్తేయులనిన్ని, వేదవ్యతిరిక్తమైన తాంత్రికాచారతత్పరులనిన్ని, దురాత్ములనిన్ని, సత్యధర్మములు లేనివారనిన్ని, శాపభోగులనిన్ని, జ్ఞానకర్మపదభ్రష్టులనిన్ని, బ్రాహ్మణనామధారులనిన్ని, శూద్రతుల్యులనిన్ని, ఇట్లు శాస్త్రములవల్ల దెలియబడుటయే గాక మ. రా. రా. శ్రీ. చాగంటి విస్సన్నగారిచే ప్రకటింపబడిన పత్రికలకు సరియగు ప్రత్యుత్తరము జెప్పకబోవుటచే చండాలస్వర్గమున దలక్రిందులనూగులాడుచుండు గంద్రపు లింగయ్యగారితో భోజన ప్రతిభోజనములు కలుగ జేసుకొని వారితో సంబంధము కలిగి సంచరించుటచే పతితులైయున్నారని గూడా విశదపఱచుచున్నాను. అందువలన వీరు పాషండ పతిత పాకయాజిగారని సార్థకనామధేయులైరి.

ఇట్టివీరు జాతివిభాగాదర్శము 21 పేజీలో "జైమినిన్యాయమాలయందిట్లొక న్యాయముకలదు, అదియేమన శ్వదృతిగోక్షీర న్యాయమనునది అనగా కుక్కతోలు సంచిలోనున్న గోక్షీరములపవిత్రములైనట్లు దురాచారవంతులు చేయుధర్మబోధయును గ్రాహ్యముగా నేరదని సిద్ధాంతము చేయబడినది" అనియిట్లు యీపాషండ పతిత పాకయాజిగారు వ్రాసినవ్రాతలకు వీరేసరిపోవుచున్నారని జైమినియములనుబట్టి దెలుపుచున్నాను. ఇంతియేగాదు యిట్టి యవలక్షణలక్షితులైన యీపాషండ పతిత పాకయాజిగారిని ప్రతివాదులునుగా గ్రహించి వాదించుటయు ననుచితమేమైనను లోకక్షేమమునుగోరి పాములు వీరిననుసరించి పాడగుదురను భయమున నీపాషండ పతిత పాకయాజిగారి గ్రంథములను పత్రికలను నావిమర్శనాగ్నియందు ఇపుడును మున్ముందును స్వాహాకారములతో హోమము గావించుచున్నాను.

శ్రుతిధర్మసంజీవని ఛేదనము.

అశ్రుత్యర్థధర్మసంజీవన్యధిపతి సంరాజి పాషండ పతిత పాకయాజిగారు, శ్రుతిధర్మసంజీవనియను నొకపత్రికను స్థాపించియుండు సం

గతి తమకెల్లరకును విశదమయ్యేయుండును. ఈపత్రికకు జేయబడిన శ్రుతిధర్మసంజీవని అను నీనామకరణము బూర్వోత్తర సందర్భముల కనుకూలించి శాస్త్రసమ్మతముగ నుండక పోవుటచే తన్నామకరణము ఛేదించదలచి శ్రుతిధర్మసంజీవని ఛేదనమను పేరున విమర్శించుటకు ప్రయత్నించుచున్నాను.

ఈశ్రుతిధర్మసంజీవని అను నీనూతన పత్రికయొక్క యీశీర్షిక శాస్త్రసమ్మతమైనదిగ నుండక నీక్రిందిశ్లోకోక్తప్రకారముగ నుండునట్లు గన్పట్టుచున్నది.

శ్లో॥ పూర్వాపరవిమర్శశ్చ వికలాస్సంత్రికేచన। వాక్యాభాసాన్ స్వ స్వపక్షయోజయంత్యహ్యా లజ్జయా॥

ఇందులభావమేమనినచో లోకమునందు పిచ్చివాండ్రు ఏదో యొకవాక్యమును దీసుకొని నైనజెప్పబడినదేకో తెలియజాలకమాట్లాడిన విధమున యీపత్రికాధిపతి బూర్వోత్తర సంబంధము లేకను బునరుక్తిదోషము వచ్చునట్లుగను అసందర్భప్రలాపముగ కూడా నున్నదని యోచించుకొనకను స్వేచ్ఛానుసారముగ యీపత్రికను బ్రకటించుటకుద్యుక్తుడై యున్నది. ఇట్లు ప్రకటించుట దూరమాలోచించి చూచినచో శ్రీవారిపై గుంటూరుజిల్లా తెనాలి అడిషనల్ మునసబుకోర్టులో శాస్త్రి ఆనందరావుదుశ్చేష్టలను శిక్షార్థమై దేబడిన యభియోగములో నీపాషండ పతిత పాకయాజిగారు సాక్ష్యమున బలికిన పలుకులెట్టివి సుభాషితములై శ్రీవారిని సాధించుటగలిగినదో నీశ్రుతిధర్మసంజీవని యొక్క నామకరణమును, ఇందున బ్రకటించు విషయములును, అట్టి సుభాషితములయ్యేయున్నవని ముఖ్యముగ మనము గుర్తెరుగతగియున్నది.

ఈశ్రుతిధర్మసంజీవని అనుశీర్షిక శాస్త్రసమ్మతమై యుండలేదను విషయము యింతకుబూర్వమే తెలియబడియుండినను మరియు నీక్రింది ప్రమాణవచనములచే చక్కగ విమర్శించి జూపుచున్నాను.

ఇయ్యది శ్రుతిధర్మసంజీవని అను నప్పుడు వేదోక్తధర్మములను జీవింపజేయునదై యున్నదనునట్టి అర్థమును ఇచ్చుచున్నదని పాషండపతితపాకయాజియొక్క అభిప్రాయమైయున్నది.

ఈపత్రికలోని ధర్మమను శబ్దమునకీక్రింది అథర్వణ వేదశ్రుతి ననుసరించి వేదోక్తమైన అపూర్వవిషయమునకే ధర్మమని తెలియుచుండ మరల శ్రుతిధర్మసంజీవని అనియిట్లు వ్రాయించుట పునరుక్తి దోషమై యున్నదని తెలియబఱచుచున్నాను.

శ్లో॥ ఋతం సత్యం తపో రాష్ట్రం ధర్మశ్చ కర్మచ। భూతం భవిష్యము
చ్ఛిష్టే వీర్యం లక్ష్మీర్బలం బలే॥

అథర్వణవేదము. ౧౧ కాం. ౯ సూ. ౧౭ మం. 3 సం. ౧౪౩ పత్రము.

ఈశ్రుతియందుండునట్టి "ధర్మశ్చ కర్మచ" అను నీరెండు పదములకు విద్యారణ్యులు వ్రాసిన భాష్యపంక్తుల నీక్రింద నుదహరించుచున్నాను.

విద్యారణ్యభాష్యము. ధర్మతజ్జన్యః అపూర్వవిశేషః। కర్మవర్ణాశ్రమానుసారేణ విహితం యాగదానహోమాది.

ఇందుల భావమేమనినచో ధర్మమనునది వేదములందు జనించిన అపూర్వమైన విశేష మేదిగలదో అది ధర్మమనబడును. కర్మమనునది వర్ణాశ్రమములకు విహితమైన యాగదానహోమాది కర్మలు కర్మయనబడును. అనియిట్లు భాష్యము వచించుటచే ధర్మమను శబ్దము వేదమందలి అపూర్వవిషయమును తెలియజేయు నదియై యున్నది. వేదోక్తమైనవిధికే ధర్మమని తెలియుచుండ మరలను శ్రుతిశబ్దమును జేర్చి శ్రుతిధర్మమని చెప్పుట పునరుక్తిదోషమైయున్నదను సంగతిస్తసందులకు సహితముద్యోతక మగుచున్నది. అనునీవిషయము మీకు తెలియబఱచుచున్నాను.

ఒకవేళ పాషండపతితపాకయాజి వేదోక్తవిధులకు వ్యతిరిక్తములైన స్మృతులయందుండు కొన్నిధర్మములను వాడకీ యీశ్రుతిధర్మసంజీవని పత్రికలో వ్రాయుటవలన శ్రుతిధర్మసంజీవని అనియిట్లు పేరిడవచ్చుననినచో అట్టి స్మృతులయందుండు ధర్మములు వేదోక్తవిధులకు వ్యతిరిక్తములై యుండుటచే అశ్రుతిధర్మము లెట్లగును. వాటిని కల్పితస్మృ

తిధర్మములని గదా! జెప్పదగి యున్నది. అట్లెందుకనియెదవనినచో శ్రుతిధర్మములకు వ్యతిరిక్తములైన స్మృతిధర్మములై యుండుటచే కల్పితస్మృతి ధర్మములని జెప్పక మరేమి జెప్పవలయును అట్లొకవేళ జెప్పినచోనది కల్పితస్మృతిధర్మసంజీవని యగునుగాని శ్రుతిధర్మ సంజీవని అనియిట్లు జెప్పుట కెట్లువలనుపడును. మరియొకవేళ కల్పితస్మృతులుగా నట్టి స్మృతులననుసరించి జెప్పెదమనినచో అట్టి స్మృతులలో జెప్పినవిధులన్నియు వేదోక్తవిధులనియే ఈ క్రిందిప్రమాణములచే దెలియబడుచున్నది.

శ్లో॥ శృతింపశ్యంతిమునయః స్మరంతిచతథాస్మృతిం।
తస్మాత్ప్రమాణముభయం ప్రమాణైప్రమితంభువి॥
ఇతిపరాశరమాధవీయే।

శ్లో॥ వేదోఖిలోధర్మమూలం స్మృతిశీలేచతద్విదా॥
ఇతిమనుస్మృతౌ।

సూ॥ వేదోధర్మమూలమ్ తద్విదాంచస్మృతిశీలే॥
ఇతిగౌతమస్మృతౌ।

ఇట్లు పెక్కు ప్రమాణములున్ను మరియు పూర్వమీమాంసాది గ్రంథములయందున్ను గన్పట్టుచున్నవి. వాటినెల్ల గ్రంథవిస్తర భీతిచే వ్రాయనైతిని.

ఇట్టితరి వేదోక్తవిధులకు వ్యతిరిక్తములైనవన్నియు కల్పితస్మృతులనియే జెప్పలయును. కాబట్టి ఈ పాషండపతిత పాకయాజిగారు శ్రుతిధర్మ సంజీవని అని యిట్లు వ్రాయుట అనాలోచితమైన వ్రాతయని ధృవపడుచున్నది.

ఇంతియేగాదు బూర్వికులు వ్రాసిన గ్రంథములన్నిటిని కొంత పరిశీలించి జూపెదను చూడుడీ.

అథాతో ధర్మ జిజ్ఞాసా॥

అనియిట్లు జైమిన్యాచార్యులు పూర్వమీమాంస యందు జెప్పి యున్నారుగాని ఈ పాషండపతితపాకయాజి జెప్పినట్టు,

అథాతో శ్రుతిధర్మ జిజ్ఞాసా॥

అనియిట్లుగ శ్రుతిశబ్దమును చేర్చి చెప్పియుండలేదు. ఇంతియే గాదు. బూర్వమునిబంధన గ్రంథములు వ్రాసినవారుకూడా,

౧ ధర్మసిన్ధుః। ౨ ధర్మప్రబోధిని। 3 ధర్మప్రవృత్తిః। ౪ ధర్మప్రదీప। ౫ ధర్మశాస్త్ర సంగ్రహః॥ ౬ ధర్మశాస్త్ర నిష్కర్షః ౭ ధర్మ సేతుః॥

అని యిట్లు రచియించి యున్నారుగాని ఈ పాషండపతిత పాకయాజిగారు శ్రుతిధర్మ సంజీవని అని పేరొక్కనినట్లు,

౧ శ్రుతిధర్మసిన్ధుః ౨ శ్రుతిధర్మప్రబోధిని। 3 శ్రుతిధర్మప్రవృత్తిః। ౪ శ్రుతిధర్మప్రదీప। ౫ శ్రుతిధర్మ శాస్త్రసంగ్రహః। ౬ శ్రుతిధర్మశాస్త్ర నిష్కర్షః। ౭ శ్రుతిధర్మ సేతుః॥

అనియిట్లు బూర్వనిబంధన గ్రంథ కర్తలు శ్రుతిశబ్దమును జేర్చి వారివారి గ్రంథములను రచియించి యుండలేదు.

ఇంతియేకాదు పూర్వమీమాంస ప్రథమాధ్యాయస్థ ప్రథమపాదము యొక్క ప్రథమసూత్ర భాష్యావసరమున లోకమునందే యర్థము నందే ప్రసిద్ధ పదములు గలవో వాటిని నాయర్థముచేతనే గ్రహింపతగి యున్నవిగాని అధ్యాహారాదిపదములచే పరికల్పించి వ్యవహరించ గూడదని ఇట్లుగ శబరస్వామి యీక్రింది వాక్యముచే చెప్పియున్నారు.

శబరస్వామిభాష్యము॥ లోకేయేష్వర్థేషు ప్రసిద్ధాని పదానితాని సతిసంభవేతదర్థాన్యేవ సూత్రేష్విత్యవగంతవ్యం నాధ్యాహారాది భిరేషాంపరికల్ప నీయోర్థః పరిభాషితవ్యోవా॥

అనియిట్లు భాష్యకారులు వచించి యుండుటచే ప్రసిద్ధపదమైన ధర్మమను శబ్దము వేదోక్తమైన అపూర్వ విషయములందు యీధర్మశబ్దము వర్తించుచుండ అపండిత శిఖామణియగు ఈపాషండపతిత

పాకయాజిగారు వేదోక్తములైన అపూర్వ విషయములనేమియోగు ర్తెరుగలేక ధర్మమను విషయము వర్ణాశ్రమములనుగూర్చి వాదించునది యే ధర్మమనుకొని అట్టిధర్మమును ప్రతిపాదించునది శ్రుతిధర్మసంజీవని అని చేరిడినట్లు,

"వర్ణాశ్రమ ధర్మ పక్షమున వాదించు పక్షప్రాశ"

అను నీవాక్యమువలన దెలియబడుచున్నది.

అసామర్థ్య పరిత్యక్త ప్రధానాంఘ్రోపాధ్యాయపద వికృత భాషి పాషండపతితపాకయాజిగారు బూరోక్త్రీత్యా వర్ణాశ్రమపక్షమునవా దించెదమని జెప్పియుండుటచే అట్టి వర్ణాశ్రమములు భిన్నములగుట వ లన నట్టి వర్ణాశ్రమప్రవర్తకులు అవలంబించ వలసినవి కర్మలుగాని ధ ర్మముగాదని బూరోక్తమైన విద్యారణ్యభాష్యమునసుసరించి మనము గ్రహించియున్నాము.

ధర్మమనుదిమాత్రము ప్రతిమానవునికి సమానమైన హక్కు గ లిగియున్నదిగాని వర్ణాశ్రమ కర్మలువలె భిన్నములై యుండలేదు. ఇ ట్టిరి వర్ణాశ్రమములను గూర్చి దెలియ జేయునదియు అట్టి వర్ణాశ్రమ ముల పక్షమున వాదించునదియు ధర్మమని ఈ పాషండపతితపాకయా జిగారు తిండి యెక్కువై తెలివి తక్కువగ నుండి వ్రాసినట్లు గన్పట్టు చున్నది.

ఇట్టుపై ధర్మము సర్వజనులకు సమానమైనభాధ్యగత గలిగియు న్నదని యీక్రింది ప్రమాణములచే ముఖ్యముగా మనము గుర్తెరుగ తగియున్నది.

శ్రు॥ ధర్మోవిశ్వస్యజగతః ప్రతిష్ఠాలోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి ధర్మేణ పాపమపనుదతి ధర్మేసర్వం ప్రతిష్ఠితం। తస్మాధ్ధర్మం ప రమం వదంతి॥

ఇతి తైత్తరీయోపనిషది. నారాయణమ్.

అనియిట్లు తైత్తరీయోపనిషత్తు నారాయణప్రశ్నమున జెప్పుబ

న్నది. ఇందులకు విద్యారణ్య భాష్యముకూడా నీక్రింద వ్రాయు చున్నాను.

విద్యారణ్యభాష్యము॥ ధర్మోవిశ్వస్యజగతః॥ ధర్మంపరమంవదం తి॥ ఇతిలటాకప్రసాది నిర్మాణరూపోధర్మః। విశ్వస్యజగతః సర్వ స్యప్రాణిజాతస్య ప్రతిష్ఠాఆశ్రయః। ఇత్యేతచ్ఛ్రుతి సిద్ధమ్। తథాలో కే ధర్మిష్టం అతిశయేన ధర్మే వర్తమానం పురుషం ప్రజాః స ర్వాః ఉపసర్పంతి ధర్మాధర్మౌ నిర్ణయార్థముప గచ్ఛంతి॥

ఇందుల యభిప్రాయమేమనినచో చెరువులు చలివేందిరిలు మొ దలగునట్టి విషయములను నిర్మాణ జేయుట ధర్మమనియు అట్టి ధర్మము సర్వప్రాణులకు సమానమై యున్నదనియు అట్టి ధర్మము నవలంబించిన వారలను తదితరప్రజలు ధర్మాధర్మములు గుర్తెఱుగుటకై వారి సమీప మునజేరుదురనియు ఇట్లుగమూలమగు బైశ్రుతియందును తదనుగుణ్య మైన విద్యారణ్యభాష్యమందును దెలియుచున్నది.

శృ॥ ధర్మంచర॥ ఇతితైత్తిరీయోపనిషత్ శిక్షావల్లి.

శంకరభాష్యము. తద్వద్ధర్మంచర। ధర్మఇత్యనుష్ఠేయానాం సామా న్యవచనం సత్యాదివచన నిర్దేశాత్॥

ఈవాక్యమందును సత్యాదివచనమువలె ధర్మముగూడా సర్వజ నులవలంబించ తగియున్నదని శంకరభాష్య మానందగిరీయవ్యాఖ్యా నములనుండి దెలియుచున్నది.

శ్లో॥ నాస్తిసత్యాత్పరోధర్మో నానృతాత్పాతకంపరం।
స్థితిర్హిసత్యేధర్మస్య తస్మాత్సత్యం నలోపయేత్॥

శ్లో॥ క్రియస్సాధనతాయత్ర ద్రవ్యాదావిధితోభవేత్।
తస్యైవధర్మతాజ్ఞేయా ధర్మస్తత్సాధనంయతః॥

ఇతి పరాశరమాధవీయే.

ఇట్టి ప్రమాణవచనములయం దుదహరింపబడి యుండు సత్యము ను వచించుట. చెరువులు, చలివేందిరిలు నిర్మాణములుగావించుట.

శ్రేయస్సాధనములైన కార్యములను గూర్చి యన్వయించుట ఈ మొదలగు ధర్మములందరికి సమానములై యున్నవి గాని వర్ణాశ్రమ కర్మలువలె భిన్నములుగ నుండినట్లు గన్పట్టుట లేదు. శ్రుతియందును ధర్మోవిశ్వస్య జగతః॥ అను నీ వాక్యము సర్వప్రాణికోటి కంతయు ధర్మము సమానమని జెప్పుచున్నది.

ఇట్టి ప్రమాణములు బహుళముగ గన్పట్టుటచే ఈ చండాల స్వర్గమున తలక్రిందులుగ నూగులాడుచుండు పాషండ పతిత పాకయాజి శ్రుతిధర్మసంజీవని అను నీ శీర్షికను ముద్రించి ప్రకటించుటచే అట్టి యాశీర్షిక శాస్త్రసమ్మతమైనదిగ నుండక బోవుటవలన ఛేదింపబడినదని దెలియజేయుచున్నాను.

శ్రీ "సూర్యదేవర రాఘవయ్యవర్మగారి లేఖ"

మహాగ్రహ విరాజి పాషండ పతిత పాకయాజిగారు, జాతివిభాగాదర్శమని యొక చిన్నపుస్తకము రచించియున్నారు. ఆపుస్తకమును జూచినంతనే యీముఖమున కీ పేరు పనుపాయని బోధకట్టినట్లు తోచుచున్నది. ఈ జాతివిభాగాదర్శములో శ్రుతిధర్మసంజీవని 1 సంపుటము 6 సంచికయందు మహారాజరాజశ్రీ సూర్యదేవర రాఘవయ్యగారు జనార్ధప్రకాశిక మూడవభాగము నాసంచేసినాములు అనియొక్క గోదావరిపత్రికకు వ్రాసినదానిని ఈ బోధకులగు పాషండ పతిత పాకయాజిగారు ఉపన్యాసముగ తమ పత్రికలో వేసుకొని చంకలు గొట్టుకొనుచున్నారు.

ఇందులకు గూర్చి మ. రా. రా. శ్రీ సూర్యదేవర రాఘవయ్యవర్మగారు కొంపెల్ల వేదపాఠశాల మానేజరుగారికి వ్రాసిన లేఖలోని యంశములు కొన్నిటిని ఇందు బొందుపఱచుచున్నాను.

మహారాజరాజశ్రీ కొంపెల్ల వేదపాఠశాల మేనేజరుగారికి సూర్యదేవర రాఘవయ్యవర్మ త్రికాలములయందు వందనశతంబు లర్పించివ్రాయు విజ్ఞప్తి.

మహాశయా! మనగురువరుండైన జగద్గురుండు జయార్థప్రకా
శిక ప్రచురించినది యుష్మదీయుల కెరుకయై యున్నది. ఆపుస్తకము
సందర్శించు భాగ్యము నాకు లేకపోయినను ఎట్లెట్లో కొందరు మిత్రు
లు వినుపించుటచేతను కొంతగాగ్రాహ్యంబైనది. అనగా శ్రీస్వాములవా
రు వెనిగళ్ళ వారిపాళెములో జరిగిన సభయందు చదువుచున్నప్పుడు
నేను రుగ్ణతావస్థయందుండుటచే స్థిరముగా సభయందుండజాలక పో
వుటవలన అసాంతము గ్రహింపజాలనైతి. అటుల దెలుసుకొన్న విష
యములలో కొన్ని మదీయమనంబునకు సందియంబుగలిగి శ్రీమత్పరమ
హంస స్వామి. జీ. యస్. బి. సరస్వతిగారు వివాదింత్యములకు దయ
చేసినవి గ్రాహ్యంబులేక నొకవేళ గోదావరిమండలములో నుండురని
యెంచి గోదావరిపత్రికకు వ్రాసుకొంటిని. ఆగోదావరిపత్రికలో ప్రచు
రించినవచూచి పాకయాజియను నొక...బ్రాహ్మణనామధారుడు తెన
చేప్రచురించు పత్రికయందు ప్రచురించెనట. యద్దానిని శ్రీస్వాములవా
రు గాంచి యాపత్రికలో మీరువ్రాసిన వ్యాసము జూచితిమనియు,
నాసందియములకు జవాబున్ను లిఖితరూపముగదయచేసిరి. గానియుం
డుల వ్రాలాలెసము గాంచ పాకయాజితో నేను ఏకమైయుంటినని శ్రీస్వాముల
వారు తలచిరని హ్యాస్యోచనమైనది. అందులకు చింతిల్లెదను.

23-9-20,
మకాం,
తెనాలి.

ఇట్లు,
సూర్యదేవర రాఘవయ్య (శర్మ).

అనియిట్లు మహారాజరాజశ్రీ సూర్యదేవర రాఘవయ్యశర్మగా
రు వ్రాసియున్నారు. ఇందులకు వ్యతిరిక్తము బొంగవ్రాతలువ్రాయు
పాషండ పతిత పాకయాజిగారు తమ బ్రాహ్మణధర్మసంజీవనిలో,

"అంతియేగాక (మ సూర్యదేవర రాఘవయ్యశర్మగారు) వె
నిగళ్ళవారిపాళెములో జరిగిన జయార్థప్రకాశిక (గౌరవ మహాజన) స
భ్యలసమూహము ఎళ్ళియుట (శ్రీమత్పరమహంస) జీ. యస్. బి. సరస్వ
తీగారిములతో ప్రశ్నించినారు. వారిప్రశ్నలకు సమాధానము జెప్ప

లేక బోయియు స్వాములవారు తమ గ్రంథమును సందర్శకగ్రీవముగ సంగీకరించిరని యాంధ్రప్రకాశికయందు వ్రాయనది సత్యేతర మగుట చే వెంటనే రాఘవయ్యచౌదరిగారు 8-6-20 తేదీగల గోదావరి పత్రికయందు పెద్దవ్యాసమును వ్రాసియున్నారు" అని యిట్లు ప్రకటించుట కలిగినది. ఈ పాషండపతిత పాకయాజిగారు పై వాక్యములు వ్రాయుటలో కొన్ని అవసరమైన సందర్భముగల పదములను వదులుటచే అట్టి పదములును నేను బ్రాకెటుపెట్టి వ్రాసియున్నాను. ఇందువలన నీరికి సుకవంకలెన్ని యైనది కూడా దెలియనట్లు ముఖ్యముగా మనము గుర్తింపతగియున్నది.

ఆహా కనుగొన బడెగదా పాషండపతిత పాకయాజీ ఫలజ్యోతి షమహిమ ఇందులకే కాబోలు శ్రీయుత ఆర్యనారాయణమూర్తిగారి వలన నాలుకలు కత్తిరించుకొనుట చేతులు నోయించుకొనుట మొదలగు బిరుదు గద్యములను సంపాదించుకొనుట గలిగినది.

ప్రథమ కబళే మక్షికాపాతః అనుసూయార్యోక్తి ననుసరించి జాతివిభాగాదర్శమును బొడగాంచినచో పుట్ట మొదటనే ఇట్టి దుర్దశ గన్పించుచున్నది.

## జాతివిభాగాదర్శ విమర్శనము.

అకట వికట విద్వజ్జన వీరభోగ పదవిభ్రాజి పాషండపతిత పాకయాజిగారు వ్రాసిన గ్రంథమగుట వలనే కాబోలు ఇయ్యది జాతివిభాగాదర్శమను నిబేరహలయు చుండునట ఇందులకు కారణమేమనిన చో "ఆదర్శ మద్దృష్టముఖాదికములు గన్పరచు కరణి నీవ్యాసమద్దృష్టజాతి విభాగాదుల గన్పరచుచుండుటచే దీనికి జాతివిభాగాదర్శమను నన్వర్థనామకరణము గావింపబడినది."

అసియిట్లు తిండిమెక్కుటనై తెలివి తక్కువగనుండుటచే జెప్పుట గలిగినది. ఇక్లేలవచించితి వనిన చో అదృష్టమనగ మనకన్నులకు గన్పడినది అనగా లేనివస్తువని బోధపడగు మన్న ది. అట్లుగన్పడనివస్తువునగ

పరచునది ఆదర్శమట ఇట్టియాదర్శమనుశబ్దమున కిట్టియర్థమును అర్పిన గురుబాలప్రబోధికనుండి యెత్తివ్రాయబడినది కాబోలు ఇంతకన్న నధిక గ్రంథసముదాయ మనలోకనము లేనట్లు వారిచే బ్రకటించు గ్రంథములను బట్టి మనము దెలుసుకొనుటకు వీలగుచున్నది. ఈ పాసండపతిత పాకయాజిగారి పాండిత్యమును గూర్చి ప్రత్యేకముగ దెలుసుకొనుటకు ప్రయత్నపడనక్కరలేదు. అదట్లుండనిమ్ము. ప్రస్తుతమనుసరామః పాయసం భక్షయామః అను నీనార్యోక్తి నవలంబించి గ్రంథవిమర్శనకు గడగెదము.

ఇట్టియభిప్రాయమును గనుకొనటకై భగవద్గీత కొంచము పరికించిచూచితిమేని యీ విషయము చక్కగ గోచరించుచున్నది.

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః॥

అనగా లేనిది యుండుట లేదు. ఉండునది లేకపోవుటయు లేదు. అనియిట్లు భగవద్గీత చెప్పుచుండుటచే ఇప్పుడు ముఖాదికములు లేక యుండినవా, అట్లుగాక నుండి లేకయుండినవా, ఇందులో ప్రథమ పక్షమునకు లేనిదియుండుట అసంభవము గనుక బూర్వోక్త ప్రమాణము ననుసరించియు, స్వానుభవము ననుసరించియు, ప్రథమ పక్షమును గూర్చి చెప్పుటకు వలనుపడదు.

ఇకపై ద్వితీయపక్షము నవలంబించి చెప్పినచో ఉండినది లేకబోవుట లేదు. కాబట్టి ఇదియును సరిపోయియుండలేదు.

ఇంతియేగాదు లేనిది యుండుట లేనప్పుడు అనిత్యము స్థాయివై తాము ముందువ్రాయబోవునట్టి నిత్యముగు జన్మానుసార జాతివర్ణస్థాపనమునకు హానికలుగుచున్నది. కాబట్టి ప్రథమపక్ష మవలంబించి చెప్పుటకువీలులేదు. అట్లుగాకవేళ చెప్పినచో దోషముకూడా సిద్ధించును.

ఇక నుండినది లేకబోవుటనుగూర్చి చెప్పవలయును. అట్లు చెప్పుటకు పొనగనేరదని ముందుగ వచించియున్నాడను.

ఇట్లుభయపక్షములలో దోషము సిద్ధించునెడల నిట్టుపై నేమి జెప్పవలయుననినచో యుండినదియే ప్రచ్ఛన్నత్వమును బొందియున్నదని జెప్పవలయును. మరొండువిధమున జెప్పుటకు నై హేతువుల వలన వీలుపడదు. ఇట్లుగ జెప్పుట నెప్పుడు గలిగినదో నప్పుడు శ్రీవారివాద మైనదిగాని పాషండ పతిత పాకయాజి వాదము పాకముజేయుటకుబోయినదని జెప్పవలయును.

ఈజాతివిభాగాదర్శమను నీగ్రంథము మూడుభాగములుగనుండునట్లు వ్రాయబడునని జెప్పబడియున్నది. ఇందులో ప్రథమ భాగములోని విషయములనైనను విమర్శించెదమనినను కొనినచో పేరుగొప్ప నూరుదిబ్బ యనునట్లు గన్పట్టుచున్నది. అయినను ప్రథమ భాగములో విమర్శనాంశము విశేషించి లేకబోవుటచే ప్రస్తుతము స్థాలీపులాకన్యాయముగ ముఖ్యాంశములను మాత్రము గ్రహించి విమర్శించుటకుబూనుకొన్నాడను.

ఈప్రథమభాగమున్ను తదితరములగు ముద్రణము గాదగిన రెండుభాగములున్ను, సంపూర్తిగ ముద్రణమైనవెంటనే అవసరమును బట్టి ప్రతివాక్యమును గ్రహించి విమర్శించుటకు యత్నించుచున్నాడను.

## ఉపోద్ఘాతాఘాతము.

సంఘసంస్కార దుర్వాద ప్రచారణ దీక్షాబద్ధ కంకణ కరవిరాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను గ్రంథము ౧ పత్రమున ఉపోద్ఘాతమను పేరుచే గొంతగ్రంథము వ్రాసి యున్నారు. ఈఉపోద్ఘాతములో విమర్శించతగిన విషయములేమియులేవు. అందువలన నీఉపోద్ఘాతమును చంపుస్థలము గనుక ఉపోద్ఘాతాఘాతమని పేరుబెట్టబడెను. అయిన నొకటి రెండంశములు మాత్రము గన్పడుచున్నవి. అవి యవ్వియనినచో శ్రీవారు జయార్థప్రకాశికయొక్క ఉపోద్ఘాతములోని ౨౫ పత్రమున "ఇట్లు ప్రాచీనార్యుల వైభవోత్పత్తులు

గన్పట్టుచుండ యిందులకు వ్యతిరేకము నెవ్వరో స్వార్థపరులు బ్రహ్మ ముఖబాహూరు పాదములనుండి వర్ణోత్పత్తియైనదని యీక్రింది శ్లోకమువంటి గొన్నిశ్లోకములను గల్పించి గ్రంథాదులయందు జేర్చినవారైరి.

శ్లో॥ లోకానాంతువివృద్ధ్యర్థం ముఖబాహూరు పాదతః। బ్రాహ్మ
ణం క్షత్రియం వైశ్యం శూద్రంచనిరవర్తయత్॥

మనుస్మృతిః ౧ అధ్యాయము ౩౧ శ్లోకము."

అను నీశ్లోకమునుగూర్చి కల్పితశ్లోకమనియు ప్రాచీనార్యవైభవములకు వ్యతిరిక్తమై యున్నదనియు, ఇట్లు వ్రాసియుండుదాని కేమియు ప్రత్యుత్తరముజెప్పక తచ్ఛ్లోకమును మరల ప్రమాణముగ గైకొని వ్రాసియున్నారు. అయినను దైవిషయమునకు హేతువులైనను వ్రాసి విమర్శించుకొనక పాడినదే పాడర పాచిపండ్లదాసరి, అను నీసూరోక్తినైనను నాలోచించుకొనక సిగ్గులేకవ్రాసినందులకై ఏమిటి * పీడిపాడేనా విమర్శించి వ్రాయుట అనియిట్లు జెప్పుచున్నాను.

ఇట్టి యవకతవక వ్రాతలిదివరలో వ్రాసియుండుటేని యింతదనుక నెన్నియో ఖండన విమర్శనగ్రంథములు బయల్వెడియుండును. ఇప్పటికి యీ పాషండ పతిత పాకయాజిగారి వ్రాతలు బయల్వెడినవి. ఇందువలన రెండుచేతుల నిండా పనులుగలిగినవి. ఇట్టి యవకతవక వ్రాతలను ముక్కలు ముక్కలు ఖండించి విమర్శించుటకు నాచేకలను నహోరాత్రములు విధివిరామములేక ప్రస్తుతముపరుగిడుచున్నది. ముందునుపరుగిడగలదు. ఇప్పటికి రెండుమూడు సంవత్సరములక్రిందట మా వాదములనుగూర్చి ఖండించునట్టి ప్రమాణవాక్యములను బుత్తెంచమని అనేకములైన రిజిష్టరీయుత్తరములు నాకును వీరికిని జరిగినప్పటికిని అందులో "పీడిపాడేనా" అని యిటువంటి పదములతోనుండు వాక్యము

* పీడిపాడేనా అను నీపదమును పాషండ పతిత పాకయాజిగారును, వీరి శిష్యులగు యస్. నాగవీరయ్యగారును తరుచుగా యుత్తరములలో వాడుచున్నారు.

లుదప్ప మరేపదమైన ప్రమాణ వచనము మందునకైనను గానరైతిని. తుదకు విసికి వేసారి నోటీసు బెదరింపులచే కార్యముల సాధించుకొను వారని నిశ్చయించుకొని యుంటినిగాని కడకొక శ్లోకమునైనను వ్రాసినపాపమునబోయి యుండలేదు. ఇట్టిపాపమింకెంతకాలము దాగియుండ గలదు.

ఇంతియేగాదు ఈజాతివిభాగాదర్శమను నీ గ్రంథము ౩ పేజీలో "నీవివాదనుబట్టి పూర్వాచార పరాయణులనియు, నవీనాచార పరాయణులనియు రెండుతెగలగుచున్నారు" అనియిట్లు జెప్పినదానిలో తాము ఏయాచారపరాయణులో వ్రాసుకొని యుండలేదు. అయినను వీరివ్రాతలవలన వీరుచండాలస్వర్గమున తలక్రిందునూగులాడుచుండు కల్పితాచారపరాయణులని తెలియుచున్నది.

## పత్రికాధిపతిబొంకు.

అకట వికట విద్వజ్జన నిరభోగ పదవిభ్రాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథములో ౧౧ పత్రము మొదలుకొని వ్రాయబడిన విషయము లన్నియును గలిపినచో "జీ. యస్. బి. సరస్వతి...చరిత్ర, జీ. యస్. బి. సరస్వతి...రికార్డు" అను నీశీర్షికలతోనుండు రెండువిషయములు మద్యపాన మొనర్చినవాడు కైపుతలకెక్కి వదరినట్లు వచించుటయేగాక నందులోని విషయములన్ని బొంకులైయున్నవని ఒకమాటచే జెప్పి విరమించుకొనుచున్నాడను. ఇందువిషయమై జరుగు చర్యలు ముందుముందు మీయంతట మీరే గ్రహించుకొనగలుగుదురని మాత్రము వ్రాయుచున్నాను. ఇందులో బైవ్రాతలోని విషయములకు శ్రీవారేలాటి బాధ్యులై యుండలేదని దృఢముగ వ్రాయుచున్నాను. ఇట్టివ్రాతలు వ్రాయుటకు ఈచండాలస్వర్గమున తలక్రిందు నూగులాడుచుండు పాషండ పతిత పాకయాజిగారు తప్ప మరేరికిని సమర్థతజాలదని నానమ్మకము.

యతులెట్టి కార్యములం జేసియు నిందితులుకారు.

శ్రుతివిరుద్ధ ధర్మరక్షణైక దీక్షా పరతంత్ర ధార్మికానుగ్రహాపరిభ్రాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాధర్మమను నిగ్రంథము 17 పేజీయందు "జీ. యస్. బి. సరస్వతి పతిత చరిత్ర" అని కొంతవ్యాసమును తమ పత్రికాపాఠకులు పాపము యతిదూషణాలాప పఠనము వలన తమకు గలిగిన మహత్తర పాపమునకు వగచి "మొర్రో!" యికనిట్టి యతిదూషణాలాపముల జదివించియుమ్ము నరకమున బడద్రోయవలదని మొత్తుకొన్నను "ఛీ" యిట్టి యతిదూషణపాపరూపుషవగు నీపత్రికనిక జాలింపవోయియని మొత్తనిచెప్పుతో కొట్టినట్లు సూచించుచున్నను మురికి దోలును గొరుకు జంతువును పాలుబోసిపెంచినను దాని వెనుకటిగుణము మాననట్లు తనకుగల దుష్పాండిత్యమును అసమర్థతను వెల్లడించుచు సయుక్తికముగు శాస్త్రసమాధానము జెప్పజాలనితరిని స్వభావముగ జనించు బూతుల పంచాంగమును విప్పి మార్గొడ్డించక మానవని మార్గొడ్డించనట్లు వ్రాసినారు.

శ్రీయుత ఊటుకూరి శోభనాచలంగారిచే నూజవీడు నుండి 24_9_18 తారీఖున "దుష్టాష్టకచరిత్రయను పేరున ప్రకటింప బడిన దానియందు "యతులెట్టి కార్యములుజేసియు నిందితులుకారు" అను నీవాక్యమునకు నీయతి అట్టి దుష్కృత్యము నాచరించినట్లు అంగీకరించి తమతప్పును తిరుగ దిద్దుకొనజూచి పై వాక్యము వ్రాసినట్లు తమ దుష్పాండిత్యమున గ్రహించి రెడ్డి, కమ్మ, వెలమ, కాపు, మున్నగు జాతుల మానధనులు స్వామిని గౌరవించి చెడిపోయినందుకు విచారపడినారు.

అయ్యో? పాపము! యెంతదుఃఖము. ఈపాషండ పతిత పాకయాజిగారికి వాటిల్లినది. ఈదుఃఖసముద్రమునుండి యావలకుబోవుట దుస్సాధ్యము కానోవు! అహా! పాండిత్యము యెంతవరకు ముంచినది.

శ్రీమత్పరమహంసులును, నిత్య నిరంతర నిరంతరాయాభ్యస్త సమస్త వికల్పులునగు యతులు తాముచేయు కార్యములు అకర్తృత్వ, అభోక్తృత్వాది వ్యవహారములతో నాచరించియు, నాచరించనిభంగి చిద్రూపులై యుందురనియు, ఇట్లుగనే శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యాది మహానుభావులు పరకాయ ప్రవేశాది సాధనములతోను, విశ్వామిత్ర పరాశర వ్యాసాది మహర్షులు సాక్షాత్తుగాను, స్త్రీసంగమాదికృత్యముల నాచరించియు, వారు సర్వలోక జేగీయమాన సత్కీర్తిసంపన్నులై నేటికిని భక్తహృదయారవిందములందు తేజోరూపమున భ్రాజింపబడుచున్నారనియు, ఇట్లుగ మనసునందిడుకొని మన శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతి అట్టి అకార్య కరణమున ప్రవర్తించలేదనియును ప్రతిపక్షులన్నట్లు నొకచో ప్రవర్తించినను, వారియనూన బ్రహ్మత్వమునకు లోటువాటిల్లదనియును, ఇట్టియభిప్రాయమున "యతులెట్టికార్యములం జేసియు నిందితులు కారను వాక్యమున గనబఱచెను."

ఈవాక్యవిషయమునుగూర్చి యెవరును ఖండనమును సశాస్త్రీయముగా నేటివరకు వ్రాయజాలకపోయియుండుటచే ఇపుడు నా మోపినంతవరకు శాస్త్రసిద్ధములగు ప్రమాణ వాక్యములతో పై వాక్యవిషయమును సిద్ధాంతరూపముగ ధ్రువపరచుచున్నాను.

ఈ పాషండ పతిత పాకయాజిగారు రూఢపతితశబ్దమును ప్రయోగించుటకు కారణమేమై యుండునో, అందులకు ప్రమాణ వాక్యములెయ్యవియై యుండునో అనియిట్లు కొంచ మాలోచించ తగియున్నది. ఇందులకు కారణమాలోచించ "యతి స్త్రీసంగమము గావించిన నతడా రూఢపతితుడగునని శాస్త్రములు జెప్పుచుండుటచే" నని యిట్లు జాతివిభాగాదర్శమను నీగ్రంథములో 19 పేజీయందు వ్రాసియున్నారు. ఇందుచే నిదికారణమైయున్నది. ఇందులకారూఢ పతితత్వము సిద్ధించుటకు శాస్త్రములయందు జెప్పుచుండుటచే అని యింతమాత్రము వ్రాసిరిగాని శాస్త్రవాక్యమొకటియైనను వ్రాసియుండలేదు. అయిన

ను వీరిట్టిశబ్దమును ప్రయోగించుటకు శాస్త్రవాక్యమేదియైనా గలదా యని శాస్త్రములయందు వెదుక నెచ్చటను ప్రమాణ గ్రంథములలో స్త్రీసంగమొనర్చిన యతి నారూఢపతితుడై యున్నాడను వాక్యము గ న్పట్టుటలేదు. అయిననొకవాక్యము మాత్రము నారూఢపతితుడని జెప్పుచున్నది. అందులోనైనను స్త్రీసంగమొనర్చుటచే నారూఢపతితుడై యున్నాడని చెప్పియుండలేదు. ఇంతకన్నను మరియెచ్చటను జెప్పియుండలేదు కాబట్టి అట్టివాక్యములనుగూర్చి విచారించుచున్నాను.

స్మృ. ఆరూఢపతితం విప్రం దృష్ట్వాచాంద్రాయణంచరేత్ ॥

ఇందుల భావమేమనినచో ఆరూఢపతితుడైన విప్రుని జూచినచో చాంద్రాయణ మొనర్పవలయునని చెప్పుచున్నది. ఈవాక్యము ప్రమాణవచనమని జెప్పిన బూర్వపక్షుల పాండిత్య మెన్నుటకు వారికే తగియున్నది గాని తదితరులకేరికిని తగియుండలేదు. ఏలయన యిది యొకపేరు నూరునులేని స్మృతివాక్యము ఇట్టి స్మృతివాక్యములు ౧ విధివాక్యమనియు, ౨ నిషేధవాక్యమనియు, ౩ నిందావాక్యమనియు, అనియిట్లు మూడువిధములుగ నున్నవనుసంగతి మన ప్రతిపక్షులకు దెలియకనే గ్రంథమును రచించియున్నారు.

౧ విధివాక్యమన ఇదియిట్టివిధియని నిర్ణయించిజెప్పునది విధివాక్యమనియు, ౨ నిషేధవాక్యమన ఇదియవిధియని నిషేధించి జెప్పునది నిషేధవాక్యమనియు, ౩ నిందావాక్యమన యోగ్యాయోగ్యతను విచారించక ఈపాషండ పతిత పాకయాజిగారు నిందించునట్లు నిందించునది నిందావాక్యమనియు, ఇట్లు మూడుతెరగులుగ స్మృతివాక్యములున్నట్లు గ్రంథాదులనుండి దెలియబడుచున్నది.

ఈమూడింటిలోను శృతిననుసరించియుండు విధి నిషేధక వాక్యములే ప్రమాణములుగాని నిందావాక్యమెన్నటికిని బ్రమాణముకాజాలదు.

అదియెట్లనినచో నొకబాలుడు నొకస్త్రీని వచించరాని మాటనువచించి నిందించినపుడు అట్టి నిందావాక్యమునందుండు అర్థ-మెం

తెగలదో నంతయర్థముననుసరించి కార్యక్రమము జరుపుటకు నీబాలుని యవయవములు జక్కగ వికసించి యుండక బోవుటచే నటుల నన్నంత ప్రకారము కార్యక్రమమును జరుపుట కశక్తుడెట్లగునో అటుల నెవ్విధముగ జ్ఞానమునుండి చ్యుతుడగుటకు వీలుగానట్టి యోగారూఢులనీతుచ్ఛమైన నిందావాక్యము నిందించినంత మాత్రముననే వాని యోగారూఢత్వమునకు భంగము కలుగ జాలదు. అందువలన యోగారూఢుల పతితులు కాజాలరు,

ఈయర్థమునే యీక్రిందవాక్యమును దృఢముగ స్థాపించుటయేగాక విధినిషేధ వాక్యములయందును యోగారూఢునకు సంబంధము లేనట్లును జెప్పుచున్నది. ఎప్పుడు విధినిషేధక రూపమైన వాక్యముల యందు యోగారూఢునకు సంబంధము కలుగనప్పుడు ఈతుచ్ఛమైన నిందావాక్యమునందు సంబంధము యోగారూఢునకు బొత్తుగ లేనట్లు మనము గుర్తెరుగతగియున్నది.

వా. నిస్త్రైగుణ్యేపథి విచరతాంకో విధిః కోనిషేధః। పరమహంస బ్రహ్మనిష్ఠత్వసర్వజనామన్యంతే వైదికజ్ఞానకర్మాధికారిషు పురుషేషుమధ్యే యోగారూఢస్య పరమహంసస్యాత్యంత ము త్తమత్వాన్మహా పురుషత్వమ్॥

జీవన్ముక్తివివేకము.

ఇందులకర్థమేమనినచో శ్రీమత్పరమహంసాశ్రమములకు విధినిషేధములు లేవనియు, అట్టి పరమహంసకు బ్రహ్మనిష్ఠ కలిగి యున్నదని సర్వజనులు తలచుచున్నారనియు, వైదికజ్ఞాన కర్మాధికార పురుషులలో యోగారూఢులగు పరమహంస లుత్తమస్థితిగల మహాపురుషులై యున్నారనియు, ఇట్లు దెలియబడుచున్నది. మరియు నీయభిప్రాయమే భగవద్గీతయందలీ క్రిందిశ్లోకముచేతనుకూడా దెలియబడుచున్నది.

శ్లో॥ ఆరురుక్షోర్మునేర్యోగీ కర్మ కారణ ముచ్యతే। యోగారూఢస్య తస్యైవశమః కారణముచ్యతే॥ భగవద్గీత ౬ అ 3 శ్లో.

ఇందుల భావమేమనినచో యోగమును పొందగోరిన మనుజునికి విధినిషేధరూపమైన కర్మము సాధనమని జెప్పబడుచున్నది. మరియు యోగమును బొందినవానికి విధినిషేధరూపమైన కర్మయందు నివృత్తియనగా కర్మలుచేయకబోవుట సాధనమని చెప్పబడుచున్నది.

ఇట్లుగనే శ్రీమచ్ఛంకర భగవత్పాదుల భాష్యమునకూడా జెప్పబడియుండుటచే నందుల యభిప్రాయము నిందుల వ్రాయుచున్నాను. ధ్యానయోగము నాచరించుటకు శక్తిలేనివాడును ధ్యానమును బొందగోరువాడగునట్టి వానికి ఫలాపేక్షలేనివిధి నిషేధరూపమైన కర్మయోగసాధనమైయున్నది. యోగమున బ్రవేశించినవానికి శమమనగా విధినిషేధరూపమైన సర్వకర్మ నివృత్తియే సాధనమగును. అనగా కర్మములను వదలినకొలది నాయాసములేకుండుటచే ఇంద్రియ జయము గలవాడై చిత్తైకాగ్రము కలవాడగునని ఇట్లు శంకర భాష్యము జెప్పుచున్నది.

ఇంతియేకాదు. బూరోక్తమైన "ఆరూఢపతితంవిప్రం" అనునీవాక్యము నిందావాక్యమని బ్రహ్మసూత్రవ్యాఖ్యయయిన తత్వప్రకాశికయను గ్రంథములో జెప్పబడి యుండుదానిని యీక్రింద వ్రాయుచున్నాను.

స్మృ. ఆరూఢపతితంవిప్రం దృష్ట్వా చాంద్రాయణంచరే దితినిందాస్మృతేః।

అనియిట్లు జెప్పియుండుటచే పై వాక్యము నిందావాక్యమనియు ఇట్టి నిందావాక్యముచే యోగారూఢులను పతితులని జెప్పుటకు వలనుపడదనియు దెలియుటయైనది.

ఇట్లు యోగారూఢులు పతితులు గాకపోయినను పోనిమ్ము. స్త్రీసంగమాదులు చేయుటచే పతితులగుచున్నారని శాస్త్రవిధి చేజూపక పొల్లుమాటలచే ఈపాషండపతితపాకయాజిగారు జెప్పినదానికి యీక్రిందవ్రాయు యంశములచే దెలియబడునని వ్రాయుచున్నాను.

ఇందులకు దృష్టాంతములుగా గొన్ని విషయములను దెలియ బఱచి అటుపిమ్మట శాస్త్రవాద ముపక్రమించుచున్నాను. శ్రీమచ్ఛంకర భగవత్పాదులు బూర్వ మొకప్పుడు అమరక మహారాజు గృహమున గార్యాంతర కొందరలచే రాజు భార్యలతో సంసర్గ మొనరింపనట్టి విషయమై పద్మపదాదులు శ్రీమచ్ఛంకర భగవత్పాదులను ప్రశ్నించిన దేమన మీరు నారూఢయతులై యుండి వనితాసాంగత్య దోషమును సంపాదించుకొనగలిగితిరి. అనియిట్లు ప్రశ్నించ ఇందులకు సావధాన మనస్కులవై వినినచో నాప్రశ్నకు సదుత్తరము జెప్పుచున్నామని శ్రీమచ్ఛంకర భగవత్పాదులు బ్రత్యుత్తరముజెప్పిరి. అట్టి వాక్యములనే యిచ్చట వ్రాయుచున్నాము.

శ్లో॥ అసంగినోన ప్రభవంతి కామహారేకివాభీరవధూసఖస్య। వజ్రోలియోగప్రతిభూస్సఏష వత్సావకీర్ణత్వవిపర్యయోనః॥

శంకరవిజయము ౯ సర్గ॥ ౮౦ శ్లోకము.

ఈ శ్లోకమునకు గల వ్యాఖ్యానమును గూడా నిందు బొందుబఱచి పటుపిమ్మట భావమును చెప్పుచున్నాను.

వ్యా॥ కింతదిత్యపేక్షాయామాహ అసంగిన ఆసక్తి విసుర్ముక్తస్యకామః నప్రభవంతి తత్రదృష్టాంతః। గోపవధూసఖస్య శ్రీకృష్ణస్యేవ కించ వజ్రోలిసంజ్ఞిక యోగప్రతిభూస్సఏష। హేవత్సనో అస్మాకమవకీర్ణత్వస్యకేతః పాతేనక్షతవ్రతత్వ స్యవిపర్యయస్తదభావః తస్యాకేతః ఆకర్షణ సామర్థ్యసంపాదకత్వాత్॥

ఇందుల భావమేమనినచో గోపికలకు సఖుడైనటువంటి శ్రీకృష్ణునివలె అసంగులగు నారూఢయతులమాకు కోరికలు గలుగజాలవు. మరియువజ్రోలిసంజ్ఞిక యోగప్రతిభవలన మాకు రేతస్సు సాకర్షింపబడిన కతనమున స్త్రీసంగమ దోషమంటజాలదు.

శ్లో॥ సంకల్పఏవాఖిల కామమూలం సఏవమేనాస్తి సమస్తవిష్ణోః। తన్మూలహానౌ భవపాశనాశః। కర్తుస్సదాస్యాద్భవ దోష దృష్టేః॥ శంకరవిజయము. ౯ సర్గ. ౯౧ శ్లోకము.

ఈశ్లోకమునకుగల వ్యాఖ్యానమును కూడా నిందు బొందుపఱచి నటుపిమ్మట నిందులభావమును జెప్పుచున్నాను.

వ్యా॥ కించసంకల్ప ఏవాఖిలాభిలాషస్యమూలం సఏవకృష్ణ తుల్యస్యమమనాస్తి। తథాచసద్దైవ సంసారదోషదృష్టిః కర్తురపికామమూలస్య సంకల్పస్యహానౌ సత్యాంభవపాశనాశస్స్యాత్॥

ఇందుల భావమేమనినచో సమస్తమైన కోరికలకు సంకల్పమే మూలకారణమైయున్నది. శ్రీకృష్ణునితో సమానమైన మాకట్టి సంకల్పము లేకబోవుటచే నీచే నారోపింపబడిన స్త్రీసంగమ దోషము గలుగ జాలదు.

అనియిట్లు శ్రీమచ్ఛంకర భగవత్పాదులు జెప్పియున్నారు ఇచ్చట ప్రతిపక్షులు జెప్పునదేమన్నను శ్రీభగవత్పాదులు పరకాయ ప్రవేశముజేసి యుండుటచే బూర్వశరీరమునకట్టి దోషములు కలిగియుండలేదని జెప్పెదరు. కాని యట్టియభిప్రాయము సరియైయుండలేదు. ఏలయనినచో బూర్వపక్షులు జెప్పినవి యుక్తియుక్తమై యుండిన యెడల పద్మపాదాచార్యులు ప్రశ్నించకనే యుండవలయును. ఒకవేళ పద్మపాదులజ్ఞతచే ప్రశ్నించియుండినచో శ్రీమచ్ఛంకర భగవత్పాదులు మేము పరకాయప్రవేశము చేసి యుండుటచే మాకట్టి దోషము కలుగజాలదని ప్రత్యుత్తరము జెప్పియుండవలయును. ఇట్లు యీరెండువిధములలో నెద్దానినైన నొకదాని నవలంబించక బూర్వోక్త శ్లోకముల రెండిటియందు నై యభిప్రాయములు గన్పడక మేమునసంగులమగు పరివ్రాజకులమగుటచే మాకట్టి దోషములు కలుగ జాలవనియు, ఇంతియేగాక రేతస్సు నాకర్షించుశక్తి మాకుగలిగియుండునట్టి వజ్రోలి యను పేరుగల యోగమును మేమభ్యసించి యుండుటచే స్త్రీసాంగత్యాదుల వలన మాకు రేతోపాతము కలుగ జాలదని యిట్లు జెప్పియున్నారు. గాని పై విధిని జెప్పియుండలేదు.

ఇంతియేకాదు శ్రీరామకృష్ణపరమహంసగారును ఈ వజ్రోలి యభ్యాసముకొరకు స్త్రీసంగమ మొనర్చి తద్యోగమభ్యసించి యోగసిద్ధిబొందిరని వారిచరిత్రవల్ల మనము గుర్తెరుగుచున్నాము.

కవజ్రోలియోగ మెవరికభ్యస్థమైయుండునో వారికి రేతోపాతము కలుగ జాలదని హఠయోగప్రదీపిక తృతీయోపదేశమున ౮౩,౮౪, ౮౭, ౮౮, శ్లోకములయందు విపులముగను, మరియు యోగతత్వోపనిషత్తుయందు సూక్ష్మముగను వెండియు యోగసారావళి గ్రంథములయందు విశేషించి జెప్పబడియున్నది.

ఇట్టి వజ్రోలియోగము జేయుటయందు శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతిగారును సమర్థులైయున్నారని నేను ఘంటాపథముగ నొక్కి వక్కాణించుచున్నాను. ఇంతియేగాదు శ్రీవారిట్టి వజ్రోలి యొక్క ప్రదర్శనము నీరాజధానియందొక మండల పోలీసు సూపరెండెంటుగారి యెదుటను, మరియు సెంట్రల్‌ప్రోవింసెసు (మధ్యపరగణాలు) ఛీఫ్కమీషనరు మొదలగు మరికొందరి ప్రముఖులయెదుటను జూపియున్నారు. వెండియు శ్రీవారునాగపూరులో ప్రకటించిన పత్రికయందును మేము వేదాంత యోగశాస్త్ర పండితులమనియు, యోగాభ్యాసవేదాంతోపన్యాసాదులయందు మిక్కిలి సమర్థులమనియు బ్రకటించియున్నారు.

"వేదాంతయోగశాస్త్ర పండితోవయం। యోగాభ్యాసోపన్యాసాదికేషు అతీవసమర్థాశ్చ."

అనియిట్లు బ్రకటించియుండుటచే యిందువలన మనము గుర్తింపతగినదేమన్నను, శ్రీమచ్ఛంకర భగవత్పాదులకెట్లు వజ్రోలియోగాభ్యాసమువలన స్త్రీసాంగత్యదోషము జనించి యుండలేదో అట్లు శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతిగారియందును ప్రతిపక్షులచే నారోపింపబడినట్టి దోషము మిథ్యయగునేగాని లభ్యము కాజాలదు. ఇట్టి వజ్రోలియోగము శ్రీవారికొకరికేగాక వారిశిష్యులలో యోగాభ్యాసపరులుగనుండు పలువురికి నిట్టి యభ్యాసము గలిగియున్నదని గూడా వ్రాయుచున్నాను.

ఇట్లు నేనువ్రాయుటచే శ్రీవారియందట్టి దోషముగలదనితలంచకుడీ. ఏలయనినచో శ్రీవారియందు ప్రతిపక్షులగు వారు స్త్రీసంగమ

మువలన దోషముకలదని లిఖించిన దాని నేనట్టిదోషము శ్రీవారియం దు లేదని ఒకమాటచే జెప్పుటకన్నను బ్రతిపక్షుల వాదమునే వాదము కొరకు గ్రహించి బ్రతివిషయము విమర్శించుట నాపనియైయున్నది. గ నుక నేనిట్లు వ్రాయుటయైనదిగాని మరొండభిప్రాయముచే వ్రాయ నైతిని.

ఇందుచే పరివ్రాజకులగు నారూఢయతులు ప్రారబ్ధ వశంబున కార్యాంతరములచే స్త్రీసంగమము కలుగజేసుకొనుచుండినట్టును, త ద్దోషమున లిప్తులుగాక యుండినట్టును, బ్రతిపక్షులు దెలియకనజ్ఞతచే బ్రకటింపబడిన పతితశబ్దమునకు బాత్రులుగానట్టును, ఇంతవరకుజరిగిన గ్రంథసందర్భముచే మనము గుర్తెరుగుటయైనది.

ఇంతియేగాదు. శ్రీమద్రామాయణములో సుందరాకాండయం దు నాంజనేయులవారు లంకాపట్టణమున రావణుని యంతఃపురమున సీతను వెదుకుచు నచ్చట సీతనుగానక రావణునిచే నపహరింపబడిన స్త్రీ లనుజూచి నే బ్రహ్మచర్యవ్రతమును ధరించియుండువాడను అయిన నే ను యిట్టిస్త్రీలను జూచుటచే నాబ్రహ్మచర్యవ్రతమునకు భంగము దట స్థపడినదని దనలో దానాలోచించి దాగొప్ప పండితుడగుటచే నప్పటి లో తనకుగలిగిన సందేహమును తానే ఈక్రిందిశ్లోకముచే నివర్తిజేసు కొనుటయైనది.

శ్లో॥ కామందృష్ట్వా మయాసర్వా విశ్వస్తా రావణాస్త్రియః।
నహిమేమనసః కించిద్వైకృత్యముపపద్యతే॥
సుందరాకాండము. ౧౧ సర్గ. ౪౦ శ్లోకము.

ఇందులకర్థమేమన్నను నేను కోరికచే రావణునియొక్క స్త్రీలను జూచియుండలేదు. అందుచే నామనస్సు కొంచమైనను విపరీతమును బొందియుండలేదు. నేను కోరికలను గోరి స్త్రీలను జూచియుండినచో నామనస్సు విపరీతమును బొందియుండును. అందువలన స్త్రీలనుజూచి న దోషముచే నాబ్రహ్మచర్యవ్రతము చెడియుండును. అని యీప్రకా

రము తనలో దానాలోచించి తనకుగలిగిన శంకను నివర్తి జేసుకొనుట యైనది. ఇంతియే కాదు.

శ్లో॥ సకథం ధర్మసేతూనాం వక్తాకర్తాభిరక్షితా। ప్రతీపమాచర ద్బ్రహ్మన్ పరదారాభిమర్శనమ్॥ ఆప్తకామయదుపతిః కృతవాన్వై జుగుప్సితమ్। కిమభిప్రాయఏతన్నః సంశయంఛిందిసువ్రత॥

శ్రీమద్భాగవతము ౧౦ స్కం. 33 అ. శ్లో 30.

ఇందులకర్థమేమనినచో ఓశుకమహర్షీ ధర్మములను నిబంధనలనుచేసి ఆప్రకారము కాపాడునట్టి భగవంతుడగు శ్రీకృష్ణుడు నిందితముగు పరదారలను దాకుటలను ఏలచేసెను, మరియు సంపూర్ణకాముడగు శ్రీకృష్ణుడు నిందితమైన కార్యములను ఏయభిప్రాయముతో జేసెను. ఈ సంశయమునాకుబోగొట్టుమని పరిక్షిత్తు ప్రశ్న చేసెను. ఇందులకనువగు నాంధ్రభాగవతిపద్యమునుకూడా జూడుడీ.

మత్తకోకిల॥ ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియునైన సత్కర్మశీలుడు ధర్మశిక్షయు సేయగా। నర్మిలిస్థరమీదబుట్టి పరాంగనాజన సంగమే ధర్మమంచు దలంచిజేసెను దాత్తమానస ... మా.

దశమస్కంధము జలక్రీడాభివర్ణనమునందలి పద్యము.

ఇట్టిప్రశ్నకు శ్రీశుకులువారు యిచ్చిన ప్రత్యుత్తరము జూడుడీ.

శ్లో॥ ధర్మవ్యతిక్రమోదృష్ట ఈశ్వరాణాంచ సాహసం। తేజీయసాన దోషాయవహ్నేస్సర్వభుజోయథా॥

దశమస్కంధము 33 అధ్యా. 3౧ శ్లోకము.

ఇందులకర్థమేమనినచో ఓపరిక్షిద్రాజా తేజోవంతులును భగవదంశ గలిగి సమర్థులగు బ్రహ్మేంద్ర చంద్ర విశ్వామిత్రాదుల యందు నగపడునట్టి ఏధర్మవ్యత్యయము సాహసము గలదో నట్టి ధర్మవ్యత్యయము సర్వభక్షకుడగు అగ్నికి దోషముచేసనట్లు వీర్లకును దోషావహమై యుండలేదు,

వ. అనిన శుకుఁడిట్లనియె.

గీ. సర్వభక్షకు డగ్ని సర్వంబు భక్షించి। దోషిగాని పగిది దోష మైన। జేసి దోషపదము జెందరు తేజస్వులగుట చంద్రవాసహా దులధిప.

దశమస్కంధము జలక్రీడాభివర్ణనము.

ఇందులకనుగుణ్యమగు శృతిప్రమాణముల జూడుఁడీ.

శ్లో॥ యథారవిస్సర్వ రసాన్ప్రభుఙ్క్తే హుతాశనశ్చాపిహిసర్వభక్షః। తథైవయోగీ విషయాన్ప్రభుఙ్క్తే నలిప్యతే పుణ్యపాపైశ్చశుద్ధః॥ అవధూతోపనిషత్.

ఇందుల భావమేమనినచో సూర్యుడు మేధ్యామేధ్యముల యొక్క సమస్తరసములను గ్రహించినను, అగ్ని మేధ్యామేధ్యముల సమస్తపదార్థములను భక్షించినను అనగా హుతిము చేసినను ఎట్లుపరిశుద్ధులై యుందురో అట్లుగనే యోగియైన జ్ఞానియు నిచ్ఛానిచ్ఛ పరేచ్ఛలను ప్రారబ్ధవశంబున విషయాదులనుభవించినను సూర్యాగ్నులు పరిశుద్ధులై యుండునట్లు యోగియగు నారూఢుఁడట్టి పుణ్యపాపములచే లిప్తుఁడుగా జాలడు.

ఇట్టియభిప్రాయమునే వేదాంత శాస్త్రము చెప్పుచున్నది. అట్టి వాక్యములన్నియు నిచట వ్రాయుచున్నాను.

సూ॥ తదధిగమ ఉత్తర పూర్వాఘయోరశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్.

బ్రహ్మసూత్రము ౪ అ. ౧ పా. ౧౩ సూత్రము.

టీ. తదధిగమే బ్రహ్మప్రాప్తియందు ఉత్తర పూర్వాఘయోః। ఆగామిసంచితపాపములకు, అశ్లేషవినాశౌ। అసంగత్వప్రణాశములు, భవతః। కలుగుచున్నవి. ఏలయన, తద్వ్యపదేశాత్। జ్ఞానులకు దురితక్షయమగునను శ్రుత్యుపదేశమువలన,

శ్లో॥ యథాపుష్కరపలాశ ఆపోనశ్లిష్యంత ఏవమేవం విదిపాపం క
ర్మనశ్లిష్యతే॥

అనగా పద్మపత్రమును జలములంటవో అట్లు బ్రహ్మవేత్తనుపా
పములంటవు యను నీవాక్యముపదేశించుచున్నది. ఇంతియేకాదు.

శ్లో॥ తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవంహాస్య సర్వే
పాప్మానః ప్రదూయంతే॥

అనగా జమ్ముదూది యగ్నియందు వేయబడి యెట్లుదగ్ధమగునో
అట్లు విద్వాంసుని పాపములన్నియు నశించును. ఇంతియేగాక నిర్గుణ
బ్రహ్మవిద్యాప్రకరణమందుగూడ,

శ్లో॥ భిద్యతేహృదయగ్రంథిశ్ఛిద్యంతేసర్వసంశయాః। క్షీయంతేచా
స్య కర్మాణి తస్మిన్ దృష్టేపరావరే॥

అనగా స్వరూపుడగు పరమాత్మను చూడబడుచుండగా హృ
దయగ్రంథిభిన్నమగును. సర్వసంశయములు ఛిన్నములగును. అతని
కర్మములన్నియు క్షీణమగును. అనునీ వాక్యములు బ్రహ్మవేత్తయగు
నారూఢునియొక్క కర్మక్షయ వ్యపదేశమును జెప్పుచున్నవి. ఇంతియే
కాదు.

శ్లో॥ సర్వంపాప్మానంతరతి తరతి బ్రహ్మహత్యాం యోశ్వమేధేనయ
జతే యఉచైనమేవంవేద॥ స్మృ॥ జ్ఞానినఃసర్వపాపాని శీర్యంతే
నాత్రసంశయః। క్రీడన్నపి నలిప్యేత పాపైర్నానావిధైరపి॥ గీత॥
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేర్జున॥

అనగా ఎవడశ్వమేధ యాగము ననుష్ఠించునో యెవడీయశ్వమే
ధము నిట్లుపాసించునో వాడు సర్వపాపములనుదాటును. బ్రహ్మహత్యే
నుగూడా దరించును. మరియు జ్ఞానికి సర్వపాపములు క్షయించును.
ఈవిషయము సంశయములేదు. వాడూరక యాడుకొనుచున్నను, బ
హువిధపాపములు వానినంటవు. జ్ఞానాగ్ని సమస్త పాపములను భస్మ
ము జేయును.

ఈయభిప్రాయమునే జ్ఞానియగువారొకరు గ్రంథమున జెప్పియున్నారు. వారు జెప్పిన యభిప్రాయమేమన్నను జ్ఞానికి సంచితాగాములను రెండుకర్మలు నశించుచున్నవనియును, ప్రారబ్ధముమాత్ర మనుభవముచే నశింప వలయుననియు, నట్టి ప్రారబ్ధ మనుభవించుచుండిన నాదోషమునకు పాత్రుడుగాడని జెప్పియున్నారు.

అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్ట ఇత్యాదిశ్రుతిః హృత్పుండరీకమధ్యే సచ్చిదానందరూపం పరమేశ్వరం స్వాత్మతయా సాక్షాత్కుర్వతాం సకలార్థమూలభూతావిద్యానాశాత్తత్కార్యభూత మనేక భవ పరంపరా ప్రాపకం సంచితపుణ్యపాపరూపం ధర్మాదికం సర్వం సజ్జ్ఞానాగ్నినాదగ్ధంభవతి। తథాచశ్రూయతే। తద్యథేషీకాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత। ఏవంహాస్యసర్వే పాప్మానః ప్రదూయంత ఇతి భగవతాప్యుక్తం. యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున। జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథేతి। బాదరాయణోపి పరతత్త్వజ్ఞానాగ్నినాత్సంచితాగామి కర్మణోర్వినాశాశ్లేషౌ సూత్రయామాస। తదధిగమ ఉత్తర పూర్వాఘయోరశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్। ఏవందాహః ప్రారబ్ధవ్యతిరిక్తస్య కర్మణః ప్రారబ్ధంతు భోగైక నివర్త్యంస్యాత్। తస్య తావదేవచిరం యావన్నవిమోక్ష్యే ఇతిశ్రుతౌ జ్ఞానోత్తరకాలమపి శరీరపాతపర్యంతం విలంబ ప్రతిపాదనేన ప్రారబ్ధకర్మణోభోగైక నివర్త్యత్వ ప్రతిపాదనాత్। అనారబ్ధకార్యే ఏవతుపూర్వే తదవధేరితి తేనైవ విశేషితత్వాచ్చ। ప్రారబ్ధభోగసమయేఽపి తస్య అశ్లేషత్వమపి శ్రుతిర్దర్శయతి। తద్యథా పుష్కర పలాశపర్ణ ఆపోనశ్లిష్యంతే। ఏవంవిధిపాపం కర్మనశ్లిష్యంతే॥

అద్వైత బ్రహ్మతత్త్వప్రకాశిక సదేకత్వ విచారణ ప్రకరణము.

ఇందులభావము పై వాక్యములయందే జెప్పియున్నాను.

ఇచ్చట నీదుష్టాష్టకము జెప్పునదేమన్నను బూర్వోదాహృతశ్రుతిస్మృతేతిహాస పురాణములయందు జెప్పిన జ్ఞానలక్షణము శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతిగారియందు వర్తించుట దుస్తరమైయున్నదనియు, వీరు కేవల కాషాయదండమాత్రులై సన్యస్య శ్రవణం కుర్యాదను న్యాయానుసారము వేదాంతశ్రవణార్థము సన్యసించిన వారగుటచే జ్ఞానప్రతిపాదకములగు శాస్త్రముల విడనాడి ధర్మశాస్త్రానుసారము, శ్రీ శ్రీ శ్రీ ఈసరస్వతీస్వాములను బద్ధులను జేయుట యుక్తము. ఇట్టిస్థితిలో ప్రారబ్ధవశంబునైనను పరివ్రాజకులగు యిట్టియతులకు స్త్రీసంగమంబు యుక్తమైయుండలేదను మాధర్మశాస్త్రవచనములే సిద్ధాంతములైయున్నవనిన దో సందువిషయమైకూడా నిప్పుడు విచారించుట మనకు కర్తవ్యమైయున్నది.

ఇట్లు యీదుష్టాష్టకము జెప్పు నెడల జాతివిభాగాదర్శమను నీగ్రంథము ౧౯ పేజీలో నాయూధ అనుశబ్దమును తిండిమెక్కువైతె లివితక్కువగ నుండునట్లుగాక నుండినప్పుడు ప్రయోగించకనే యుండవలయును. ఎప్పుడట్టిశబ్దమును ప్రయోగించుట గలిగినదో నప్పుడువ్రాయబడిన శ్రుతిస్మృతేతిహాస పురాణవచనములచే జెప్పినవిషయములకు తప్పక బాధ్యులుగావలసియున్నది.

అయినను నాసంన్యాసవిషయములో సంఘశాస్త్రమగు ధర్మశాస్త్రమేమి జెప్పుచున్నదో నద్దానినిగూడా కొంతపరిశీలించి జూచెదము.

శ్లో॥ వక్ష్యే వివిదిషాన్యాసం విద్వన్న్యాసంచ భేదతః। హేతువిదేహముక్తేశ్చ జీవన్ముక్తేశ్చతౌ క్రమాత్॥ జీవన్ముక్తివివేకము.

అను నీశ్లోకము శ్రీ శ్రీ శ్రీ విద్యారణ్యమహామునులచే రచియింపబడిన జీవన్ముక్తివివేకమను గ్రంథమున గన్పట్టుచున్నది. ఈశ్లోకోక్త ప్రకారము విదేహముక్తియే ప్రధానముగాగలది వివిదిషా సన్యాసమనియు, జీవన్ముక్తియే ప్రధానముగా గలది విద్వత్సన్యాసమనియు, ఇట్లు సన్యాసము రెండుతెరగులుగ నున్నట్టు గన్పట్టుచున్నది. ఈరెండువిధ

ములగు సన్న్యాసములే సన్న్యాసోపనిషత్తుయందు నాలుగువిధములుగ ను న్నట్టు ఈక్రిందివచనముచే దెలియుచున్నది.

శృ॥ వైరాగ్యసన్న్యాసి, జ్ఞానసన్న్యాసి, జ్ఞానవైరాగ్యసన్న్యాసి, కర్మ సన్న్యాసిచేతి చాతుర్విధ్యముపాగతః॥

ఇందులో జన్మాంతరపుణ్యవశముచే బాల్యమునందే సన్యసించ డమేదిగలదో అది వైరాగ్యసన్న్యాసమనబడును. ఇట్లే శ్రుతియు జెప్పు చున్నది.

శృ॥ ప్రాక్పుణ్యకర్మవిశేషాత్సన్యస్త వైరాగ్యసన్న్యాసీ॥ సన్న్యాసోపనిషత్.

అనగా జన్మాంతర పుణ్యకర్మవిశేషముచే సన్యసించడము వైరా గ్యసన్న్యాసమనియు, అట్టిదియే వివిదిషాసన్న్యాసమనియు, ఇట్లు ముందు జెప్పినట్టి యతిధర్మప్రబోధిని మొదలగు గ్రంథముల యందు జెప్పబడి యున్నది. మరియు నీయభిప్రాయము భగవద్గీత యందును జెప్పబడు చున్నది.

శ్లో॥ ప్రాప్యపుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః। శు చీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోభిజాయతే। అథవా యో గినామేవ కులేభవతిధీమతాం। ఏతద్ధి దుర్లభతరం లోకేజన్మ యదీదృశం॥ భగవద్గీత ౬ అ. ౪౧, ౪౨.

అనగా యోగమునుండి తప్పినవాడు బుణ్యము జేసిన వారిలోక ములనుహొంది పెక్కుసంవత్సరము లచ్చటయుండి అటుపిమ్మట పుణ్య కర్మనాశనానంతరము సంపదగలవారును పరిశుద్ధులును అగు యింటను బుట్టుచున్నారు. అనగా యోగమార్గమున ప్రవర్తించి యోగభ్రష్టు డైన సన్న్యాసి అశ్వమేధాదులచేసిన వారి లోకములనుహొంది యచ్చటి కర్మానుభవమైన తోడనే శాస్త్రోక్తముగా నాచరించు శ్రీమంతులగు వారియింటను బుట్టుచున్నాడు. లేక జ్ఞానవంతులగు యోగులవంశము న బుట్టుచున్నాడు. ఇట్టిజన్మమేదిగలదో అది లోకమున దుర్లభమైన

జని శ్లోకమందలి అథవాయను శబ్దముచే తెలియబడుచున్నదని శ్రీమచ్ఛంకర భగవత్పాదుల భాష్యమున జెప్పబడుచున్నది.

ఇందుచే జన్మాంతర పుణ్యవశమువలన బాల్యమునందే సన్యసించి దేహపతనముకొఱకు గాచియుండు మహానుభావులగు వివిదిషా సన్యాసులవిషయములో సన్యస్య శ్రవణం కుర్యాదను న్యాయమును జెప్పి అట్టివారిని బద్ధులనుజేయుట ఈదుష్టాష్టకమునకే తగియున్నదిగాని మరియేరికిని తగియుండలేదు. ఇట్లుచెప్పిన సన్యస్యశ్రవణం కుర్యాదను వాక్యము విద్వత్సన్యాసుల విషయమునందే సమన్వయించుకొనవలయును గాని వివిదిషాసన్యాసులయందు సమన్వయించుకొనగూడదు.

ఇంతియేకాదు వివిదిషా విద్వత్సన్యాసముల రెంటిలో వివిదిషా సన్యాసులకు విద్వత్సన్యాసులకువలె గర్మలులేక స్వల్పకర్మలతో దేహయాత్రగడుపుకొనుచు స్వయంతీర్ణపరాం తారయతి, అను నీన్యాయమవలంబించి సంచరించుచుదురని శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులగు నీలకంఠ యతీంద్రులు యతిధర్మప్రబోధినియను గ్రంథమున యీక్రిందివిధమున జెప్పియున్నారు.

> యథావివిదిషా సన్యాసస్యసన్న్యైకస్య ము క్తిహేతో విద్వత్సన్యాసలక్షణం సంకోచితా। ఏవంప్రజా బాహుళ్యస్యానుగ్రహార్థం॥ శ్లో॥ భూపతిర్మృగయావృత్త్యా దేవేంద్రోవా ద్విశిక్షయా విధిర్వేషమస్పృష్ట్వా వాహరిశ్చాసురనిగ్రహాత్‌। రుద్రపరోవాభువిన నింద్యతే నైవహీయతే॥ ఆకాశవన్మాన విహారగోహమాదిత్యవద్భాస్వ విలక్షణోహం। అంబోధివత్పార వివర్జితోహంమహాద్రివద్ధైర్య వినిశ్చలోహమితి నిశ్చయవతాం తేషాంతేజో విశేషేణ ప్రత్యవాయోనవిద్యతే ఇతి న్యాయాత్సంచకోచనాదిపరిగ్రహో అనుగ్రహ ఏవ॥

యతిధర్మప్రబోధని 36 పత్రము. గ్రంథాక్షరములో ముద్రితమైన గ్రంథము.

ఇంపులకర్థమేమన్నను వివిదిషాసన్యాసులగు యతులు విద్వత్సన్యాసుల ధర్మములు ఎల్లప్పుడనుష్ఠించుచుండినచో ప్రజలను బోధించుటయందు ప్రవర్తించుటకు వీలుండదు గనుక బహుజనులను బోధనాదికార్యములచే కృతార్థులను జేయుటకొఱకై ముక్తిరూపమగు వివిదిషాసన్యాసమునకు విద్వత్సన్యాస ధర్మములు సంకోచింపబడినవి. ఎందులకనినచో, ఈవివిదిషాసన్యాసి ఇంతకు బూర్వ జన్మలయందు శ్రవణ మనన నిదిధ్యాసములు జేసియుండుటచే నీజన్మమున నూతనముగా శ్రవణ మనన నిధిధ్యాసనములు మరల చేయుట నావసరమై యున్నది. ఇందుచే శ్రీవివిదిషాసన్యాసులు స్వయంతీర్ణః పరాన్తారయతి అనునీన్యాయమవలంబించియున్నారు. గనుక నే బహుప్రజలనుకృతార్థులనుచేయుటయే విలాసమున విధిగానెన్నుకొని ఈ వివిధిషాసన్యాసులు పర్యటన మొనర్చుచున్నవారు. ఈయభిప్రాయమునే పై వాక్యములయందు సూచింపబడుటయేగాక సృష్టివివిదిషాసన్యాసి ప్రవర్తనల వలన నింద్యములను బొందజాలరని నా వాక్యముల క్రింద నుండు శ్రుతులు చెప్పుచున్నవి.

అవియేవియనినచో పై వ్యాఖ్యానమున యుండు శృతివాక్యములైయున్నవి. వాటితాత్పర్యమిచ్చట వ్రాయుచున్నాను. సమస్తమైన ప్రాణికోటిని సమబుద్ధితో పరిపాలించు రాజు దుష్టమృగములను సంహరించినప్పుడును, సమస్తప్రాణికోటిని సమబుద్ధితో పరిపాలించు ఇంద్రుడు రాక్షసులను సంహరించినప్పుడును, సమస్తప్రాణికోటిని సమముగ సృజించదగిన బ్రహ్మ విధివశంబున విషమసృష్టి జేసిన యప్పుడును, సమస్తప్రాణికోటిని సమబుద్ధితో పరిపాలించువిష్ణువు దుష్టరాక్షసులను సంహరించినప్పుడును, ఎట్లు నిందితులుగారో అట్లు విద్వత్సన్యాసధర్మములను వదలిన వివిదిషాసన్యాసులు నింద్యులుగాజాలరు.

మరియు గణించుటకు వీలులేని పరిమాణముగల యాకాశము వలె నేను సర్వవ్యాపకుడనై యున్నాను. సూర్యుడు మేధ్యామేధ్యముల యందు ప్రకాశించినను అట్టి మేధ్యామేధ్యముల గుణదోషములు నా

సూర్యుని స్పృశించనియట్టు నేను పరిశుద్ధుడనై యున్నాను. పారమెం చుటకు వీలులేని యపారమగు సముద్రమువలె నేనఖండస్వరూపుడనై యున్నాను. ఇంతియేగాక మేరుపర్వతము సమానమగు ధైర్యమునుండి చలించని నిశ్చయముగలనేను "అహంబ్రహ్మాస్మి" ఇత్యాకార జ్ఞానమునుండి చలించని దృఢనిశ్చయుడనై యున్నాను. అను నీప్రకారము దృఢనిశ్చయము గలవార్లయొక్క తేజోవిక్షేపణము చేత ప్రత్యవాయము గలుగజాలదను నీన్యాయమునే విద్వత్సన్యాస ధర్మములు వివిదిషా సన్యాసులయందు లోకానుగ్రహార్థమై సంకోచింప బడినవని గుర్తెరుగ తగియున్నది.

ఇంతియేకాదు. వివిదిషాసన్యాసులును, విద్వత్సన్యాసులును, దండాదిగ్రహణము జేయు సమయమునందును జెప్పినవాక్యములుజూడ లోకానుగ్రహార్థమయ్యేనా దండాదులను గ్రహించినట్టున్నదిగాని ఈదుష్టాష్టకముయొక్క యిష్టానుసారము బ్రవర్తించుటకై గ్రహించినట్టు గన్పట్టదు.

> కౌపీనదండమాచ్ఛాదనంచ స్వశరీరోపభోగార్థాయచ। లోకస్యోపకారార్థాయచ పరిగ్రహాయేదితి దండస్వీకారః॥
> జీవన్ముక్తివివేకము.

ఇట్లు లోకోపకారమునకై యును దండాది పరిగ్రహణము జేసి స్వేచ్ఛగా సంచరించు వివిదిషా సన్యాసులకు కర్మబద్ధత్వము జేయుట యంతయో దెలివితక్కువగ గన్పట్టుచున్నది. తెలివితక్కువ గాకేమి, గృహస్థులగు నీదుష్టాష్టకమునకు వారి గృహస్థాశ్రమధర్మములు వారికి దెలియకబోవుటవల్ల ఏమిదెలియకబోతె వెక్కిరించెనను, న్యాయమీ దుష్టాష్టక మవలంబించి ఇతరాశ్రమస్థులను నిందించు చున్నారు. ఇట్టి వైవిషయములను బట్టి శ్రీమత్పరమహంసేత్యాది సకలబిరుదావళి విరాజమానులగు స్వామి. జి. యస్. బి. సరస్వతిగారు పూర్వాశ్రమమున బాల్యములో బ్రహ్మచర్యాశ్రమమునందు తుర్యాశ్రమమును స్వీకరించి బూర్వోక్త ప్రమాణములననుసరించి వివిదిషాసన్యాసులై లోకోపకార

మగు కార్యముల యందు బ్రవర్తించుచున్న మహానుభావు లగుటచే బ్రతిపక్షులగు నీదుష్టాష్టకము శ్రీవారియందారోపించిన స్త్రీసంగమదోషజనితులైన పతితత్వమెన్నటికిని వ్యక్తీభావమును బొందజాలదు.

ఇట్టితరి యీదుష్టాష్టకము పరివ్రాజకులగు వివిదిషాసన్యాసుల విషయమై వర్తించక బోయినను విద్వత్సన్యాసుల విషయమునందు వర్తించునేమో నదియు నాలోచించెదము.

సన్యాసులు స్త్రీసాంగత్యము వలన పతితులగుదురని గదా ఈ దుష్టాష్టకముచే వ్రాయబడియున్నది. ఇట్టి విషయములో శాస్త్రమని జెప్పబడు ధర్మశాస్త్రమునందు ప్రాయశ్చిత్తవిధి లేక బోయినప్పుడును అట్టి ప్రాయశ్చిత్తములు చేసుకొనక బోయినప్పుడును ఈ దుష్టాష్టకముచే బ్రకటింపబడిన పతితత్వముసార్థకమగును

ఇట్లు యిచ్చాప్రారబ్ధము ననుసరించి చేయబడిన స్త్రీసాంగత్యాది దోషములకు ధర్మశాస్త్రాది గ్రంథములయందు ప్రాయశ్చిత్తవిధులు గన్పడుచుండ పతిత్వమెట్లుసిద్ధించునో ఈదుష్టాష్టకము యొక్క మనోరథ మెట్లుఫలించునో వారికే దెలియవలయును. ఈక్రిందను యతిధర్మప్రబోధిని అను నీగ్రంథమునుండి పరివ్రాజకులు స్త్రీసంగమంబొనర్చిన నట్టిప్రాయశ్చిత్తములు జెప్పబడియున్నవో అట్టిప్రాయశ్చిత్తవిధులను ఇచ్చట వ్రాయున్నాను జూడుడీ.

అథప్రాయశ్చిత్తముచ్యతే.

సూ॥ సర్వాపేక్షాచయజ్ఞాది శ్రుతేరిత్యధికరణేత త్తదాశ్రమ ధర్మాణా మవశ్యాను ష్ఠేయత్వేన తత్ప్రచ్యుతేః ప్రాయశ్చిత్తవ్య పాశ్రయణేన ప్రకృతిధర్మాప్యత్వేచనిషిద్ధస్యాప్రస క్తసత్యం నిత్యాకరణ నిమిత్తపరిహారోవశ్యమనుష్ఠేయః । అన్యథారూఢస్యయతేసర్వాతి జాయినః ప్రాయశ్చిత్తాకరణే బహిష్కార్యో బహిస్థాభయథా పిస్మృతే రాచారాచ్చేతి వైయ్యాశిక సూత్రం నహీయతేరితరవత్ పాపసంసర్గాప్రసక్తేః జన్మాం తరార్జితాఘస్య సమస్తస్యసన్యాస మాత్రేణ నిర్మూలిత

త్వాత్। ప్రాయశోన్న భక్షణ నిమిత్తమేవేతితద్దోషశాంతిర్వక్తవ్యేత్య భిప్రేత్యాహాన్న మితి॥

శివధర్మవచనాదీని.

శ్లో॥ అన్నంపిపీలికాయుక్తం భుంజానోన్న మవక్షుతమ్॥

ప్రాయశ్చిత్తం.

శ్లో॥ తావాన్మాత్రం సముద్ధృత్య ప్రోక్షయేదంభసాతతః॥ ఆజ్యాభిఘారణాచ్ఛుద్ధిర్భస్మక్షేపేణవా భవేత్ । అనివేద్యనభుంజీత యదాహారాయకల్పితం। అనివేద్య తుభుంజానః ప్రాయశ్చిత్తిర్భవేద్యతిః॥ శివస్యాష్ట శతంజప్త్వా పూజయాచవిశుధ్యతి। అనస్థిప్రాణిసంఘాతం హత్వైకాదశికాంజపేత్ । హత్వాచపక్షిణస్సర్వాం త్రిశేకాదశికాంజపేత్ । సర్వమార్జారనకులశున కోష్ట్రఖరాన్నరాన్। గజాదీశ్చమృగాన్సర్వాన్ హత్వా చాష్టశతంజపేత్। జపేదష్టసహస్రంతు క్షత్రవిట్ గోవధేపునః॥ శివాగ్నిగురుపూజాశ్చ యోగీంద్ర ద్విజభోజనమ్। హత్వాశూద్రం స్త్రీయం బాలం శివంపంచ శతంజపేత్। జపేదష్ట సహస్రంతు సచ్ఛూద్రస్య నిపాతనే।

వ్యా॥ ఇతిగృహస్థానాం శివధర్మోక్తేన ప్రాయశ్చిత్తవిధానాదేతచ్ఛతుర్గుణం సన్యాసి నామజ్ఞాన కృతాఘస్య ప్రాయశ్చిత్తంభవతి॥

శ్లో॥ జ్ఞానాజ్ఞాన కృతాత్పాపాత్సర్వస్మాన్ముచ్యతేయతిః। శివధ్యానాచ్ఛివార్చాయ శివశబ్దజపేనచ॥

వ్యా॥ జ్ఞానేతి. సకలాఘానాం ప్రాయశ్చిత్తంసాంబమూర్తి ధ్యానాత్త్యేవ అన్నపూర్ణోపనిషది। ఆత్మానం సచ్చిదానంద మనంతబ్రహ్మసువ్రత। అహమస్మీత్యభిధ్యాయేద్ధ్యేయాతీత విముక్తయ ఇతిపైంగల శ్రుతౌ। హృదయంన్నిర్మలంకృత్వా చింతయిత్వాప్య నామయం। అహమేవ సదాసర్వమితిపశ్యేత్పరాం సుఖం। తతః పవిత్రం పరమేశ్వరాఖ్య మద్వైతరూపం విమలాంబరాభం। యదోదకేతోయ మనుప్రవిష్టం త

దాత్మరూపో నిరుపాధిసంస్థితః। తపేద్వర్షసహస్రాణి ఏకపాదస్థితోనరః ఏతస్యధ్యానయోగస్య కలానార్హంతి షోడశీం। ఇతి సర్వపాపమోచన ద్వారా మోక్షోపిలభ్యతఇతి। కించాస్మిన్ సాధకఏవ। తీర్థాన్యఖిలానిసంతీత్యాహ దర్శనోప నిషద్వచనేన పింగళేత్యాదినా॥

పింగళాయా ఇడాయాంతు వాయోస్సంక్రమణంతుయత్। తదుత్తరాయణంప్రోక్తం మునేవేదాంతవేదిభిః। ఇడాయా పింగళాయాంతు ప్రాణసంక్రమణంమునే। దక్షిణాయనమిత్యుక్తంపింగళాయా మితిశ్రుతిః। ఇడాపింగళయోస్సంధిం యదప్రాణ సమాగతః। అమావాస్యాతదాప్రోక్తా దేహే దేహ భృతాంవర। మూలాధారం యదాప్రాణః ప్రవిష్టపండితోత్తమః తదాన్య విషువప్రోక్తం తాపసైః తాపసోత్తమః। ప్రాణసంజ్ఞో మునిశ్రేష్ఠ మూర్ధానం ప్రావిశత్యదా। తదంత్యం విషువంప్రోక్తం తాపసైస్తత్వ చింతకైః। శ్వాసోచ్ఛ్వాసనం సర్వేంమాసానాం సంక్రమోభవేత్॥ ఇడయాకుండలీస్థానం యదాప్రాణసమాగతః। సోమగ్రహణమిత్యుక్తం తదాతత్వ విదాంవర। యదా పింగళయాప్రాణః కుండలిస్థానమాగతః। తదాతదాభవేత్సూర్యగ్రహాణం మునిపుంగవ। శ్రీపర్వతం శిరస్థానే కేదారంతు లలాటకే। వారణాసీ మహాప్రాజ్ఞభ్రువోర్ఘ్రాణస్య మధ్యమే। కురుక్షేత్రం కుచస్థానే ప్రయాగం హృత్సరోరుహే। చిదంబరంతు హృన్మధ్యే ఆధారే కమలాలయం। ఆత్మతీర్థం సముత్సృజ్యబహిస్తీర్థానియోవ్రజేత్। కరస్థంసమహారత్నం త్యక్త్వాకాచం విమార్గతే। భావతీర్థం పరంతీర్థం ప్రమాణం సర్వకర్మసు। అన్యధా లింగ్యతేకాంతా అన్యధాలింగ్యతేసుతా। తీర్థాదితోయపూర్ణాని దేవాన్కాష్ఠాది నిర్మితాన్। యోగినోన ప్రపద్యంతే స్వాత్మప్రత్యయకారణాత్। బహిస్తీర్థాత్పరం తీర్థమంతస్తీర్థం మహామునే ఆత్మతీర్థం మహాతీర్థం మన్యతీర్థం నిరర్థకం। చిత్తమంతర్గతందుష్టం తీర్థస్నానైర్నశుధ్యతి। శతశోపిజలైర్ధౌతం సురాభాండ

మివాశుచి। విషువాయనకాలేషు గ్రహణే చాంతరేపవా। వా
రణస్యాదికేస్థానే స్నాత్వా శుద్ధోభవేన్నరః। జ్ఞానయోగ పరా
ణాంతు పాదప్రక్షాళితంజలం । భావశుద్ధ్యర్థమజ్ఞానాం తత్తీర్థం
మునిపుంగవః। తీర్థేదానెజపేయజ్ఞే కాష్ఠేపాషాణకేపివా। శివం
పశ్యంతి మూఢాత్మా శివేదేహే ప్రతిష్ఠతే। అంతస్థంమాం పరి
త్యజ్యబహిస్థం। యస్తుసేవితే। హస్తస్థం పిండముత్సృజ్య బహి
ఖర్పరమాత్మనః॥

వ్యా॥ ఇత్యాదిశ్రుతిభిస్స్వాత్మని శివచింతనేనైవ సర్వపాపక్షయో
మోక్షశ్చభవతి॥ అథవా అథాస్యయా సహాజాస్తి విద్యామూలప్రకృ
తిర్మాయాలోహిత శుక్లకృష్ణాతయాయుతోదేవః కృష్ణపింగళా మహే
శ్వరాఈష్టే। తదిదమస్య సకల నిష్కలరూపం ఏవం యస్సతతంధ్యా
యేద్దేవదేవం సనాతనం। సముక్తస్సర్వపాపేభ్యో నిశ్శ్రేయసమవాప్ను
యాత్। ఇతిశ్రుత్వా సాంబమూర్త్యాఖ్యం సకల నిష్కలం బ్రహ్మైవ
ధ్యాతుముముక్షోరుత్తారణార్థం స్వేచ్ఛయాధృత లీలావిగ్రహంధ్యేయం
భూత్వాసాక్షాత్ కరోతి। ననిరూపాధికమిత్యేత్ పురైవోక్తం॥

అతఏవాహ శ్రీపరాశరః॥

శ్లో॥ యదాగ్నినానయేత్యుక్తే జలత్ కాష్ఠాధృతేస్వయమ్। నాగ్ని
రానీయతే తద్వద్ధ్యేయేమూర్త్యాత్మనాశివః। శివధ్యానానలేనైవ
పాపసంఘాతకాననమ్। క్షణాదగ్ధం భవేత్సర్వం ధ్యానంతద్వ్యక
సిధ్యతి। బహవః ఖలురుద్రస్య ధ్యానేన బ్రహ్మవిత్తమ। అనా
యాసేన సంసారాద్విముక్తా భవబంధనాత్ । కింపునః పాపసం
ఘాత విమోక్ష శంకరస్యతు। ధ్యానేనజాయతే తస్మాద్ధ్యానవే
పసదాభ్యసేదితి॥

నామజపతో నిష్కృతిమాహ.

శ్లో॥ ఏవంశివధ్యాన నామకీర్తనా హైర్నమహత్తరమ్ । పాపంనాశయి
తుం శక్తోత్యేవవేదగురుప్రియః॥

వ్యా॥ అపివా పతితశ్చాండాలో యశ్శివేతివాచం వదేత్। తేన సహ భుంజీత తేనసహ సంభాషేత। తేనసహసహసం వసతేతి। పాద్మే॥ ఆశ్చర్యేవాభయే శోకేక్షుతేవా మమనామయః। వ్యాజేనాపిస్మరేద్య స్తు సయాతి పరమాంగతిం। అన్యానియాని కర్మాణి కరోతన కరోతువా। శివనామజపేద్యస్తు ముచ్యతే సర్వపాతకైః। అవ్యక్తం పరమం బ్రహ్మశివ ఇత్యక్షరద్వయం। నైతస్మాదపరం కించిత్తారకం బ్రహ్మసర్వథా। ప్రమాదేనాపియైరుక్తం శివఇత్యక్షరద్వయం। శోచంతీతే పరం దీనా దుర్భగాస్తుదినేదినేఇతి। జప్యేనైవతు సంసిద్ధ్యేత్ బ్రాహ్మణోనాత్రసంశయః। కుర్యాదన్యం నవాకుర్యాత్ మైత్రోబ్రాహ్మణఉచ్యతే। ఇతిస్మృతిః. అపిచ। శివేనవచసాత్వాగిరి శాచ్ఛావదామసి। యథానస్సర్వమిజ్జగద యక్ష్మగ్ంసుమనాఅసదితి। స్తుహిశ్రుతం గర్తసదం యువానమితి। కద్రుదాయప్రచేతసే। మహేవచో దేవాయశస్యతే। తదిథ్యస్యవర్ధనమితి। కధ్యం కపింకల్పకం మరూపంస్తుష్టువాంసోమృతత్వం భజంతే। తస్యనామమహద్యశః। ఇత్యాదిశ్రుతిభిః నామకీర్తనా దేవ సకలదురితక్షయద్వారా మృతావాప్తిశ్శ్రూయతే। అథాపి కలుషణామిథ్యక్ ప్రాయశ్చిత్తే ప్రత్యయాభావాత్ క్రియారూపమపి నిష్కృతిమాహాభిక్షేతి॥

మూలశ్లోకాః॥ భిక్షోస్స్నాన జపధ్యాన సంధ్యో అసక్తేశ్వరార్చనే। మౌనప్రస్థలనేన్యత్ర ప్రాణాయామత్రయంచరేత్। శ్వపండ కాకచండాల పాషండ పతితాదిభిః। దూషితం తానమశ్చాస్తు యతిశ్చాంద్రాయణం చరేత్। పూయశోణిత మాంసైస్తూస్పృష్టంమూత్ర పురీషయోః। శ్లేష్మాశ్రుకేశ స్పృష్టంచయతిః పాత్రం విసర్జయేత్। ఆఖుజంబూక మార్జారకాకోష్ట్రగ్రామసూకరాః। భాసవాసరవారస్త్రీ నరాస్థిగ్రామకుక్కుటాః। నకులంమధ్యభాండంచ యూపకాష్టం విధర్మిణం। అపవిద్ధమసన్మార్గం చితికాష్ఠంచితింతథా। అమేధ్యనిచయంషండం స్పృష్ట్వాదేవలకంతథా। నీలవస్త్రంచాభరణం నారీణాం కంచుకీం తథా।

స్నాత్వాద్వాదశసంయుచ్ఛేత్ ప్రాణాయామాన్విశుద్ధయే। ఉపానహావినాభిక్షుః కృత్వాభిక్షాటనాదికమ్। మార్గేమూత్రాదిసంకీర్ణే సమ్యక్ స్నానేన శుధ్యతి। అశక్తః ప్రాణరక్షార్థం పునర్మూల ఫలాదికం। భక్షయేన్నైవదూష్యేతప్రాణాయామత్రికమాత్రతః। మక్షికాకీట మశకయూకానాస్తిక జంతుషు। నిహతేషూయతిః ప్రాణాయామాన్ షోడశదాచరేత్। సువర్ణం రజతంతామ్రం తైజసంయచ్చకించన। స్పృష్ట్వాపరిహార్యక్ శూద్రంచసచేలస్నాన మాచరేత్। కౌయికేదశ కుర్వీతవాచికే వింశతింతథా। మానసేతు శతంచాపి పాతకే ప్రాణసంయమాః। ఉక్తానుక్తాఘ సంఘాత సంభవేపివివేకినః। స్నానంధ్యానం జపః పూజా నిష్కృతిః పరమామతా। ఆగ్నేయం మానసం దివ్యం వాయవ్యం వారుణంతథా। స్నానంపంచ విధంప్రోక్తం మునిభిర్బ్రహ్మవాదిభిః। ఆగ్నేయం భస్మనాస్నానం మానసం తత్త్వచింతనం। వాయవ్యం గోరజస్నాన మవగాహంతు వారుణం। సాంతపేనైవ వర్షేణ స్నానందివ్య ముదాహృతం॥

వ్యా॥ ఇతిస్నానపంచకేషు మానసాగ్నేయయోరేవ ప్రాధాన్యాత్తాభ్యా మన్యతరేణ స్నానేన పంచాక్షరీ ప్రణవశివనామ భిర్వానిష్కృద్భవేత్యర్థః॥ శ్రద్ధాభక్తివిశ్వాసయుక్త మన్యదపి తద్దైవభవతీత్యాహ ప్రాయశ్చిత్తేష్విత్యాదినా॥

శ్లో॥ ప్రాయశ్చిత్తేషు సర్వేషు ప్రాయశ్చిత్తప్రసాదతః॥ గురోర్భక్తిశ్శివేభక్తిస్తద్ధ్యానం తజ్జపోవ్రతమ్।

వ్యా॥ సర్వకర్మసుసత్య శుద్ధిరేవ హిపూర్ణఫలదమ్। అతః చిత్తస్యప్రాయః ప్రసాదతః గురుభక్తి శివభక్తి తయోర్ధ్యానం తన్నామజపః। తద్వ్రతం సోమవార శివరాత్ర్యాది దినేషూపవాస పూజనాదినియమః సమంత్రకం సర్వకర్మసు భస్మధారణం వాతదంగరుద్రాక్ష ధారణంచ ప్రాయశ్చిత్తం భవేదిత్యర్థః। వాసిష్ఠలైంగే॥

శ్లో॥ యదిప్రస్ఖలితం భిక్షోరింద్రియం బుద్ధిపూర్వకం। లక్షమేకం జపేత్తారం ముచ్యతే ఘూర్ఛి ఘాగ్రతః॥

శ్రీపరాశరమునిః.

శ్లో॥ ద్విజస్త్రీగమనేభిక్షూ రవకీర్ణవ్రతంచరేత్। కుయోనిషు తధా గత్వా రేతస్తోయే విసృజ్యచ। కుచ్ఛ్రింసంతపనం కుర్యాత్తత్పాపవినివృత్తయే। అప్యమైధున శుద్ధ్యర్థంచరే చాంద్రాయణ త్రయం। భావమైధున శుద్ధ్యర్థం తధాకుర్యాద్విజోత్తమ। సర్వ పాపవిశుద్ధ్యర్థం ధ్యాయేద్దేవంత్రయం బికం। సాంబంచంద్ర కలాచూడం నీలగ్రీవం శుచిస్మితం। బ్రాహ్మేయామే మహా హార్థంవా హృదయాంభోజమధ్యమే జపేత్పంచాక్షరీం విద్యాం ప్రణవేన సమన్వితాం విష్ణ్వాదిదేవతాధ్యాన మపిపాప వినాశనం। శివధ్యాన సమంధ్యాన నాస్తినాస్తి శ్రుతౌస్మృతౌ। తదేవ సర్వపాపానాం ప్రాయశ్చిత్త మనుత్తమమితి॥

స్వప్నేస్త్రీసంగ తస్నాత్వా త్రిసహస్రం జపేన్మనుం। రాత్రిశేషే యదిస్వప్నే రేతోమూత్రిచ్యుతౌ పునః। స్నానంకృత్వా విశుద్ధ్యై తద్వాదశ ప్రాణసంతుమైః। స్కన్నేజ్ఞాతేపి సుప్తశ్చేద్దివా స్కన్నేవితేజసి। యదుక్తం నిశితస్యాపి ద్విగుణం తద్విధీయతే। కండూయ నక్షరణ యోశ్చ్యవనే నాపిచింతయా। స్నాత్వాస చేలంత్రి దపముపోష్యైవ విశుద్ధ్యతి। సంన్యాసిక్రమణే భిక్షూః। ప్రాయశ్చిత్తం సమాచరేత్। ప్రణవంత్రి సహస్రంవా ప్రాణాయామాం స్తుషోడశ। సామర్ధేశిబికాంమంచం గజంతురగమేవ వా। శకటం వారథంవాపి సమారుహ్యాచ కామతః। వ్రతంసం తపనంకుర్యాత్ ప్రాణాయామశతాన్వితమితి॥

మార్కండేయః.

శ్లో॥ మంత్రోచ్చారంతుయః కృత్వాప్య కృత్వాశౌచ మాత్మనః। మోహాద్భుక్త్వా త్రిరాత్రం సగవ్యం పీత్వా విశుద్ధ్యతి। వ్రతాన్యేతానిభిక్షూనాం తథైవోపవ్రతానిచ। ఏకైకాతిక్రమే తేషాం కృచ్ఛ్రిం సాంతపనంత్వితి॥

ఆదిత్యపురాణే.

శ్లో॥ ఏకాసనేచోపవిశ్య గురుణా సహమూఢధీః। ప్రాయశ్చిత్తంన
తస్యాస్తి పాపంగురుతరంహితత్। యాశుద్ధిర్గోవధేప్రోక్తా గు
రుతగ్రి న్యతస్యసా। ప్రోక్తదత్తస్య ప్రదానేన బ్రహ్మహత్యా
సమంభవేత్। స్థూలానియాని పాపాని సూక్ష్మాణి వివిధానిచ॥
తానిశాంతయతిక్షిప్రం ముహూర్తం శివచింతనం। జపధ్యానా త్త
ధాజ్ఞానన్నాన్యత్పాప విశోధనం। తస్మాద్యథా తథాకుర్యాద్యతి
ర్శుద్ధ్యర్థమాత్మనః। ఉపపాతకినోభిక్షో లఘ్వాహారో జప స్తపః।
మౌనంకాకాలత్రయే స్నానంవిహితాని విశేషతః। అవశేకృతచి
త్తానాం కృచ్ఛ్రంచాంద్రాయణాదికం। పశినాధ్యానమేవైకం
ప్రాయశ్చిత్తం విశిష్యతే। ఇతితత్త్రైవాన్యత్రసర్వపాప నోదా
ర్థం ప్రాయశ్చిత్తమిదంమునే। సమాహితోజలే మగ్నశ్శివం
ధ్యాయన్ప్రసన్నధీః। అష్టకృత్వోహర ఇతిజప్త్వా తేభ్యోవిము
చ్యత ఇతి॥

మనుస్మృతివచనమ్.

శ్లో॥ జప్త్వైకర్వశిరోయస్తు బ్రహ్మహత్యావ్యపోహతి। అహింసయా
చభూతానాం జపయజ్ఞోఘనిష్కృతిః। జపస్తు సర్వధర్మేభ్యః
పరమోధర్మఉచ్యత ఇతి॥

సూతసంహితాయాం.

శ్లో। మహాదేవేతి యోబ్రూయాత్ ప్రీతస్తస్త్రాయ పావనం। జ
న్మాంతర సహస్రైశ్చ కృతంపాపం వినశ్యతి। బ్రాహ్మేమూహ
ర్త ఉత్థాయశుచిర్భూత్వా సమాహితః। శివేతికీర్తయన్ సర్వై
ర్ముచ్యతే పాతకైరితి। రహస్యానాంతు సన్యాసః ప్రాయశ్చిత్తం
తథైవసాం। ప్రసిద్ధానాంచ పాపానాం ప్రాయశ్చిత్తమిదం
తథా। శివధ్యానం శివజ్ఞానం శివశ్శబ్దజప స్తథా। అగ్నిరిత్యాది
భిర్మంత్రైర్భస్మ నైవావకుంఠనమ్। రుద్రాక్షధారణం భక్త్యా

త్రిపుండ్రస్యచధారణం సన్న్యాసశ్చైవ పాపానాంప్రాయశ్చిత్తం మహత్తరం॥

యతిధర్మప్రబోధిని గ్రంథాంతర గ్రంథము నం3 పే॥ ౧౦౦.

ఈప్రమాణవచనముల వలన విద్వత్సన్న్యాసులు ప్రారబ్ధవశంబున స్త్రీసాంగత్యమొనర్చినను మానసికమున జేసుకోబడిన ప్రాయశ్చిత్తాదులవలన పరిశుద్ధులై యుండుటకు వీలుకలిగి యుండినప్పుడు పతిత శబ్దము ప్రయోగించి వారియుటకెట్లు వీలగును. ఇట్లునేను జెప్పినప్పుడు సన్న్యాసులగువారు ప్రతినిత్యము స్త్రీసాంగత్య మొనర్చుచు మానసిక ప్రాయశ్చిత్తములొనర్చుకొనుచు యుండవచ్చునుగదా అనియిట్లు తెలివితక్కువ ప్రశ్న గలిగినచో నిందులకు నీక్రిందివిధమున ప్రత్యుత్తర మిచ్చుచున్నాను.

అది యెద్దియనియెదరేని సన్న్యాసులు ప్రారబ్ధవశంబున ప్రమాదాదులచే జేయబడినదానికిని, శ్రీమచ్ఛంకరులువంటి ఘనకార్యసాధనములు సాధించుటకు బూనుకొనినప్పుడును, అట్టికార్యములొనర్చి మానసికప్రాయశ్చిత్తాదులను జేసుకొని అందుచే పూతులై స్వయంతీర్ణః పరాన్తారయతి అను నీన్యాయముచొప్పున పర్యటన మొనర్చుచుండుటగాని ఈదుష్టాష్టకముజెప్పినట్లు అట్టికార్యములు నిత్యకృత్యముగ జరిపినపుడు అయ్యది గృహస్థవిధియగునుగాని సన్న్యాసవిధికాజాలదు.

ఇటులైన వివిదిషాసన్న్యాసులుగాని విద్వత్సన్న్యాసులు గాని వారు గ్రహించియున్న తుర్యాశ్రమమును వదలి గృహస్థాశ్రమమునకు రాజనునా యనువిషయమై జర్చించుట యోగ్యమైయున్నది. కాబట్టియందువిషయమై నీక్రిందిభాగమున చర్చించుచున్నాను.

ఏయాశ్రమమందుండినను జ్ఞానవంతుడు తనజ్ఞానమునుండిచలించుట యెన్నటికిని దటస్థపడదు. అది ఎట్లన్నను ఏటిమధ్య పాతుకొనియుండు బండను ఎంతటి ప్రవాహమొచ్చినను నాబండను కదిలించుటకు యాప్రవాహమునకు శక్తిలేక నాబండకిరుప్రక్కలను యాబండమీదగను అట్టిప్రవాహము ప్రవహించుచుపగది వివిదిషా సన్న్యాసులగు జ్ఞానులు

ప్రారబ్ధవశంబున పలువిధంబుల బ్రవర్తించినను జ్ఞానంబునకు చలనంబు కలుగదు. అట్టిజ్ఞానులు బలువిధంబుగ సంచరించుచున్నారనుటలో బహుప్రమాణంబులుగలవు. వాటిలో గొన్నిటిని యీక్రింద వ్రాయుచున్నాను.

శ్లో॥ కృష్ణోభోగీశుకస్త్యాగీ రాజానౌ జనకరాఘవౌ। వశిష్ఠః కర్మకర్తాచ కర్కటోపిశతాశనః। వేశ్యారతోవామదేవో నసకాద్యాదిగంబరాః। ఏతేషాం జ్ఞానమేకం హిస్వభావస్తు పృథక్ పృథక్॥

అనియిట్లు చెప్పియుండుటయేగాక నీక్రిందవ్రాయునట్టి గొన్నిశృతిప్రమాణములుగూడ గన్పట్టు చున్నవి.

శ్లో॥ వ్యవహారోవాలౌకికోవా శాస్త్రీయో వాన్యథాపివా। మమాకర్తురలేపస్య యథారబ్ధంప్రవర్తతాం। అథవాకృతకృత్యోపి లోకానుగ్రహ కామ్యయా। శాస్త్రీయేణైవ మార్గేణ వర్తేహం మమకాంక్షతిః॥

అవధూతోపనిషత్। మరియువేదాంతపంచదశి తృప్తిదీపకము. ౨౬౭, ౨౬౮, శ్లోకము.

ఇట్లుండినను యెకానొకప్పుడు యట్టి సన్యాసాశ్రమము నందుండుట కిచ్ఛలేక ప్రారబ్ధవశంబునగాని శ్రీమచ్ఛంకరులవలె ఘనకార్యమును సాధించుటకుగాని తన్నిమిత్తమున గృహస్థాశ్రమమునకు రావుటకుగాని అట్టి వివిదిషాసన్యాసులు బ్రయత్నించినపుడు బ్రహ్మసూత్ర భాష్యములోని యీక్రిందిసూత్రము అడ్డుపఱచినను కొందరు గృహస్థాశ్రమమునకువచ్చినట్టును మరికొందరు వచ్చుటకు ప్రయత్నించినట్టును, ప్రస్తుతమందును గృహస్థాశ్రమమునకువచ్చి సంచరించుచుండువారును ఎందరో గలరని యీక్రిందివాక్యములచే దెలియబఱచుచున్నాను.

ఇందులో మొట్ట మొదట గృహస్థాశ్రమమునకు రాకూడదను ఈదుష్టాష్టకము జెప్పబోవు వాక్యమునిచ్చట వ్రాయుచున్నాను.

సూ॥ తద్భూతస్యతు తద్భావో జైమినేరపిని యమాతద్రూపా భా వేభ్యః॥

బ్రహ్మసూత్రము. 3 అ ౪౦ సూత్రము.

అర్థము. ఊర్ధ్వ రేతస్కాశ్రమములు కలవని పరాపర్యాదిరకణ మున స్థాపింప బడినది. ఆయాశ్రమములు బొందినవారికి నందుండి ప్ర చ్యుతికలదా లేదాయని సంశయము పూర్వాశ్రమధర్మములు లెస్స గా నాచరింపవలయునని నభిలాష చేగాని రాగాదివశమునగాని ప్రచ్యుతిక లవని పూర్వపక్షముగాగా ఈసూత్రము ప్రచ్యుతికలుగ జాలదని జెప్పు చున్నది.

అర్థము. తు పూర్వపక్షమయుక్తము తద్భూతస్య ఊర్ధ్వరేత స్కాశ్రమస్థునకు, అతద్భావః। తదాశ్రమప్రచ్యుతి న కలుగదు. నియమా తద్రూపాభావేభ్యః। అట్టిప్రచ్యుతిప్రతిషేధనియమము వలనను ప్రచ్యు తిప్రమాణా భావమువలనను శిష్టాచార రాహిత్యము వలనను కలుగదు. జైమినేఃఅపి। ఈవిషయము జైమిని మహర్షికిన్ని అపిశబ్దనుచేత భ గవంతుడైన బాదరాయణునికిన్ని సమ్మతము.

అనియిట్లు జెప్పిన తద్భూతాధికరణస్థితసూత్రముచే ప్రచ్యుత్య భావ మును మనము తెలుసుకొనినను పూర్వీకులలోను నాధునికులలోను కొందరు తురీయాశ్రమమునకు వచ్చినట్లు అనేకప్రమాణములచే గనుగొ నవచ్చునని ఇంతకు పూర్వమే వ్రాసియున్నాను.

(౧) సన్యాసులు గృహస్థాశ్రమమున ప్రవేశించకూడదని యన ర్థమిచ్చునట్టి తద్భూతాధికరణము మొదలగు ౯౨ అధికరణములుగ ల బ్రహ్మసూత్రములను జెప్పినట్టియు సన్యాసుల గురుపరంపరలో చేరి నట్టియు అయిన వ్యాసులవారు పరోపకారార్థమైన పరేచ్ఛా ప్రారబ్ధ మువలన గృహస్థాశ్రమమున ప్రవేశించిధార్తరాష్ట్ర పాండురాజ వం శములకు మూలపురుషుడై యుండినట్లు భారతమున జెప్పబడి యున్నది.

(౨) గాయత్రీ మంత్రమునకు ఋషియై తన్మంత్రాద్రష్టాత యైన విశ్వామిత్రుడు మేనకనువరించి నామేనకవలన శకుంతల జన్మము

కకు కారణుడైనట్లు మనము భారతాది గ్రంథములవలన దెలుసు కొనుచున్నాము.

(3) శ్లో॥ త్రిదండ కాషాయ కమండలుజ్జ్వలోజ వస్ఫురదంతప టో యుధిష్ఠిరః। ఉపానహందారు మయీం పదాస్పృశనుపాశదత్సం సదిమేధినీశ్వరం॥

చంపూభారతము. ౬ స్తంబకము. ౬ శ్లోకము.

ఈశ్లోకో క్తప్రకారము ధర్మరాజు విరాటునగరమున సన్యాసాశ్రమములోనుండి అటుపిమ్మట గృహస్థాశ్రమమునకు వచ్చినట్లు భారతమువలన దెలియుచున్నది. ఇచ్చట ప్రతిపక్షులుజెప్పునదేమన్నను ధర్మరాజు కృత్రిమవేషధారుడై ప్రవర్తించి తుదకజ్ఞాతవాసము దీరినతోడనే గృహస్థాశ్రమమునకు వచ్చెగాన అట్టిసన్యాసము నిశ్చయమనినమ్ముటకు వీలుండదని ఈలాగుజెప్పినను చెప్పెదరు. ఈయభిప్రాయము సత్సందులకు సహితము దోచినది యగుటవలనే నమ్మజాలను. ఏలయనిన నో సంఘశాస్త్రములయందు కృత్రిమవేషము కొరకొక సన్యాసమనియు, విరక్తికొరకొక సన్యాసమనియు, ఇట్లు సన్యాసము రెండు తెరగులుగ జెప్పియుండలేదు.

ఈశ్లోకమునకు లాస్య అను పేరున యుండు వ్యాఖ్యానమునకు కర్తలగు రామకవీంద్రులు,

అత్రయత్యాశ్రమేః పునర్గార్హస్థ్య యోగ్యత్వాయ త్రిదండసన్యాసస్వీకారః। ఏకదండ సన్యాస ప్రచ్యవనే మహాప్రత్యవాయ స్మరణాత్। అతఏవ రావణార్జునాదీనాం॥

అను నీవ్యాఖ్యానములో సన్యాసాశ్రమమునకు గృహస్థాశ్రమప్రాప్తిచెప్పియున్నది. ఒకవేళ యిది త్రిదండస్వీకారమగు కుటీచకాశ్రమమని జెప్పినచో యీాక్రిందవ్రాయు ప్రమాణవచనములతో నారువిధములైన సన్యాసములు సన్యాసమనియే జెప్పియున్నదిగాని భిన్నముగనుండునట్లు గన్పట్టదు.

శ్లో॥ సన్యాసమడ్విధో౽భవతి। కుటీచక బహూదక హంస పరమహంస తురీయావధూతా ఇతి॥ సన్యాసోపనిషత్.

ఈపై వాక్యములవలన సన్యాసియైనను గృహస్థాశ్రమమునకు వచ్చుటకు వీలుండునట్లు గన్పట్టుచున్నది. గనుక యీవ్యాఖ్యానకర్త ధర్మజునియొక్క సన్యాసము కృత్రిమసన్యాసమని జెప్పక సన్యాసలక్షణమునిజెప్పి అట్టి సన్యాసి గృహస్థాశ్రమమునకు రాదగియున్నాడని చెప్పియున్నారు.

ఒకవేళ ధర్మజుడు కృత్రిమముగ యుండినను యుండవచ్చును గాని వారు ధరించిన సన్యాసముమాత్రము కృత్రిమ సన్యాసముగాదని ముఖ్యముగ దెలుసుకొనుటయైనది. మరియు ప్రతిపక్షులు జెప్పినట్లుకృత్రిమ సన్యాసమైనప్పుడు ధర్మజ్ఞుడగు ధర్మరాజు కాషాయవసనములను ధరించి గాయత్రీజపమెట్లుజేసెను. అట్లు కాషాయంబరమును ధరించి అధర్మము నాచరించుటకు ధర్మజ్ఞుడగు ధర్మజుడెట్లొప్పెను. గృహస్థు కాషాయవస్త్రములను ధరించినచో నగ్నుడనియేకదా జెప్పవలయును. లోకమున నగ్నత్వము సన్యాసులయందున్నదిగాని గృహస్థులయందు లేదు. ఇందులకు బ్రమాణమును జూడుడీ.

శ్లో॥ నగ్నకాషాయ వాసస్స్యా నగ్న కౌపీన కేవలః। నగ్నిసంధిత వస్త్రశ్చ నగ్నో నిర్దశవస్త్రకః। హారీతః। మునిభావబోధిని.
కాషయవసనానియతీనాం నతుగృహిణాం॥

అనగా కాషాయవస్త్రమును గట్టువాడును, కేవల కౌపీనధారియును, కూర్చబడిన వస్త్రముగలవాడును, బద్ధలేని వస్త్రమును ధరించువాడును, వీరు వస్త్రమును గట్టనివారనబడుదురు. అని హారీతుడు జెప్పినట్లు మునిభావబోధినియందు జెప్పబడియున్నది.

ఇందువలన గృహస్థుడైన ధర్మజుడు అధర్మముగా నెట్లు కాషాయవస్త్రమును గట్టి యనుష్ఠానక్రియలొనర్చెను. అనుష్ఠానక్రియలొనర్చలేదని ప్రతిపక్షులనినచో నీశ్లోకమునందు జపేనస్ఫురదంతః। అనునప్పుడు వ్యాఖ్యానకర్త ధర్మశాస్త్రము ఘోషించుచుండ గృహస్థు

నైన ధర్మజుఁడు అధర్మకార్యమెట్లొనర్చును. కాబట్టి సన్యాసమును గ్రహించియే గృహస్థాశ్రమమునకు వచ్చుట కలిగినదని యెన్నవలయును.

(౪) ౧. తదనంతర మహాస్కర......కన్యాంతః పురనివేశయామాస॥

చంపూభారతము. ౩ స్తంబకము. ౬౮ గద్య.

ఈపై వ్రాయబడిన గద్యయందు అర్జునుఁడు సుభద్రాపహరణ సమయమున సన్యాసమును గ్రహించి సుభద్రను హరించి గృహస్థాశ్రమమునకు వచ్చియున్నవాఁడని చెప్పబడియున్నది. ఈసన్యాసము ధర్మజాని సన్యాసమువలె గన్పట్టుచున్నది.

(౫) మరియు రావణుడు సీతను అపహరించు కాలమప్పుడును సన్యాసమును గ్రహించి సీతనుగ్రహించి తుదకు గృహస్థాశ్రమమున ప్రవేశించునట్లు దెలియుచున్నది.

(౬) శ్లో॥ బాఢంజయే యదిపరాజయభాగహంస్యాం। సన్యాసమంగ పరిహృత్య కషాయచేలమ్। శుక్లంవసీయ వసనంద్వయ భారతీయ్యంవాదే జయాజయ ఫలప్రదీపికాస్త॥

విద్యారణ్యశంకరవిజయము. ౬ సర్గ. ౬౨.

వ్యా॥ తత్రఫణంవర్ణయతి। బాఢమితి। దృఢేవ్యస్మజ్జయే యది పరాజయ భాగహంస్యాంతర్హి అంగ్రహే। మండన కషాయవస్త్రం సన్యాసం పరిత్యజ్య శుక్లవస్త్రం వసీయ ఆచ్ఛాదనార్థం వంగీకుర్యాం క్రియమాణేవాదే జయాజయఫలస్య ప్రతిదీపికా ఇయముభయభారతీఅస్తు॥ దిండిమవ్యాఖ్యా॥

గృహస్థాహమపియదివాదే ఫలాయిత సన్యాస్యభవం। సన్యాస్యహామపి యదివాదే ఫలాయితః గృహస్థోభవమితి.

ఆనందగిరి శంకరవిజయము. ౫౬ ప్రకరణము.

ఈపైనవ్రాసిన ప్రమాణములయందు శ్రీమచ్ఛంకరభగవత్పా దులవారు మండనమిశ్రునితో వాదమొనర్చునపుడు నేనోడినచో సన్న్యా సాశ్రమముద్యజించి గృహస్థాశ్రమమునకు వచ్చెదనని వాదఫణంబు ని ర్ణయించుకొని మండనమిశ్రునితో వాదించి యున్న వారలని జెప్పబడి యున్నది. ఇందున మనము గ్రహించతగిన విషయమేమన్నను బ్రహ్మ సూత్రములోని 3 అ ౪౦ సూత్రమునకు సన్న్యాసాశ్రమము నుండి చ్యు తులు కాగూడదని భాష్యము వ్రాసిన శ్రీమచ్ఛంకర భగవత్పాదుల వారు సన్న్యాసమును వదలి గృహస్థాశ్రమమునకు వచ్చెదమని వాదఫణ మునిర్ణయించుకొని వాదించి యుండుటచే గృహస్థాశ్రమమునకు వచ్చు టకు వీలుండినప్పుడు గదా! అట్టి ఫణము యొడ్డుటకు వీలుకలిగినది. అట్టి ఫణమునే కర్మశ్రేష్ఠుడగు మండనమిశ్రుడొప్పుకొనుట తైనది. అట్లుగృహస్థాశ్రమమునకు వచ్చుటకు వీలుగాక యుండిన యెడల మం డనమిశ్రుడా యాక్షేపణమునే గ్రహించి వాదించి యుండును. అట్లుజ రుగకయుండుటచే నాఫణముభయులకు శాస్త్రసమ్మతమైనదనియే మన ము గుర్తెరుగ తగియున్నది. బ్రహ్మసూత్ర భాష్యమున పైసూత్రవిధి ననుసరించి శాస్త్రవిధియుండినను శ్రీమచ్ఛంకర భగవత్పాదులు తేజ స్వులగుటచే లోకత్రయములను నేను వదిలితినని ప్రేషోచ్చారణ మొన ర్చి సన్న్యాసమును గ్రహించి యుండినప్పటికిని మున్ముందు తాముచేయ బోవు లోకోపకారములైన కార్యములకు ఈమార్గముతప్ప మరియొక మార్గము వారికి లేకబోవుటచే శాస్త్రనిషిద్ధమైన కార్యమైనను బాధక ములేదనిదలచి అట్టిఫణము నొప్పుకొని వాదమునకు బూనుకొనిరి.

ఇట్లు మనము మారుమూలల వెదుకనేల యిచ్చటికి సమీపము న నెల్లూరుజిల్లా కొవ్వూరు తాలూకా బుచ్చిరెడ్డిపాళే మను గ్రామ మున బ్రహ్మశ్రీ యడవల్లి రామయ్యయను బ్రాహ్మణులొకరు సన్న్యా సాశ్రమమును గ్రహించి కొన్నివత్సరములు గడపి తుదకు నేదోయొక కారణమున నా సన్న్యాసాశ్రమమును త్యజించి శ్రీమత్పరమహంసేత్యా దిసకల బిరుదావళి విరాజమానులగు పూర్వోత్తర మీమాంసా శాస్త్ర

ములయందసమాన పాండిత్యముగలిగి విరాజిల్లుచుండు చిరుమణి బ్రహ్మానందస్వాముల కృపను గృహస్థాశ్రమమున బ్రవేశించి ప్రస్తుతము భార్యాపుత్రాదులతో కాలయాపనముజేయుచు పంక్తిపావనుడై ఈదుష్టాష్టకముయొక్క అంధకారమడుచుటకు భానుండువలెనే ప్రకాశించుచున్నవారు.

ఇందువలన మనము గుర్తెరుగ తగిన విషయమేమన్నను శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతిగారి విషయమున ప్రయోగించిన పతితశబ్దము శ్రీవారికడనుండుటకు శక్తిలేక పాషండపతిత పాకయాజిని ఆశ్రయించినదనియు, యతులెట్టికార్యము జేసినను నిందితులుగారనియు, ఇట్లు మనము స్పష్టముగ దెలుసుకొనుటయైనది.

ఇదివరలో నీగ్రంధము 56 పేజీలో శ్రీయుత ఊటుకూరి శోభనాచలముగారిచే నూజవీడునుండి 24-6-18 తేదిన ప్రకటింప బడిన "దుష్టాష్టకచరిత్రయను" నొక కరపత్రమున్నదనిచెప్పియుంటిని. అట్టికరపత్రమును మీరు గుర్తెరుగుటకై నాకరపత్రమును మరల నిచ్చుట ముద్రించి ఈవిషయమింతటితో విరమించి మరొక విషయము విమర్శించుటకు యత్నించుచున్నాను.

ఓమ్.

# దుష్టాష్టక చరిత్రము.

---

ఆర్యవర్యులారా!

కొల్లూరునందు 19-5-18 తేదిన జరిగిన గుంటూరు మండల బ్రాహ్మణేతర సభదివసంబున,

1. నైషధం వెంకటేశ్వరులు.
2. నైషధం రామలింగావధానులు.
3. శివపురపు వీరభద్రపాకయాజి.
4. భాగవతుల సూర్యనారాయణ.
5. పోలేపద్ది సూర్యనారాయణ.
6. నైషధం లక్ష్మీనారాయణ.
7. నైషధం వెంకటపూర్ణయ్య.
8. నైషధం రామకృష్ణశాస్త్రి.

ఈదుష్టాష్టకముచే ప్రచురింపబడిన జి. యస్. బి. సరస్వతి పతితచరిత్రయను తుచ్ఛమగు వ్యాసముతోఁగూడిన కరపత్రమును చూచిన వెంటనే సత్యయుగము తిరిగిరాబోవుచున్నట్లు నాకుఁదోఁచి నామిత్రులకు తెలుప కుతూహలుడనై యిప్పతికామూలములను ప్రకటించితిని.

సత్యయుగమందు వేదములను ఈశ్వరుని ధిక్కరించి సాధువులను హింసించి నిరంకుశత్వముగా లోకములను బాధించిన హిరణ్యాక్ష శ్యపాది దనుజులు కశ్యప బ్రహ్మసంతతివారను స్వచ్ఛంద బ్రాహ్మణులు తమస్థానమును యితరులు పొందకుండుటకు వారలు వేదచోదితమైన యోగాభ్యాసాది కృత్యములచే సిద్ధిబడయ ప్రయత్నించు నితరజాతుల సాధువులను హింసించియు చంపియు తుదకు తామేయడగిరి.

పూర్వయుగాంతములయందు అనేకజాతులయందుద్భవించి జితేంద్రియులై తమ తపోమహిమచే బ్రాహ్మణత్వము నొందిన విశ్వామిత్ర, వసిష్ఠ, అగస్త్య, గౌతమ, వ్యాస, వాల్మీకాదుల గోత్రజులగు యీకాలపు బ్రాహ్మణనామావశిష్టులు తమ పూర్వజుల బ్రాహ్మణత్వ సంపాదనయు తమకృత్యమును తెలుసుకొనక రాక్షసులవలెనే నిరంకుశత్వమునను గడగి వేదము, ఉపనిషత్తులు, భాష్యవచనముల నిరసించి తమ నిరంకుశత్వమును స్థాపించుటకు ప్రయత్నించుటను జూడ యిక్కలికి మిగిలియున్న యీనామమునకు కూడా తుదికాలముగా తోఁచుచున్నది. లేనిచో బ్రహ్మశ్రీ మహావిద్వాన్ కూనపులి పూర్ణయ్యశాస్త్రిగారి వాదముపై ఖండనగా స్త్రీశూద్రాధ్యయన విధినిగూర్చి శ్రుతి స్మృతీతిహాసాదిప్రమాణములతో శ్రీమత్పరమహంస స్వామి. జి. యస్. బి., సరస్వతీగారిచే అజ్ఞానతిమిరభాస్కరము సత్యమును వెళ్ళడించి తమ నిరంకుశత్వమును అణగదొక్కినదను ఈర్ష్యచే శ్రీస్వాములవారియందు ఈనామావశిష్టులకు దుష్టాష్టకముచే ఆరోపింపబడిన పతితశబ్దము యీవాదిగువవారియు ప్రమాణములచేతను చెల్లునదికాదు.

ఈపతితశబ్దవిషయమై శ్రీశంకరభగవత్పాదులవారికిని వీరిశిష్యులు పద్మపాదులకు జరిగిన ప్రశ్నోత్తరములవల్లను, సన్యాసోపనిషత్తు, శత

థబ్రాహ్మణము, అవధూతోపనిషత్తు, బ్రహ్మసూత్ర భాష్యము, భగవద్గీత ఇత్యాద్యనేక ప్రమాణముల ననుసరించి యతులను నిందించుటకు గురుధిక్కారము రాక్షసకృత్యమునై యున్నది. యతులెట్టి కార్యములం జేసియు నిందితులుగారని అనేకప్రమాణములు చాటుచున్నవి.

స్త్రీశూద్రాదిక్రియ విధినిగూర్చి శ్రుతి, స్మృతి, ప్రమాణములకు వ్యతిరేకముగా వేద వాక్యోల్లంఘన జేసి మానవకోటిలో తాముపినతక్కిన వారలు జ్ఞానశూన్యులై పశుప్రాయులుగా నుండ గోరుట పూర్వరాక్షస కృత్యములకన్న యెక్కువ క్రూరత్వమని నేను నొక్కి వక్కాణించగలను. ఈ నిరంకుశ యీర్ష్యచే రజస్తమోగుణములు పెంపొంది వజ్రసూచికోపనిషదాదులలో చెప్పబడిన బ్రాహ్మణశబ్దార్థమునే గ్రహించక సంఘసంస్కర్తలగు మహనీయుల యందు దోషారోపణముజేసి భ్రమకొల్పి సంఘనిర్మూలనము చేయుటకు ప్రయత్నించు యాదృష్టుల చరిత్రమెట్లున్నదనిన.

ధర్మరాజు రాజసూయయాగం బొనరించునపుడు శ్రీకృష్ణ భగవానునకు పూజించినందులకు రాక్షసాంశ సంభూతుండగు శిశుపాలుడు శ్రీకృష్ణభగవానుల యందుగల సర్వజ్ఞత్వాది గుణముల యందలి విశేషములను గ్రహించలేక దుర్గుణములుగా భావించి నిందించినట్లు యాదృష్టులు నిరంకుశత్వ పిశాచావేశపరులై మతగురువుల యొక్కయు భాష్యముల యొక్కయు ఉపనిషత్తుల యొక్కయు వచనములను నుల్లంఘించుటజూడ తపోమహిమచే బలమును సంపాదించిన యొకదనుజునితో తక్కిన దుష్టదానవులుచేరి విర్రవీగి తాము మున్నాయుగిన రాక్షసులవలె పూర్వ మెప్పుడో తమ గోత్రజుల వలన సంపాదించబడిన అగ్రస్థానము స్మరించి విర్రవీగుచూ సంఘసంస్కర్తలనిందించి సంఘనిర్మూలనము చేయనడుము కట్టిన యీనామమాత్రపురుషులు శ్రీకృష్ణభగవానుల నిందించి నిర్మూలించ ప్రయత్నించిన శిశుపాల, జరాసంధ, కంసాదులకు పట్టినదియో పాక మహాశయులే యోచించెదరుగాక.

గుణశాలు చెప్పుడునూ మరియొకరి సుగుణములనే గొందురు గాని దుర్గుణములను స్మరించుటకైనను నొల్లరు. జీవన్ముక్తుని అగామి సంచిత ప్రారబ్ధము లెట్లు నశించుననిన ప్రశ్నకు జీవన్ముక్తుని సుగుణసంపత్తిని కొనియాడినవారు సుగుణములను, దుర్గుణములను గొని నిందించువారు దుర్గుణములను పాలుగొనుటచే అవినసించునని అపరోక్షానుభూతియందు చెప్పబడియున్నది గాన శ్రీ స్వాముల వారి పూర్వజన్మ ప్రారబ్ధమేమైన మిగిలియున్నచో దానిని పాలుగొనుటయే గాన సంతోషదాయకమే.

మహనీయులారా !

పూర్వరాక్షసుల బాధలకు శంకింపక కాయకష్టముల కోర్చి నిష్ఠాగరిష్ఠులై అగ్రస్థానమునుబొందిన మహామహులవలె సంఘశ్రేయోభిలాషులైన బ్రాహ్మణేతరులు యిట్టి నామావశిష్టుల దుండగములకు లోనుగాక అపరోక్షానుభూతి వచనానుసారముగా మంచివానిని మాత్రమే గ్రహించి తమగమ్యస్థానమును అలంకరింపచేయుటకు యీశ్వరు నిగూర్చి ప్రార్థించుచున్నాడ.

నూజవీడు, 24–6–18. సంఘశ్రేయోభిలాషి, పూటుకూరి శోభనాచలము.

అశ్రుత్యధర్మ సంజీవన్యధిపతి పదవి పంరాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను గ్రంథములోని మతసభలను శీర్షికతోనుండు విషయమున తమపాండిత్య ప్రకర్షణమంతయు వెల్లడిజేసుకొనియున్నారు. తాము కూచిపూడినుండి తెల్లవారిగ్రామున యెవ్వరికినిజెప్పక వెల్లటూరిలో నూపిరివిడుచునట్టు పరుగిడిన సంగతి మాత్రము తిండి యెక్కువై తెలివితక్కువగుటచే మరచి వ్రాయక విడుచుటయైనది.

ఈపాషండ పతిత పాకయాజిగారు పరాభవమొందిరని శ్రీవారిచే ప్రకటింప బడిన పాకయాజి పరాభవమను కరపత్రమును, మరియు

మతసభలను నీపత్రికకు ఖండనపత్రికయైన కుమతసభాఖండనమను పత్రికయును, మ. రా. రా. శ్రీ జాస్తి లక్ష్మయ్య మొదలగు వారి సంతకములతో నుండు మతసభలను పత్రికలో ౫౧ వ సంతకముతో యుండునట్టి మ. రా. రా. శ్రీ యలవర్తి రామకృష్ణయ్యచౌదరిగారు పొరబాటువ అట్టి మతసభలను పత్రికయందు సంతకముజేసి తుదకు అట్టి పొరబాటునుగని బెట్టి యదార్థమును బ్రకటించిన చౌదరీవిజ్ఞాపనమను మరియొకపత్రికయును, ఇట్లు యీమూడుపత్రికలను ఈపాషండ పతిత పాకయాజిగారు పరాభవమొందినట్లు దృఢముగ దెలుపుచుండ అట్టి పత్రికలు తమగ్రంథమున ముద్రించుట మానినను తన్నామములైనను జేర్చ్యనక గ్రంథము ప్రథమభాగము సంపూర్ణమైనదని మాత్రము వ్రాసుకొనుటయైనది.

ఇట్టి దొంగబుద్ధిగలవారట. పత్రికాధిపతులట. నక్క ఎక్కడ నాగలోకమెక్కడ. ఇంతియేకాదు వీరు లోకోపకారి మొనన్చువారట! ఇట్టి బిరుదుగద్యములను బొందుటకంటె చండాలస్వర్గమున దలక్రిందు నూగులాడుచున్నాము తమాషా జూడుడని తమాషాజూపి బిరుదును బొందుట నెంతయో శ్రేయోదాయకమని గుర్తెరుగతగియున్నది.

ఇట్టి విషయమంతయు పాఠకమహాశయులెరిగు మీరెల్లరు గుర్తెరుగుటకై అట్టి మూడుపత్రికలలో పాకయాజిపరాభవము కుమతసభాఖండనము అను నీ రెండుపత్రికలనుమాత్ర మిచ్చట ముద్రించుచున్నాను.

శ్రీమ్.

# పాకయాజిపరాభవము.

మహాశయులారా!

శికింద్రాబాదు వాస్తవ్యులు శివపురివు వీరభద్రపాకయాజిగారికిని మాసన్నిధివాసులగు (గాజేపల్లి చంద్రశేఖరరావు యీ మురళి మనోహరరావు వగైరాలకును) కొంతకాలము పత్రికల ద్వారా వాద

ప్రతివాదములు జరిగి తుదకు పరుగిడలేక నాచుట్టూ బలాదూరనుసట్లు దూషణక్రిందను పరిణమించుటయైనది.

అందువలన మేము కల్పించుకొని యాజిగారు ప్రల్లద వాక్యములలో కొన్నిటికి ప్రమాణసహితముగా ప్రత్యుత్తరము యివ్వవలసినదిగా 14–12–17 తేది రిజిష్టరీప్రత్యుత్తరముద్వారా తెలుప దానికి లిఖితరూపమైన ప్రత్యుత్తరమును యివ్వలేకపోయినారు.

అంతట మేము సంచారముచేస్తూ తెనాలితాలూకా కూచిపూడి గ్రామమునకు వచ్చియుండి 1918 సం॥ డిశెంబరునెల 27, 28 తేదులలో క్షత్రకులాదర్శమునుగూర్చి యుపన్యసించుచుండ అల్లరివలన యాజిగారు కార్యమును సాధించవలెనని తలచి శ్రీశంకర మతద్వేషులైన కొల్లూరుబ్రాహ్మణనామధారులతో కలసి కూచిపూడికివచ్చిరి.

అట్టి ఉపన్యాసమధ్యమునను స్త్రీశూద్రాధ్యయన విధినిగూర్చియు గుణకర్మవిభాగమువల్లకాక బ్రహ్మయొక్క ముఖబాహూరు పాదములవలన వర్ణోత్పత్తి యనియు చెప్పుతూ అద్వైతామోదితమైన శ్రీవిద్యారణ్యభాష్యము తమవద్దకలదనియు, స్త్రీ శూద్రాధ్యయనవిధిని కూర్చిన యథేమాం వాచం కల్యాణీ యను శుక్లయజుర్వేదాది అజ్ఞానతిమిరభాస్కరమందు వ్రాయబడిన విషయములకు విద్యారణ్య భాష్యమందు వ్యతిరేకార్థము జూపెదమనియు చెప్పి తుదకు చూపుమని విరోధించుసరికి భాష్యము తమవద్దను లేదని యాజిగారు చెప్పినప్పటికి సభలోనిపలువురు యాతులువతనమునకు పరిహాసింపవిద్యారణ్యులుభాష్యమునే రచియించలేదని చెప్పనాగిరి.

అద్వైతమతావలంబకులును సబుజెడ్జియు బి.ఏ. బి.ఎల్ గారైన వావిళాల వెంకటశివావధానులవారిచే రచియింపబడిన విద్యారణ్య చరిత్రను మేముజూప దానిని పూర్చిపెట్టవలసినదని యాజిగారు కిరాతుని రీతుగా పలికిరి.

యాజిగారు వీరి సహచరులగు కొల్లూరు బ్రాహ్మణనామధారులుగాని బ్రాహ్మణులు కారని నొక్కి వక్కాణింపగలము. ఎందువ

ల్లినసిన విద్యారణ్యులు భాష్యమును వ్రాయలేదనుటయు విద్యారణ్య చరిత్రమును పూద్చ్చమనుటయు కిరాతకార్యములుగదా.

వీరలు వేదాదిప్రమాణములవల్లనుగాక అల్లరివలన తేమప్రతిభ నుచాటి లోకమును భ్రమింపచేయనెంచివచ్చి పరాభవమొందిన విష యమును యెల్లజనులకు తెలియుటకు యీపత్రికాముఖాలమున ప్రకటిం చడమైనది.

మకాం, కూచిపూడి,
29-12-1917.

శ్రీమత్పరమహంస,
స్వామి. జీ. యస్. బి. సరస్వతి.



తెనాలితాలూకా కూచిపూడి,

ఓమ్.

# కుమతసభాఖండనము.

అస్మద్దేశస్థితాంధ్రమహాశయులారా!

ఈగ్రామవాస్తవ్యులును, చౌదరీబిరుదాంకితులును, శ్రీమంతు లును అయిన మహారాజరాజశ్రీ యలపర్తి గోపయ్యవర్మ ఈపురుషో త్తమవర్మనామ్న మమ్మొలనొక యుపన్యాసము వ్రాసి జదువమని అడిగి నప్పుడు మాశక్తికి వక్తవ్యాంశముయొక్క గౌరవమును లేశమాత్రము విచారింపక సాహసముజేసి జయార్ధప్రకాశిక అను పత్రికలో పన్యాస మునువ్రాసి యుపన్యసించుట కొప్పుకున్నవారము.

మరియు 1917 సం॥ డిశంబరునెల 1 తేది కృష్ణాపత్రికయందు మహారాజరాజశ్రీ జగపతివర్మఅనువారు క్షత్రియుల గృహనామములు గల యేదియో ఒక సీసమాలికనుబట్టి ఇదివరలో క్షత్రియకులము నిర్ణ యించి యుండ శ్రీకాళహస్తీ పురనివాసులైన ప్రభువులగు దివాన్ బ హాదూర్ పానుగంటి రామారాయణీ ఎం. ఏ. గార్ల గృహ నామము

అక్షత్రియ గృహనామము యాబట్టికలో నుండకబోవుటచే ఈ రామారాయణింగారు క్షత్రియులమని జెప్పుకొనుటకు దగరని అపత్రికయందు జిత్రించియుండుటవలన మేమా బత్రికజూచినది మొదలు అట్టిఉపన్యాసమువ్రాసి యుపన్యసించదలచియుండ నయ్యది 1917 సం॥ డిశంబరునెల 27 తేది మధ్యాహ్నము వరకు జిత్రణముబూర్తిజేసి ఇపుడు శ్రీ శ్రీ శ్రీ ఈవేణుగోపాలస్వామివారి ఆలయములో ఉపన్యసించుట సంభవించినది.

అని యిట్లు శ్రీస్వాములవారా ఉపన్యాస ప్రారంభమున జెప్పియుండ ఇందులకు వ్యతిరేకముబ్రతిపక్షుల బోత్సాహముచే మ. రా. రా. శ్రీ రావెళ్ళ తిరుపతిరాయుడు, జాష్టి లక్ష్మయ్య, జాష్టి బుచ్చయ్యగొన్ని ఉన్మత్తప్రలాపములు బ్రకటించియున్నారు.

1918 సం॥ జనవరి నెల 4 తేది ఆంధ్రప్రకాశిక 6 పేజీలో ఆర్యనారాయణమూర్తిగారిచే వ్రాయబడిన శ్రీవీరభద్రపాకయాజిఅను వ్యాసమునందు బ్రకటింపబడిన వ్యాసము ననుసరించి వ్యవహారంబున పాకయాజియనియు, శెకిందాబాదు గ్రామమున పాకయ్యయనియు గృహంబున పాకీగారనియు, శ్రీస్వాములవారివలన తిట్లయాజియనియు వ్యవహరింపబడు పాషండచండుడగు శ్రీపాకీగారికిని బూర్వోక్తులగు శ్రీస్వాములవారికిని జరుగుచుండు పత్రికావాదములలో 1917 సం॥ నవంబరు 14 తేది ఈడుపుగల్లు గ్రామమునుండి శ్రీస్వాములవారు శ్రీ పాకీగారికి వ్రాసిన రిజిష్టరీ యుత్తరమునకు బ్రత్యుత్తరమిచ్చుటలో శ్రీపాకీగారు వైదికవిధ్వంసులని దూషించుచు నొకలేఖను బంపియుండిరి.

అందులకు శ్రీస్వాములవారు మాచే వైదిక ధర్మము ఎద్ది. యద్విధమున విధ్వంసమైనదో ఆవిషయము శ్రుతి స్మృతి ప్రమాణ యుక్తముగ గ్రంథముల నామములును అప్రమాణములయొక్క పత్రసంఖ్యా నిర్ణయములతో మూసమురోజులలోగా వ్రాసి బంపుమని 1917 సం॥ డిశంబరునెల 14 తేది కొల్లూరునుంచి వ్రాసి బంపియుండ అందులకు శ్రీపాకీగారు అపండితుడగుటవలన శాస్త్రప్రమాణములేమియువ్రాయుటకు శక్తిలేనివారగుటచే ఏప్రమాణ శ్లోకమైనను వ్రాయక శ్రీస్వా

ములవారిచేతను తదనుయాయులచేతను వ్రాయబడిన బూరోక్తమైన యుత్తరములలోనుండు పద్ధతులకు వ్యతిరేకముగను అజ్ఞానతిమిరభాస్కరగ్రంథములోనుండు బద్ధతులకు వ్యతిరేకముగను కొల్లూరులో శ్రీపాకీగారిచే స్వయముగా జరుపుచుట్టి సభలో బ్రత్యుత్తరమిచ్చుచున్నామని 17-12-17 తేది. గల యుత్తరము వ్రాసియుండిరి.

అట్లు వ్రాయుటచే శ్రీస్వాములవారు శ్రీపాకీగారితో పూరోక్తపద్ధతులకు వ్యతిరేకము వాదించుట కొప్పుకొనరైరి. ఈవిషయము లన్నియుండ శ్రీస్వాములవారు సభకురామని జెప్పిరని జెప్పుటయు బూరోక్తులగు ఈనలుగురు వారెట్లో ఒప్పుకొనిరని వ్రాయుటయు తెలియసిదేదో ఒకపిశాచి యున్నదని జెప్పినదానివలె ఉన్మత్తప్రలాపముల లో యున్మత్త ప్రలాపమైయున్నది.

ఆఉపన్యాసస్థలమునందు శ్రీమచ్ఛంకర మతవిద్వేషులగు కొల్లూరుపుర బ్రాహ్మణనామధారులును అనాహూయము అనగా దూరదేశమునుండి బిలువనిపేరంటమునకు వచ్చినట్లు శ్రీపాకీగారును, బెజవాడ, కొల్లూరు, వెల్లటూరు, క్రాప, వెల్లపాడు, వల్లూరుపాలెం, ఇంటూరు, మండూరు, అన్నవరపులూరు ఈ మొదలగు గ్రామాదులలో యుండు చౌదరీబిరుదాంకితులగు కమ్మవారును, తదితరులును, షుమారు 400 ల పైగనేవచ్చియుండిరి.

అప్పటి ఆఉపన్యాసమధ్యలో అజ్ఞానతిమిరభాస్కర గ్రంథమును గూర్చి బ్రసక్తాప్రసక్తిగ శ్రీస్వాములవారిచే జెప్పబడినప్పుడు శ్రీపాకీగారు ఉప్పునీళ్ళలో చేమనీళ్ళవలె శుక్లయజుర్వేదము 26 అధ్యాయము 2 వ మంత్రమగు యథేమాంవాచం అనునీమంత్రమునకు శ్రీ జీ. యస్. బి. సరస్వతీస్వాములవారు జెప్పిన అర్థమునకంటె స్త్రీశూద్రాదులకు వేదాధికారము లేదను వ్యతిరేకార్థమును జూపించి ఆఅజ్ఞాన తిమిరభాస్కర గ్రంథమును ఖండించెదమని ప్రారంభించి రాజా బెంకాయి పిచ్చుకొండఅనునట్లు ఒకటి జెప్పదలచి మరియొకటి జెప్పుటకు ప్రయత్నపడి శ్రీస్వాములవారు స్త్రీశూద్రాదులకు ఉపనయనవిధిజూపినచో వేదాధ్య

యనవిధినిగూర్చి మేము ఖండన జూపెదమని ఉపక్రమోప సంహారని యమములను వదలి వాదమునకు ప్రారంభించిరి.

ఈవిషయమై శ్రీస్వాములవారుఉపన్యాసవేదికపై నుండుటచేతను మాధ్యస్థరహితమైన సభయగుట చేతను ప్రత్యుత్తరమివ్వరైరి. అటు పై శ్రీస్వాములవారు మొండివానికిమూఁరడే చెయ్యి అనుసామ్యమవలం బించినశ్రీపాకీగారివద్ద వారిప్రస్తాపనవలననే శుక్లయజుర్వేదము యొక్క విద్యారణ్యభాష్యము లేదని గ్రహించి యద్విషయమునుగూర్చి వాదము ఉపక్రమింపబడెనో ఉపసంహారము తద్విషయమందే గావలయునన్నద ను న్యాయమునుబట్టి శ్రీ శూద్రాధ్యయన విధిని గూర్చియే మాటి మాటికి శ్రీపాకీగారిని అడుగజొచ్చిరి. ఇంతియేగాక శ్రీపాకీగారిప్రశ్న అధర్వణవేద విద్యారణ్య భాష్యముయొక్క ఉపోద్ఘాత ప్రకరణమునం దు ఉపనయనవిధికన్న అధ్యయనవిధియే ముందుజెప్పబడి యున్నదా నికి వ్యతిరిక్తమైన ప్రశ్నయైయున్నది.

> ఉపనయనే సంస్కారస్య ఆచార్యకర్తృకత్వేచ సత్రప్యో జన త్వా విశేషేపి పురుషాంతర గతత్వేన ఆచార్యకస్య బహిరంగ త్వాత్ ఏకపురుష నిష్ఠత్వేన అధ్యయనస్య అంతరంగత్వాత్. అంతరంగ బహిరంగయోరంతరంగం బలీయః ఇతితస్యఅధ్యయ నాంగత్వమేవ అంగీకర్తవ్యం॥

అధర్వణవేద విద్యారణ్యభాష్యం. 1 సంపుటం. 12 వ పత్రస్థ.

ఇందు ముఖ్యభావ మేమన్నను అంతరంగ బహిరంగములలో అంతరంగము బలీయమైనట్లు అధ్యయన ఉపనయనములలో అధ్యయన ము బలీయమై యున్నది. అని అధర్వణవేదము విద్యారణ్యభాష్యము 1వ సంపుటము 12వ పేజీయందు జెప్పబడియున్నది. మరియు శృతి యును స్వాధ్యాయో ధ్యేతవ్యః॥ (తై. ఆ. 2. 15.) అని వేదముజదు వుటనుగూర్చియే మనుష్యునికి ముఖ్యవిధిగా జెప్పుచున్నది. ఈప్రమా ణములవలన శ్రీస్వాములవారు వేదాధ్యయనము కొరకే లోకమునందు ఉపనయనము జేయించుటయగుచున్నది. వేదాధ్యయనమువినా ఉపన

ముసము ఏర్పటను వేదమందు ప్రత్యేకముగా విధిజెప్పబడి యుండ లే
ు అని సెలవిచ్చిరి. ఇటులపై శ్రీపాకీగారు అప్పైతే మాబాగా యేదం
్న మమయని వేదస్థులకు గోకంబర్ద న్యాయము సెలవిచ్చి ఉపనయనవి
ననిగూర్చి మసందు స్థాపింపబోయ్యేదరు. ఇట్టి శాస్త్రగోడవ శ్రీపాకీ
గారికి తెలియదని విశ్వామిత్ర ప్రసిద్ధ ప్రయుక్త వక్తృసంతోషవాచక
ముగా ఆహాయని సభ్యులు ఆనంద మొందిరి.

అటుపై శ్రీపాకీగారు ఇంతటితో సంతుష్టినొందక పరమేశ్వరుని
ముఖ బాహూరుపాదములనుండి వర్ణోత్పత్తిసి జెప్పటకు అమరకోశము
ను పారంభించి జిహ్వదనమున జదివిన శ్లోకములు జ్ఞప్తికిదెచ్చుకొను
ను ఉపక్రమించిరి. అంత శ్రీస్వాములవారు స్త్రీ శూద్రాధ్యయనవి
కని విడనాడి రెండవ విషయమును గూర్చి ప్రత్యుత్తరమిచ్చుటకై వె
ట్లట కిచ్చు లేనివారైనను సందర్భోచితమగునట్లు అమరకోశమును వల్ల
వేయుటకంటె మనుస్మృతి ప్రథమాధ్యాయములో 21 వ శ్లోకమందు
వేదములవల్లనే వర్ణోత్పత్తి నిశ్చయించబడియున్నదని,

సర్వేషాంతు సనామాని కర్మాణిచ పృథక్ పృథక్, వేదశబ్దే
భ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చనిర్మమే॥ అని ఈశ్లోకముచే శ్రీస్వాముల
వారు జెప్పినప్పుడు దెలివి దెచ్చుకొని,

శ్లో॥ బ్రాహ్మణోస్య ముఖమాసీత్. అను శ్రుతికి బ్రహ్మముఖ
మువలన బ్రాహ్మణుడుత్పన్నమాయెనని జెప్పటకు బ్రారంభించినతో
డనే ప్రథమ కబళే మక్షికాపాతః॥ అనునట్లు శ్రీస్వాములవారు ఆశ్రుతి
యందుండు ముఖం అను ప్రథమాన్త శబ్దమునకు పంచమ్యర్థము ఎ
ట్లువచ్చినదని ప్రశ్నించ శ్రీపాకీగారికి వ్యాకరణజ్ఞానముముందు శివా
లాడుచుండినను ఈయిదొకింత నావస్థయందు గీర్వాణ వాణీ పరిచయ
ము వ్వ వేదనములు స్ఫురింపకపోవుటచే నిరుత్తరులైరి. ఈయవాంతరక
ను స్థూణానిఖాతన్యాయముగ మరింత బలపరుచుటకు శాంతాకార పురాణ
పక్షిగా తటపటయని పేలునట్లు కాల్చబడిన మనుస్మృతి ప్రథమాధ్యా
యము 31 శ్లోకమైన,

లోకానాంతు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః। బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయత్॥ ఈస్మృతి ప్రమాణముచేతను వైయర్థ్యమును జెప్పుటకు బ్రారంభించిన శ్రీస్వాములవారు మనుస్మృతి 1 అ. 34 వ.

శ్లోకమున అహంప్రజాస్సిసృక్షుస్తు తప స్తప్త్వాసుదుశ్చరం। పతీన్ ప్రజానామసృజం మహర్షీనాదితోదశ. మ 1. అ 34.

ఈస్మృతియందు బ్రహ్మ ప్రజలను సృజించుటకై తాను దుశ్చరమైన తపస్సుజేసి ప్రథమమునందు ప్రజాపతులైన పదుగురుమహర్షులను సృజించినట్లు మనువుజెప్పియున్నాడు. యీప్రజాపతులే సమస్తసృష్టిని జేసిరి. అయితే ప్రస్తుతము బ్రాహ్మణాది వర్ణములవారు 31వ శ్లోకమునందుజెప్పినట్లు బ్రహ్మయొక్క ముఖాదికములనుండి బుట్టిరా లేక తరువాత 34వ శ్లోకమునందు జెప్పినట్లు పదుగురైన మహర్షులగు ప్రజాపతులవల్లబుట్టిరా మరియు మనుజ మనుష్యాది శబ్దములు రెంటియందు జేరిన ప్రజలు బ్రహ్మ పదుగురైన మహర్షులగు ప్రజాపతులు అనువట్టి వీరిరువురివల్లనుగాక మనువువల్ల సృజించినట్లు ఆశబ్దములు రెండును సూచన చేయుచున్నవి. మరికొన్ని పురాణములలో మనుష్యులు మనువువలన బుట్టిరనియే జెప్పబడియున్నది. ఆపురాణములకు విరోధమున శ్రీమద్రామాయణమునందీక్రింది శ్లోకమున,

శ్లో॥ మనుర్మనుష్యాన్ జనయత్ కాశ్యపస్య మహాత్మనః। బ్రాహ్మణాన్ క్షత్రియాన్ వైశ్యాన్ శూద్రాంశ్చ మనుజర్షభ.

కశ్యపునిపత్నియైన మనువనునామె బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులైన సమస్తమనుష్యులను సృజించెననిజెప్పబడియున్నది. అవి ఈప్రకారము అల్లముదినిన భోసినోటి ఆంజనేయులు ఆదినముగంటకు అర్థశేరుబాగాకు బాడుము ముక్కున బొక్కినాడని వర్ణించిరి. ఇట్టిదానికేమి జెప్పెదరని శ్రీస్వాములవారు ప్రశ్నించ దెలియనిదానికి మసిబూసి నేరేడుబండుచేసి పెట్టినట్లు 1917 సం॥ డిశంబరు నెల 31 వతేది ఆంధ్రప్రకాశికయందు మ. రా. రా. శ్రీ అలపాటి వెంకటకృష్ణయ్యాగారిచే ప్రకటింపబడినవిధిని ద్వేషసభగా జేయుట చమత్కారమేగదా.

స్వస్తి శ్రీమత్పరమహంసేత్యాది సకల బిరుదావళీ విరాజమానులగు శ్రీస్వాములవారి స్త్రీ శూద్రాధ్యయన ప్రశ్నను గూర్చి బజారు భాగవతములో గూపాయి పొగడింపులో మహామహోపాధ్యాయులగు పండితులని బిరుదొందిన శ్రీపాకీగారు ప్రత్యుత్తరము యేమియు జెప్పక కొంతకాలము ఉపనయనమును గూర్చియు కొంతకాలము ఇతర విషయములను గూర్చియు కొంతకాలము పరమేశ్వరుని ముఖ బాహూరు పాదములయందు గాక గుణకర్మవిభాగములవల్లనే వర్ణాశ్రమధర్మము లేర్పడినవని ప్రాచీనార్యవైభవము విద్యారణ్యచరిత్ర పురుషసూక్తార్థవివేచనము మొదలగు గ్రంధకర్తలైన జగద్విఖ్యాత పండితులగు మహామహోపాధ్యాయ బిరుదాంకితులగు పరవస్తు వెంకటరంగాచార్యులవారిని, శ్రీయుత వావిలాల వెంకటశివావధానులగారిని, శ్రీయుత ఆత్మకూరి లక్ష్మీనారాయణ దీక్షితులు మొదలగు పండితులను దూషించుటనుగూర్చి కాలము వెళ్ళబుచ్చిరి.

అందుచే మరుదినము 28-12-17 తేదీన బూరోద్దేశ్యప్రశ్న విషయమై సభను జేయుటయు శ్రీస్వాములవారు సభకు వెళ్లుటయు తటస్థించినది. అప్పటికిని పప్పులో కాలు వేయ యత్నించిరి. తుదకు శ్రీస్వాములవారు ఆవిద్యారణ్యభాష్యము జూపమని గట్టిపట్టు బట్టిరి. వైద్యుని యొక్క సంచిమాత్రగాదు ఆసంచిని వొంగిలించి గ్రామాంతరముపోయి జీవికార్థమై అట ఆగుళిక యీగుళిక అనుగదీసియిచ్చి వైద్యము చేసినట్లు శ్రీపాకీగారు శుక్లయజుర్వేదము 26 అధ్యాయము 2 మంత్రమునకు శ్రీస్వాములవారు జెప్పిన అర్థముకంటె వ్యతిరేకార్థమును జూపమని వేయివిధముల అడిగినను మహీధరభాష్యమును జూపుటకు ప్రయత్నించిరి.........................................

అటుపైన శ్రీస్వాములవారు బహుప్రయత్నములు జేయుటచే ఆనాటి సాయంకాలము 4 గంటలప్పటికి శ్రీపాకీగారు మధ్యమధ్య పానీయములెన్ని జేసినను శ్రీస్వాములవారు పట్టినబట్టువదలక అడుగుటచే ఈస్వల్ప ప్రస్తావములో ఇంతయీ కొండవీటిసీమనే త్రాటిచుట్టు జుట్టడ

మునూనిహిమవద్గిరి పర్వతవు మెట్టకొండ మలదిబ్బగా బరిణమించిన చందమున శ్రీపాకీగారు మావద్ద శుక్లయజుర్వేద భాష్యగ్రంథము లేదని జెప్పి అల్లముదినిన ఆంజనేయులవగిది బ్రవర్తించిరి.

అప్పటికి సభికులుగొంత పరిహాసములచే కరతాళధ్వనులు సల్ప శ్రీపాకీగారు తెలివిదెచ్చుకొని గొంత స్వారస్యము జేయుటకై ఆగ్రంథమును విద్యారణ్య స్వాములు రచించ లేదని జెప్పిరి. ఇయ్యది యట్టి స్వారస్యముగా గుదిరినదన రాత్రి చిమ్మచీకటిలో సగము మేలుకొని నడుచువాడు స్తంభనమునకు ఢక్కని దలగొట్టుకొనిన యట్టిస్వారస్యమో అట్టిది గాగుదిరినది.

అంతట శ్రీస్వాములవారు ఆగ్రంథమును శ్రీవిద్యారణ్యులు రచియించి యుండినట్లు బూర్వము శికిందరాబాదు సివిల్ అండు స్మాల్కాజుకోర్టు జడ్జియు, మొదటితరగతి మేజస్ట్రీటుయు, బరంపురం సబార్డినేటు జడ్జియు, శ్రీశంకరమతతత్వవేత్తయునగు వావిలాల వెంకటశివావధానులు బి.ఏ. గారిచే రచింపబడిన విద్యారణ్య చరిత్రయందు చదువుటకు శ్రీస్వాములు బ్రారంభించ శ్రీపాకీగారు పరాభవ మొందితిమని గడుపుమంటచే ఆవిద్యారణ్యచరిత్రను నేలబూడిచిపెట్టుమని జెప్పిరి. ఇదిచూడ ఏమిజేయలేకబోతే వెక్కిరించెనను సామ్యమై పరిణమించుచున్నది.

మూర్ఖుడు కొండమెక్కి కొలిచికొలిచి యెంతుంగుదూరములను గణకుడు పిడికెడుయష్టి యంత్రముచేత కనిపెట్టుడా అన్నట్లు శ్రీపాకీగారి ప్రయత్నము తాటాకు చప్పుళ్ళకు కుందేళ్లుబెదరునను సామ్యమును వీరవలంబించి శ్రీస్వాములవారిని భయపెట్టుటకు బ్రయత్నపడిరే గాని మరొకవిధమున బ్రయత్నబడినట్లగుబడదు. అట్లు బ్రయత్నబడకుండినచో మొదటను శుక్లయజుర్వేదము యొక్క విద్యారణ్య భాష్యమును జూపదుమని సభలో ప్రశ్నించుటకు బ్రయత్నబడి తుదకు జూపలేమనునట్టి ఉన్మత్తులెచ్చటనైన గలరా శ్రీపాకీగారు పాషండ పండులగుటచే వీరికి లింగపురాణము, దొంగపురాణము, రంకుపురాణ

ములు ప్రామాణ్యములైనట్లు గవర్నమెంటువారు బహుపరిశోధనలచే ఆర్జించి నిలవయుంచిన దానశాసనములను బట్టి రచించిన చరిత్రములు ప్రమాణములైయుండుట లేనట్లు తెలియుచున్నది.

ఇట్టిఅభిప్రాయము అవిచారితరమణీయమైన మాటయేగాక అహంకృతిజహంకారమని యెన్నుట యుక్తమైయున్నది. ఏమి యీ చేయుంగిలు విశ్వప్రాశియముచే వీరికి వైదికజ్ఞానమేగాక లౌకికజ్ఞానము మనుష్యజ్ఞానము లేనట్లు వెల్లడియగుచున్నది. వీరికి బూర్వోక్త రీతిజ్ఞానముండినచో శ్రీస్వాములవారికి వ్రాసిన యుత్తరములయందు స్త్రీ శూద్రాదులకు వేదాధికారము యెట్లు సిద్ధించుననియు 40 సం॥ వయస్సున 4 రు బిడ్డలదండ్రికి ఉపనయనాదికర్మ లెట్లాచరించిరని ప్రశ్నించకనే బోదురు.

శ్రీస్వాములవారు శుక్లయజుర్వేదమునకు విద్యారణ్యభాష్యముండినట్లు ఒకగ్రంథముచే బ్రమాణముజూపినట్లు శ్రీపాకీగారును ఆగ్రంథము లేనట్లొక గ్రంథమందైనను బ్రమాణములు జూపక వీరు టకటంకటాటోటుమాటలచే కాలము బుచ్చిరి. ఇందులో ఒకరిద్దరగు కుమతులు శ్రీస్వాములవారే గ్రంథమును జూపుటకు బాధ్యులని జెప్పినట్లు దెలియుచున్నది. ఇదెట్టిన్యాయమో వారికే దెలియవలయును. శ్రీస్వాములవారిక శ్రీపాకీగారు మొదట గ్రంథము జూపెదమని వాదమునకుదిగి తుదకు గ్రంథమునుజూపక అల్లముదినిన ఆంజనేయుల బగది బ్రవర్తించుటకంటె బూర్వము గ్రంథములేదని వీరికి నిశ్చయముగలిగినదే యదార్థమైయుండినచో వాదమునకు దిగునప్పుడు లేనిగ్రంథమునుజూపుమనుట న్యాయమైయుండలేదని తిండితక్కువై తెలివి యక్కువగలవారు జెప్పవలసియుండెను.

అట్లు మొదట జెప్పక మధ్యలో త్రాగ్రిపల్లన్నట్టు రెండుదినములు అసంబంధ ప్రలాపనములు శివాలాడువారలు బలికినట్టు పలికిలోకులెవరైనను బరిహాసించెదరని యన్నక శ్రీస్వాములవారికిని దూరగ్రామమునుండి విచ్చేసిన సభికులకును పనిపాటలువదలివచ్చిన ఆగ్రామస్థు

లకును యెంతయో శ్రమ కలుగజేసి యుందువారే యన్నటికైనను ఆ విద్యారణ్య భాష్యమును జూపించి ఖండన జేయుటకు బాధ్యులై యుందురు.

ఇట్లుగాక అజ్ఞానతిమిరభాస్కర గ్రంధకర్త లెన్నటికిని శుక్లయజుర్వేద విద్యారణ్యభాష్యమును జూపుటకు బాధ్యులై యుండలేదు.

ఇట్టిచింత కలుగజేసుకొనినచో ఆడలేని బోగంచిన్నది మద్దెల మీదబడి ఏడ్చినన్న సామ్యమగుచున్నది. మక్కీకి మక్కీ పక్కీకి పక్కీ గాడ్డైన నన్వితార్థకా పార్థకమూల విరుద్ధార్థక వ్యాకరణ విరుద్ధార్థకేత్యాది సకలబిరుదావళి విభ్రాజమానులగు శ్రీపాకీగారు శ్రీమచ్ఛంకర భగవత్పాదులచే రచింపబడిన శారీరక సూత్రభాష్య గ్రంథాదులవలన అజ్ఞానతిమిరభాస్కర గ్రంధమును ఖండన జేసెదమని జెప్పిరని కొందరు కుమతధ్వాంతులు జెప్పుచున్నట్టు దెలియవచ్చినది.

వీరు పాషండ మండులగుటచే శ్రీమచ్ఛంకర భగవత్పాదుల మతమునకు బద్ధవిరోధులై వైదికవిధ్వంసమును జేయుచున్నారు. ఇట్లుందులెరి, శ్రీభగవత్పాదులవారి గ్రంధములన వీరికి దలనొప్పి యగుట జే సరిపడకు. అట్లగుటచే ఆగ్రంధములనుసరించి ఖండించుట యెట్లుబోసగును. ఇంతియేగాక శ్రీమచ్ఛంకర భగవత్పాదులు ఉపనిషదానుయాయులై సర్వసములై సర్వజ్ఞులైనవారు అట్టివారెచ్చటనైనను స్త్రీశూద్రాధ్యయనము జేయగూడదని జెప్పియుండ లేదని ధృఢముగా జెప్పుచున్నాము.

శ్రీపాకీ గారిపుడు సిద్ధకబచ్చాపాకము, బాలబిభీషికపాకము, గ్రచ్చకాయపాకము, మేడిపండుపాకము ముసిడిపండుపాకము, దృష్టిపిడతపాకము, బీరబీచుపాకము, బెంకాయబొచ్చికపాకము, ఆపెంకుపాకము, ఉడుకుతారుపాకము, నాకాభంగపాకము, ఉప్పినపాకము, తప్పినపాకము, ఇత్యాది పాకగ్రంధములను అనుసరించి ఖండించ వలసినదేగాని ఉద్గ్రంధములగు శ్రీభాష్యగ్రంధాదులను అనుసరించి ఖండించుట వలనుపడదు.

శ్రీస్వాములవారలు పిమ్మట 29-12-17 తేది ఆధారములేని అర్థములేని అధిక ప్రసంగములకు చోటైన ఆసభకు వెళ్లుట నవసరమైయుండుటచే మండూరుగ్రామ వాస్తవ్యులు మ. రా. రా. శ్రీ వాస్నం నాగయ్యగారి అగ్రాసనాధిపత్యముక్రింద బాలకవి వేమూరి వెంకటసుబ్బయ్యచౌదరిగారు పూర్వోక్తమైన జయార్థప్రకాశికను శ్రీస్వాములవారనుజ్ఞచేసంపూర్ణముగా నుపన్యసించుటకు సభికుల ఆహ్వానముపై వెళ్ళసరికి శ్రీపాకీగారు అజ్ఞానతిమిరభాస్కర గ్రంథవిషయమై ఏమేమో వెర్రిమొర్రిపలుకులు తిరిగి బలుకుచుండ మీరు నిన్నటిదివసమే శ్రీస్వాములవారికి ప్రత్యుత్తరముజెప్పలేక దోకముడుచుకొనుటైనది. మరల నేటిదివసము ఆగ్రంథమునుగూర్చి ఖండనజేయుటకు ప్రారంభించెదరేని నేను మేము ఖండించుటకు సంసిద్ధులమైయున్నామని జెప్పినతోడనే ఆ విషయమునుగూర్చియే మరియు మ. రా. రా. శ్రీ మంచినీళ్ళ వీరయ్యగారు బలపరచి ఉపపాదించుటచే సభికులు నామోదించుటవలన శ్రీపాకీగారు గ్రంథమునుకట్టిపెట్టి చెత్తచెదారముచేర్చి గోకంబర్దు ఉపన్యాసముకు లోకాభిరామాయణ విషయమై కొంత ముచ్చటించి విరమించిరి.

అంతలో బాలకవి వేమూరి వెంకటసుబ్బయ్యచౌదరిగారు ఘుణాక్షరన్యాయమున జయార్థప్రకాశికను గూర్చి ఉపన్యసించుచుండ శ్రీపాకీగారు సభయుండుండక పుస్తకములు జంకకొట్టి కార్యతొందరలు విశేషించి యుండుటచే రేపు శేకింద్రాబాదు వెళ్ళెదమని జెప్పి వెళ్ళిరి. బాలకవిగారును రాత్రి 10 గంటలవరకు ఉపన్యసించి నేటితో సభను గింపుజేసితిమనిజెప్పి ఉపన్యాసము విరమించెను.

అటుపిమ్మట సత్యవ్రతాదులను బాలించు మహాబ్రాహ్మణుడగు శ్రీపాకీగారు శేకింద్రాబాదుకు వెళ్లెదమని బూర్వదివసమున జెప్పియుండియు అటువెళ్ళక 30-12-17 తేది వెల్లటూరువచ్చి ఇచ్చట బహిరంగోపన్యాసము జేయక ఆర్యబాలవిద్యాభివర్ధనీసంఘమునందు శ్రీస్వాముల వారిని గూర్చిపూడియుండు జయించితిమని గొన్ని ప్రల్లదములు పేల్చిరి.

మఅన్నగారును, తమ్ముడుగారును, జేసిన గ్రాహ్యములకును బూర్వోక్తమైన సత్యాసత్యములకును విరోధమగునటుల వేరెల్లు భిన్నముగా సంతకము జేసియుండరు.

ఉభయపక్షముల పత్రికలో సంతకము జేసిన నలుగురిలో ఒకరిద్దరు ఇచ్చట జరిగినసత్యమును వెల్లడి జేసెదమని కార్యలోపదకులలోనుండి మార్గమున బోవుచుండు మా రామకృష్ణయ్యగారు అదియేమిటిదోయని విచారించకనే సంతకము జేసియున్నారని ఇప్పత్రిక కొరకై సంతకములు నుజెప్పిన బాలకవిగారితోను కనకమేడల బుచ్చయ్యగారితోను బురుషోత్తమవర్మగారు జెప్పియున్నారు.

ఇంతియేగాక మరియు కొన్ని కరపత్రములలో మొత్తం 52 సంతకములు గనబడుచున్నవి. వానిలోను బూర్వోక్తులగు ఒకరిద్దరు ప్రతిపక్షములలో బూర్వోదాహృతరీత్యా జేరియుండుటచే వీరిద్దరును బోను శేషించినవి 50 సంతకములలో యాలవర్తి రామకృష్ణయ్య సంతకమును బూర్వోక్తరీతిని బురస్కరించుకొని విడిచినయెడల శేషించిన 49 సంతకములకు బ్రహ్మశ్రీ పిశుపాటి సీతారామయ్య మొదలుకొని సుమారు 20 సంతకములు కొల్లూరు బ్రాహ్మణనామధారుల బంధువులగు బ్రాహ్మణులసంతకములై యుండుటచే క్రీస్తువారి ప్రతిపక్షులలో జేరినవారై యుండుటవలన లెక్కగొనదలచినవియై యుండినవి కావు.

మరియు శేషించినటువంటి 29 సంతకములు చౌదరిబిరుదాంకితులగు కమ్మవారివై యున్నవి. ఇదియును బూర్వోక్తరీత్యా సభయందు యంతసత్యముజరిగినదో అంతయు ప్రకటించెదమని బూర్వోక్తులగు ఒకరిద్దరు (ప్రతిపక్షులబో)త్సాహముచే వారియిద్దరు చెప్పి వారమాయకులగుటచే ఈకూచిపూడి సభయందు జరిగిన సత్యవిషయమును వెల్లడిజేసెదమని వారికి బోధించి సాధారణ నియమమునందు దానియందు వారిసంతకములు జేయించి ప్రతిపక్షులు జేరిచిప్పుడు వారిష్టానుసారము ప్రకటించుకొనిరని మేము స్వయముగా గొందరిని విచారించుటచేతను బాలకవిగారికిని కనకమేడల బుచ్చయ్యగారికిని బురుషోత్త

ముఖవర్మగారు చెప్పుటచేతను దెలిసినసంగతు లివిస్పష్టమైయుండుటచే ఆ 29 సంతకములు విచారణీయములై యుండుట వలన అప్రమాణములై యున్నవి.

ఆబకరిద్దరునుగూడా ప్రతిపక్షుల మోసకృత్యముతెలుగక వారి మాయాప్రార్థనలయందు కరుణగలవారై దయామయులగుటచే నిశ్చయాభిప్రాయమును దెలుసుకొనలేక సంతకములుపెట్టిరేగాని వాస్తవమందు వారియుద్దేశ్యమిట్టిదై యుండలేదని మేము దృఢముగా జెప్పుచున్నాము. ఇట్టియభిప్రాయమే నిశ్చయమైయుండినచో బూర్వోక్తులగు సభానాయకుల సంతకములు వారుగ్రహించిప్రకటించియేయుందురు.

అట్లెప్పుడు వారుగ్రహించి ప్రకటించకపోయిరో అన్నియు మిథ్యావచనములై యున్నవని స్పష్టముగా సంగతము బోధయగుచున్నది. అట్టి ఈసంగతి ఇందువల్ల యెల్లరు దెలుసుకొనదగియున్నది.

మరియు మేము ఈఖండనపత్రికయందు కూచిపూడి నివాసులగు బూర్వోక్తులైన సభానాయకుల సంతకములను ఇందున గ్రహించి ప్రకటించని కారణమేమన్నను ఈగ్రామమున మున్ముందు స్థాపింపబోవు వేదపాఠశాలాకార్యసిద్ధికి గ్రామములో నష్టము కలుగవచ్చునని యు మిగత కమ్మవారు దెలియగ ప్రతిపక్షులపత్రికలో సంతకములు బెట్టినప్పుడు మేమును అందుకు వ్యతిరిక్తముగా బెట్టినయెడల గ్రామములో పార్టీలుకలుగుననియు ఈలాటిసంగతులు సంతకములకొరకు వెళ్ళిన చాలకవిగారితోను కనకమేడల బుచ్చయ్యగారితోను బురుషోత్తమవర్మ మొదలగువారు జెప్పుటచే ఈసత్కార్యమునకు మహాత్మ్యము ను చెడగొట్టుకొనుట లోకనీతికి రాజనీతికి వ్యతిరిక్తమైయున్నదను సంగతి మేమునుగుర్తించి ఇందున కూచిపూడివార్ల సంతకమును మాత్రము ప్రకటింపక ప్రకటించియున్నాము.

ఇందుచే ప్రతిపక్షుల సంతకములు నిశ్చయమైనవని యెన్నుటకు వీలులేదు. ఇంతియేగాక శ్రీస్వాములవారు సభయందును వారి ఖనయందును దూవాదము వేదోక్తధర్మమైయుండుటచే గాజేపల్లివారును

ప్రస్తుతమునకు మరికొంతమంది బ్రాహ్మణులును కమ్మవారును నాయుడుసంఘమువారును వెలమలును శిష్యను అవలంబించియున్నారని చెప్పినారు. మరియు ఇందుకు వ్యతిరేకముగా చెప్పువారు కొల్లూరు బ్రాహ్మణ నామధారులును వారివద్ద పండితసంభావనలు గ్రహించుటకు వచ్చువారును తప్ప మరియెవ్వరును వ్యతిరేకము చెప్పువారుండరు అని శ్రీస్వాములవారు చెప్పిన దానికి ప్రతిపక్షులు వ్యతిరేకముగ చెప్పినందుకై ఇంత నీతకు అహోయని ఆశ్చర్యపడవలదా.

ప్రతిపక్షులు చెప్పిన మిగత విషయములన్నిటికిని మహాగజాః పలాయంతే మశకానాంకాగతిః. అను ఆర్యోక్తి నవలంబించి వదలుటయైనది.

కొల్లూరు

౧ సుమ్మిడి సుబ్బయ్య చౌదరి ౨ కోగంటి అప్పయ్య ,, ౩ సుమ్మిడి రామయ్య ,, ౪ సూర్యదేవర సుబ్బయ్య ,, ౫ ఘంటా పున్నయ్య ,, ౬ సూర్యదేవర రామస్వామి ,, ౭ సుమ్మిడి నరసయ్య ,, ౮ సూర్యదేవర నరసయ్య ,, ౯ యలవర్తి వీరభద్రాచార్యులు విశ్వబ్రాహ్మణ ౧౦ పాతకమూరు రామబ్రహ్మం విశ్వబ్రాహ్మణ ౧౧ ముత్తిరెడ్డి కోటయ్య నాయుడు ౧౨ సుమ్మిడి తాతయ్య చౌదరి ౧౩ సుమ్మిడి వీరయ్య ,, ౧౪ కొండవీటి నరసింగభాసు ౧౫ సుమ్మిడి వెంకయ్య చౌదరి ౧౬ గోగినేని రత్తయ్య ,,

కారిప.

౧౭ మంత్రవాది వెంకటసుబ్బయ్య (ఎఫ్. ఏ. విద్యార్థి) బ్రాహ్మణ ౧౮ కాసరనేని మల్లయ్య చౌదరి ౧౯ కుర్రా గోపాలకృష్ణయ్య ,, ౨౦ మాదల నాగయ్య ,, ౨౧ తెలసల తాతయ్య ,, ౨౨ కినక మేడల గోపాలకృష్ణయ్య ,, ౨౩ కినక మేడల బుచ్చయ్య ,, ౨౪ కినక మేడల వెంకటామయ్య ,, ౨౫ కుర్రా సుబ్బయ్య ,, ౨౬ కాసరనేని కృష్ణయ్య ,, ౨౭ లావు సుబ్రమణ్యం ,, ౨౮ కాసరనేని వెంకటరత్నయ్య ,, ౨౯ మాదల రామయ్య ,, ౩౦ గోగినేని బుచ్చయ్య ,,

యల్లపాడు.

౩౧ చిన్నమనేని వెంకయ్య చౌదరి ౩౨ చిన్నమనేని వీరరాఘవయ్య ,,

మండూరు.

౩౩ మామిళ్ళపల్లి పుండయ్యగారు (బ్రాహ్మణ) ౩౪ యడ్లపల్లి వెంకటసుబ్బయ్య చౌదరి ౩౫ వెన్నం నందయ్య ,, ౩౬ కూసం రామిరెడ్డి ౩౭ తోటల కృష్ణయ్య

చౌదరి ౩౮ యడ్లపల్లి బసవపున్నయ్య ,, ౩౯ అరిగపూడి నాగయ్య ,, ౪౦ యడ్లపల్లి వెంకయ్య ,, ౪౧ కంతేటి వెంకయ్య ,, ౪౨ నాగళ్ళ గోపయ్య ,, ౪౩ వెన్నం కొండయ్య ,, ౪౪ యడపల్లి నాగయ్య ,, ౪౫ యడ్లపల్లి వెంకటప్పయ్య ,, ౪౬ యడ్లపల్లి కోటయ్య ,, ౪౭ వెన్నం ఆవయ్య ,, ౪౮ దోమకుంట వెంకటప్పయ్య ,, ౪౯ వుయ్యూరు రామిరెడ్డి ౫౦ కంతేటి వీరయ్య చౌదరి ౫౧ వెన్నం నాగయ్య ,, ౫౨ వెన్నం చలమయ్య ,, ౫౩ చిత్రాల సుబ్బయ్య ,,

## వెల్లటూరు.

౫౪ బాలకవి గాడేపల్లి మురళీమనోహరరామశర్మ బ్రాహ్మణ ౫౫ పమిడిముక్కల రామకృష్ణయ్య చౌదరి ౫౬ మోటూరు అంకినీడు ,, ౫౭ పమిడిముక్కల రామదాసు ,, ౫౮ పసుమూరు కోటయ్య ,, ౫౯ మోటూరు పిచ్చయ్య ,, ౬౦ పమిడిముక్కల సుబ్బయ్య ,, ౬౧ మోటూరు వెంకటరత్నయ్య ,, ౬౨ పమిడిముక్కల లక్ష్మయ్య ,, ౬౩ పమిడిముక్కల అంకినీడు ,, ౬౪ పిన్నమనేని అప్పయ్య ,, ౬౫ పమిడిముక్కల సు. కు. అంకినీడు ,, ౬౬ కొల్లి పిచ్చయ్య ,, ౬౭ మోటూరు వెంకట్రామయ్య ,, ౫౮ పమిడిముక్కల కోటయ్య ,, ౫౯ మోటూరు కట్టయ్య ,, ౭౦ పమిడిముక్కల అక్కయ్య ,, ౭౧ మోటూరు అచ్చయ్య ,, ౭౨ మోటూరు అప్పయ్య ౭౩ మోటూరు రామయ్య ,, ౭౪ కొల్లి రామస్వామి ,, ౭౫ పమిడిముక్కల వెంకటసుబ్బయ్య ,, ౭౬ మోటూరు నాగభూషణం ,, ౭౭ మోటూరు రత్తయ్య ,, ౭౮ మోటూరు చెంపయ్య ,, ౭౯ పమిడిముక్కల కృష్ణయ్య ,, ౮౦ పమిడిముక్కల అచ్చయ్య ,, ౮౧ పమిడిముక్కల కట్టయ్య ఉరఫ్ బూదయ్య చౌదరి ,, ౮౨ కాట్రగడ్డ కోటయ్య ,, ౮౩ పమిడిముక్కల లక్ష్మయ్య ,, ౮౪ పమిడిముక్కల కృష్ణయ్య ,, ౮౫ పమిడిముక్కల పిచ్చయ్య ,, ౮౬ కొల్లి రామకృష్ణయ్య ,,

## ఇంటూరు.

౮౭ కాట్రగడ్డ రామచంద్రయ్య చౌదరి ౮౮ నాగళ్ళ కోటయ్య ,, ౮౯ మున్నంగి సుబ్బారెడ్డి ౯౦ కాట్రగడ్డ లక్ష్మీనారాయణ చౌదరి ౯౧ నాగళ్ళ రాజగోపాలం ,, ౯౨ వెలగంట్ల సీతయ్య చౌదరి సంస్కృత విద్యార్థి ౯౩ దావులూరి చినరంగయ్య సంస్కృత విద్యార్థి ౯౪ పుట్టమూరి వెంకటసుబ్బయ్య చౌదరి ౯౫ దావులూరి రాఘవయ్య చౌదరి సంస్కృత పాఠశాలా ప్రధాన విద్యార్థి ౯౬ రావెళ్ళ అంజయ్య చౌదరి సంస్కృత విద్యార్థి ౯౭ కాట్రగడ్డ కొండలరాయ చౌదరి మెట్రిక్ విద్యార్థి ౯౮ కాట్రగడ్డ వెంకట్రాయ చౌదరి ౯౯ దావులూరి సుబ్బయ్య చౌదరి సంస్కృత విద్యార్థి ౧౦౦ బాలకవి వేమూరి వెంకటసుబ్బరాయ చౌదరి.

PUBLISHED. BY· *Y. Veerayya Naidu.*

12-1-18

ఇంతియేగాదు చౌదరీవిజ్ఞాపనమును పత్రిక మాత్రము గ్రంథవి స్తరమై యుండుటచే నందలి ముఖ్యాంశములను మాత్రము యిచ్చట వ్రాయుచున్నాము.

# చౌదరీవిజ్ఞాపనము.

స(స్త్రీ)శూద్రమధీయాతాం అను వాక్యమెంత సత్యమో నూహింపుడు. పెక్కు స్త్రీరత్నములు మంత్రములను కొన్ని రచింపగా మాగారి మనుమునకు విశ్వసించిన బ్రహ్మశ్రీ శివపురపు వీరభద్ర పాకయాజిగారును చివుకుల అప్పయ్యశాస్త్రులవారును, బ్రహ్మశ్రీ నైషధం రామకృష్ణయ్యగారును, శూద్రులకు వేదాధ్యయనాధికారము లేదని మనుస్మృతిలో కాలానుసరణమునుబట్టి కల్పించిన శ్లోకములను చదివి జెప్పియుండిరి. వారు నిశ్చయముగా నుపనిషత్తులను చూచియుండనట్టుతోచును (మరియు) ఋషులెవరును శూద్రులకు వేదాధ్యయనోపనయనాధికారములు లేవనిరట. అందునగూర్చి పాకయాజిగారు పాషండస్పర్శలింగినః అనగా వేదబాహ్యులైనవార్లకు పాషండులనిగదా పేరు (ఈ) పాషండుడెట్లు తన ఋషులుజెప్పిన ధర్మములెట్లు విడిచిపెట్టెనో ఈరామకృష్ణయ్యగారు యెద్విధమున శూద్రునివలె వేదబాహ్యులగు పాషండుని తమతరఫున వాదించుటకెట్లు యిష్టపడెనో విచిత్రముగానున్నది. (మరియును) నూత్నశ్లోకమెద్దియైన యుంచినచో పాకయాజిగారి వాదమునకు సరిగా యుండెడిది. అనియిట్లు వ్రాసి బ్రకటించియున్నారు.

ఇందువల్ల నీపాషండ పతిత పాకయాజియే పరాభవ మొందినట్లు ఆబాలగోపాలమునకు దెలియుచుండ నీవు తమ పుస్తకములో నేమేమో వెఱ్ఱి మొఱ్ఱి వ్రాతలు వ్రాతలు వ్రాసినట్లు దెలియుచున్నది.

ఊపిరిబట్టితే బ్రాహ్మణనిందదను నార్యోక్తిననుసరించి యిట్టివ్రాతల వలన ప్రయోజనకారి గాక నుండిన గౌరవముగూడా చెడి అగౌరవమును బొందవలసివచ్చుచున్నదని వ్రాయుటకు నే సిగ్గిలుచున్నాను.

# పండితాభిప్రాయములు.



శివాగ్రహవిరాజి పాషండ పత్రిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథమున వ్రాయబడిన గడబడాధ్యాయమున కంతయు నీక్రింద వ్రాయబడు పండితవాక్యములే సమాధానములై యున్నవి.

చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకా వాయల్పాడు గ్రామములోనున్న పెండ్లియందు జరుగు మర్యాదల విషయమై రెడ్లకును వైశ్యులకును వివాదము జరిగి రెడ్లు క్షత్రియులుగారనియు, వీరు శూద్రులనియు, కాబట్టి వైశ్యులమగు మాకే ముందుమర్యాదలు జరుగ తగియున్నవనియు, ఇట్లు వివాదములు కలుగజేసుకొని రచ్చలకెక్కి తుదకు రెడ్లమీద వైశ్యులు యభియోగమును దెచ్చిరి. అట్టి యభియోగము యీకోర్టులో కొన్నినాళ్లు నాకోర్టులో కొన్నినాళ్లును జరిగి తుదకు చిత్తూరుడిస్ట్రిక్టుకోర్టులో రెడ్లు మొదలగువారు క్షత్రియులనియు, రెండవమర్యాదను పొందుటకు వీరే తగియున్నారనియు, జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము అను నీగ్రంథమునుబట్టియును, మరికొన్ని యితరగ్రంథములను బట్టియును, నేటికి రెండుమూడుమాసములక్రిందట తీర్పుచెప్పుటకలిగినది.

ఈవిషయము శ్రీస్వామి భక్తానందసరస్వతిగారివల్లనున్ను, మ. రా. రా. శ్రీ చింతలపాటి రఘునాథరెడ్డిగారు శ్రీవారిపేర వ్రాసినపత్రమువల్లనున్ను తెలియఁగానైనది

ఇందులో వివాది ప్రతివాదులనుగూర్చి సాధ్యమైనంతలో నీక్రింద వ్రాయుచు మిగతగ్రంథమంతయు మున్ముందు ప్రకటించుచున్నాను.

| వాదులు. | ప్రతివాదులు. |
|---|---|
| ౧ పోతేపల్లి వెంకటరామ శెట్టివగైరా వైశ్యులు. | ౧ చింతలపాటి, నారాయణరెడ్డిగారు |
| | ౨ చింతలపాటి కృష్ణారెడ్డిగారు |
| | 3 చింతలపాటి రఘునాథరెడ్డిగారు |

ఈ ధావా విషయమైన సంగతులన్నియు ముందు ప్రత్యేకముగ విపులముగను రెండుమూడు మాసములలో ప్రకటించుటకు యత్నించు చున్నాడను.

ఇంతియే కాదు, కృష్ణాజిల్లా అవనిగడ్డ తాలూకా అవనిగడ్డలో దేవాలయములో జరుగు మర్యాదలవిషయమై కమ్మవారికిని వైశ్యులకును వివాదముగలిగి రచ్చలకెక్కగా న్యాయస్థానమందు కమ్మవారు మొదలగువారు క్షత్రియులనియును బ్రాహ్మణసన్మానానంతరము రెండవ మర్యాదను కమ్మవారు పొందతగినదనియును కమ్మవారు క్షత్రియులనియు నీప్రకారము దీర్పుచెప్పుటకలిగినదనియును, ఇట్లుగ శ్రీయుత బారిష్టరు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు నుడివియున్నారు.

వెండియు కృష్ణాజిల్లా బెజవాడ సబ్ కోర్టులో దత్తత విషయమై నొక యభియోగము రాబడి కమ్మవారు క్షత్రియులై యుండుట వలన వేదోక్తవిధులచే దత్తహోమము జరిగినపుడే అట్టి దత్తత చెల్లదగి యున్నదనియు ఇందులకన్యథముగ దత్తహోమములు లేక యుండుటచే నీదత్తు చెల్లకూడదని నొక యభియోగము దాఖలు గాబడియున్నది. పర్యవసానము నింకయు దెలియలేదు.

మరియును గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకా, నల్లూరు గ్రామకాపరస్థులగు మ. రా. రా. శ్రీ పుట్టగుంట శ్రీరామచౌదరిగారికి శ్రీమదిత్యాది సకలబిరుదావళి విరాజమానులగు గుదుమెళ్ళ తిరుమల పెరుమాళ్ళాచార్యులుగారు వ్రాసియిచ్చిన పత్రికయందు శ్రీ శ్రీ శ్రీ స్వాములవారిచే రచియింపబడిన గ్రంథములగు జయార్థప్రకాశిక మొదలగు గ్రంధములను కరపత్రములను జూచి వీరు స్వయముగ కమ్మవారికి యజ్ఞోపవీతధారణములు జేసియు నీకమ్మవారికి గాయత్రీ మంత్రోపదేశములుజేసియు, నిట్లు ఆచార్యులవారు ప్రవర్తించుటయేగాక వారియభిప్రాయమును లోకమునకు వెల్లడియగుటకు బూర్వోక్తులకు వ్రాసియిచ్చిన పత్రికను ఇచ్చుటను లిఖించి మీదెందముఖులకు విశద పఱచు చున్నాను.

ఓమ్.

శ్రీమద్వైదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంత ప్రవర్తకులై వేంచేసియుండే శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమల పెరుమాళ్ళాచార్యులవారి అభిప్రాయము.

కమ్మవారు క్షత్రియులని శ్రీమత్పరమహంస స్వామి. జీ. యస్. బి. సరస్వతిగారు ప్రచురించిన గ్రంధరాజములను, కరపత్రములను, గాంచి మాశక్తికొలది విమర్శించితిమి.

శ్రీ శ్రీ శ్రీ స్వాములవారు సక్రమముగాను, సశాస్త్రీయముగాను, అనేక ప్రమాణములనుజూపి యీగ్రంధములను రచించిరని మదీయ ఆశయము.

మరియు నాగ్రంధములను ఎవ్వరును యింతవరకు ఖండనవ్రాసి ఖండించకపోవుటచే శ్రీవారు జూపిన ప్రమాణములు సత్యములై యున్నవని తెల్లమగుచున్నది.

కమ్మసాంఘికుల వివిధాచారములను దిలకించినచో క్షత్రియులనుటకు కిసుమంతయు సందియములేదు. శూద్రాచారములు యీసాంఘికులయందు మందునకైనను గన్పట్టదు.

ఈకమ్మవారిలో మా శిష్యులసంఖ్యాకులు యజ్ఞోపవీతములను ధరించి వేదోక్తకర్మలను ఆచరించుచున్నారు. మేమును వారియాచరణల కొప్పుకొని తదితరులను ప్రోత్సహించుచున్నాము.

10_5_20 తేదీన శ్రీపుట్టగుంట శ్రీరామవర్మగారికి యజ్ఞోపవీతమును మేము స్వహస్తముగావేసి గాయత్రీ మహామంత్రమును ఉపదేశము చేసితిమి.

ఇటులనే మాసాంఘికులకు మీరు గురువులైనందువలన తదితరులగు మాసాంఘికులను ప్రోత్సాహముచేసి గురుస్థానమునకు యశస్సు దెచ్చెదరని వేడుచున్న మ. రా. రా. శ్రీ పుట్టగుంట శ్రీరామవర్మ

గారు ఇట్టి మాయాశయమును దెలుపుమని గోరుటచే వారికియ్యది లి ఖించి యిచ్చితిమి.

ఇయ్యది మదీయాభిప్రాయము.

ముత్తుపల్లి అగ్రహారం,
ప్రస్తుతము కనిగళ్ళవారిపాలెము,
10—5—1920.

శ్రీమదిత్యాది శ్రీమాన్ గుదిమెళ్ళ తిరుమల పెరుమాళ్ళాచార్యులు గారు.

ఇట్టి హేతువులవలన పాషండ పతితపాకయాజిచే వ్రాయబడిన గ్రంథమంతెయు విమర్శించకనే యాగడబిడాధ్యాయమంతయు ఖండిం చుట యైనది.

## గడబిడాధ్యాయ ఖండనము.



ఇంతియేగాదు శ్రీమత్పరమహంస స్వామి. జే. యస్. బి. సర స్వతిగారు జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్న రాజకులనిర్ణయ మను నీగ్రంథములోను 127 పేజీయందు శబ్దరత్నాకరాది గ్రంథము లలో కమ్మవారు మొదలగువారు శూద్రులని జెప్పిన విషయములను ఖండించుకొని యీక్రిందివిధమున బ్రత్యుత్తరమిచ్చియున్నారు.

"ఇందులకు మీరేమి ప్రత్యుత్తరము జెప్పెదరనినచో నీక్రింది విధమున ప్రత్యుత్తరమిచ్చుచున్నాము.

ఈశబ్దరత్నాకరము మొదలగు నిఘంటువులను ధర్మశాస్త్ర విష యములో ప్రధాన గ్రంథముగ నెన్నుకొని కమ్మవారు, కాపువారు, వెలమవారు, రెడ్డివారు, ఈమొదలగువారు శూద్రులని వచించుటకు తగదని వ్రాయుచున్నాము. ఏలయనినచో నీగ్రంథములో (జయార్థ ప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్న రాజకులనిర్ణయము) ర పత్రము ర పంక్తియందు జెప్పియున్న మనుస్మృతిలోని ప్రధమాధ్యాయస్థమగు ౨ంగ శ్లోకమైన శ్లో॥ సర్వేషాంతుసమానాని కర్మాణిచ పృధక్ పృధక్।

వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చనిర్మమే॥ అను నీశ్లోకముచేతను మరియు గొన్ని యితరప్రమాణములచేతను, (శ్లో॥ చాతుర్వర్ణ్యం త్రయోలోకాశ్చత్వారశ్చాశ్రమాః పృథక్। భూతంభవద్భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిధ్యతి॥ మనుస్మృతిః॥ ౧౨ అ. ౯౭ శ్లోకములచేతను) మన మత వర్ణాశ్రమధర్మములను నిర్ణయించవలసి వచ్చినప్పుడు అన్నిటికిమూలప్రమాణమగు వేదప్రమాణములను గ్రహించి వర్ణాశ్రమ ధర్మములను నిర్ణయించుకొన తగియున్నది. ఇట్లు గాక కుటుంబపోషణార్థమై నీవిం గ్రుడవు చంద్రుడగవ అని స్తోత్రపాఠమును వచించు స్వార్థపరులగు వారి వచనములచే ప్రత్యేకముగను వర్ణాశ్రమధర్మములను నిర్ణయించు కొను టగాని లేక అమరకోశము, శబ్దరత్నాకరము అను నీమొదలగు గ్రంథములచే వర్ణాశ్రమధర్మములను నిర్ణయించు కొనుట తగదని ఇంతకు బూర్వమీగ్రంథమున ౫వ పత్రముయొక్క చివర భాగమున వ్రాసియున్నాము.”

అనియిట్లు శ్రీవారు జెప్పియుండే యిందులకేమియు నీయకట వికట విద్వజ్జన వీరభోగ పదవిభ్రాజి పాషండ పతిత పాకయాజిగారు తిండియెక్కువై తెలివితక్కువగ నుండువారగుట వలన బూర్వోక్తములైన విషయములలో నొకదానికైనను ప్రత్యుత్తరమివ్వక నాలుగవతరగతియందు జదువు బాలురపాండిత్యమును వెల్లడిబఱచి తమ ప్రతిభను చాటినారు.

ఇదియునుంగాక జాతివిభాగాదర్శమను నీగ్రంథము ౬౧ పేజీలో “మనదేశమున పలుగడల క్షత్రియజాతివారు కలరు. వారు శాస్త్రములందు జెప్పబడిన యుపనయనాది సంస్కారములు గలిగియుండి క్షత్రియులని వారు జెప్పుకొనుటయు వారిని లోకులు వాడుకొనుటయు సుప్రసిద్ధము” అని యిటుల సవకలెవకవ్రాతలు వ్రాసియున్నారు. ఇందులకేమయ్యమై నేజెప్పవలసదేమన్నను మన దేశములోనుండు క్షత్రియులమని జెప్పుకొనువారును ఈ రెడ్డి కమ్మ వెలమ తెగలలోనుండి యేర్పబడినవారేగాని పురాణప్రసిద్ధమగు క్షత్రియకులమునుండి వచ్చిన వారుగ

గన్పట్టరని శ్రీనిత్యపరమహంస స్వామి. జీ. యస్ బి. సరస్వతిగారిచే రచియింపబడిన ఆంధ్రక్షత్రియుల విమర్శనము గ్రంథమునుండివాకొనుచున్నాను. ఈయాంధ్రక్షత్రియుల విమర్శనము నీగ్రంథము శ్రీయుత జగపతివర్మయనువారు ఆంధ్రులచరిత్ర 1, 2, 3, భాగములనుండి కొన్నివిషయములు గ్రహించి శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారువ్రాసిన యంశములను విమర్శించి గ్రంథమును వ్రాసియున్నారు. ఈగ్రంథమునకు బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు పీఠికను కూడా వ్రాసియున్నారు. శ్రీవారట్టి గ్రంథమును గ్రహించి "ఆంధ్రక్షత్రియుల విమర్శనము" నుపేర నొకగ్రంథమును వ్రాసియున్నారు. అందున నీపాషండ పతిత పాకయాజిగారభిప్రాయము సిద్ధించియుండలేదనివ్రాయుటకు సిగ్గిలుచున్నాను. ఈగ్రంథము కొద్దిరోజులలో ముద్రణము పూర్తియై వెలువడగలదు.

వెండియు జాతివిభాగాదర్శమను నీగ్రంథములో 31 పేజీయందు "తమపత్రికకు ప్రచ్ఛన్న రాజకులనిర్ణయమని నామాంతరము నిడియున్నవారు. ప్రచ్ఛన్నులన గప్పబడినవారని యర్థము. దేనిచే గప్పబడిన వారని యడిగిన బ్రత్యుత్తరమురాదు" అనియిట్లుగ వ్రాసి యున్నారు. క్షత్రియవేషమును వదలి పాండవులగు ధర్మజ భీమార్జున నకుల సహదేవులవలె ప్రచ్ఛన్న వేషముచే కమ్మవారు మొదలగువారు గప్పబడియున్నారని ప్రచ్ఛన్న రాజకుల నిర్ణయమను పత్రిక, జయార్థప్రకాశిక మొదలగు వాటియందుండు బ్రహ్మాండపురాణ మార్కండేయోత్తర పురాణాది గాథలవలన నాబాలగోపాలమునకు దెలియుచుండ ప్రత్యుత్తరములేదని తమకు గలిగిన పాండిత్యాభావమును వెళ్ళడిజేసుకొనుట లజ్జాకరమైయున్నది.

ఇంతియేగాదు పైవిషయమునకు సంబంధించినదే 58 పేజీలో నీపాషండ పతిత పాకయాజిగారు "అప్పుడు శూద్రవృత్తి నవలంబించిన క్షత్రియులుండవచ్చును. వారే వీరనుట కాధారమగు చరిత్ర గ్రంథమును వారు గనబరచియుండలేదు" అనియిట్లు వ్రాసినారు.

ఇందువలన నీపాషాండ పతిత పాకయాజిగారికి చరిత్రములన నేమియో గూడా దెలియనట్టి లోకజ్ఞానముగలవారని బొడగట్టుచున్నది. అట్లుగ దెలియజేయునట్టి చరిత్రములను శాసనములను జయార్ధప్రకాశికలో రెండుమూడు సముల్లాసములయందు విపులముగ జర్చించియుండుటయేగాక 27–4–19 తేదిన బ్రకటింపబడిన ప్రచ్ఛన్న రాజకుల నిర్ణయమను కరపత్రిక తుదను "దీనినంత వినిన పిమ్మట పాఠకమహాశయులు శూద్ర వేషధారులగు క్షత్రియులు కొందరున్నట్లుగ గ్రహింప గలరు. అట్టివారాంధ్రాది దేశములలో స్థిరపడినట్లుండుటంబట్టి వారు వెలమవారు, కమ్మవారు, కాపువారు, రెడ్డివారు, ఈ మొదలగు నామములచే వ్యవహరింపబడినవారుగా ననుమానింప బడుదురు. ఇట్లుకాదనువారట్టివారు మరికొందరున్నారని జెప్పగలరేమో యోచించి జెప్ప గోరెదము" అనియిట్లు శ్రీవారు వ్రాసియుండ నందులకు ప్రత్యుత్తరము జెప్పలేక మరల తమకు ప్రత్యుత్తరము జెప్పలేదని వ్రాయుట సిగ్గు సిగ్గు.

మరియు నీపాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథము 33 పేజీలో,

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులుపనయన సంస్కారములు గలిగియు శూద్రులదిలేకయు సృష్ట్యాదినుండి యిప్పటివరకు తైలధారలవలె నవిచ్ఛిన్నముగా వచ్చుచున్నది."

అనియిట్లు సృష్ట్యాదినుండి బ్రాహ్మణాది సృష్టి తైలధారలవలె నవిచ్ఛిన్నముగా వచ్చుచున్నదని వ్రాసినారు. ఇట్లువ్రాయుట తెలివితక్కువలో దెలివితక్కువయై వ్రాసిరనియే యన్నవలయును. ఏలయనినచో జయార్ధప్రకాశికలోని బ్రహ్మముఖబాహూరు పాదములనుండి వర్ణోత్పత్తియైయుండలేదనియు గుణకర్మలవల్లనే వర్ణోత్పత్తి గలిగినదనియు, అనియిట్లు జెప్పుచుండు ఉపోద్ఘాతప్రకరణముగూర్చి వీరు యేమియు నీజాతివిభాగాదర్శమను నీగ్రంథమున వ్రాసియుండినట్లు గన్పట్టలేదు. వెండియు జయార్ధప్రకాశికలో 46, 47 పేజీలయందు మధ్య

కాలములో క్షత్రియుడై యుండు వీతహవ్యుడు భృగుమహర్షి కృపవల న బ్రాహ్మణత్వమును బొందెనని జెప్పియున్న దానికి నేమియు బ్రత్యుత్తరము జెప్పక బెల్లముగొట్టిన గుండ్రాయివలె కదలక మెదలకనుండి సృష్ట్యాదినుండి తైలధారలవలె బ్రాహ్మణాదిసృష్టి వచ్చుచున్నదని జెప్పుట ఎరుక లేనిమాటలైయున్నది. ఇట్లుజెప్పుట యీక్రింది వాక్యములకు వ్యతిరిక్తములుగ నుండినట్లు గన్పట్టుచున్నది.

శ్లో॥ అబ్రాహ్మణ్యే తదాదేశే కైవర్తాన్ ప్రేక్ష్య భార్గవః। ......యజ్ఞసూత్రమకల్పయత్। స్థాపయిత్వా స్వకీయే సక్షే తేవిప్రాః ప్రకల్పితాః॥ స్కాందపురాణము. సహ్యాద్రిఖండ.

ఇందుల భావమేమన్నను అప్పుడు పరశురాముడా దేశమందు బ్రాహ్మణులు లేక బోగా జెస్తలను (చేపలను బట్టువారిని) రావించి వారికియజ్ఞోపవీతమువేసి వారిని బ్రాహ్మణులనుజేసి తన దేశమందు నిలిపి జామదగ్న్యుడు ప్రహృష్టాంతరంగుడై పలికెనని స్కాంధపురాణములోని సహ్యాద్రిఖండమున జెప్పబడియున్నది. మరియును,

శ్లో॥ న కులేననజాత్యా వా క్రియాభిర్బ్రాహ్మణోభవేత్।
చండాలోపిహివృత్తస్థో బ్రాహ్మణస్సయుధిష్ఠిరః॥

ఇందుల భావమేమనినచో కులముచేతను జాతిచేతను గాక కార్యముల చేతనే బ్రాహ్మణుడగుచున్నాడు. ఓయుధిష్ఠిరా! మంచినడవడికగలవాడు చండాలుడైనను వాడే బ్రాహ్మణుడు.

శ్లో। చిత్రకర్మయథానేకై రంగై రున్మీల్యతేశనై। బ్రాహ్మణ్యమపితద్వద్ధి సంస్కారైర్మంత్ర పూర్వకైః॥

శ్లో॥ జన్మనాజాయతేశూద్రః సంస్కారాత్ ద్విజఉచ్యతే। వేదపాఠేభవేద్విప్రః బ్రహ్మజానాతిబ్రాహ్మణః॥ శంకరదిగ్విజయము.

ఇంతియేకాదు. తైత్తరీయబ్రాహ్మణము. ౧, ౨, ౬, ౭.

శృ॥ దైవ్యోవై వర్ణో బ్రాహ్మణః అసుర్యః శూద్రః॥

అను నీమంత్రమునందు దైవసంపత్తు గుణములుగలవారు బ్రాహ్మణులనియు, అసురసంపత్తు గుణములు గలవారు శూద్రులనియు, ఇ

ట్లు దెలియుటచే గుణకర్మవిభాగమువల్ల వర్ణోత్పత్తి యేర్పడినట్లు దెలియుచున్నదిగాని తైలధారలువలె సృష్ట్యాదినుండి వర్ణోత్పత్తివచ్చుచున్నదని జెప్పుటకు వలనుపడదు.

ఇట్లు పై విషయములు గన్పట్టుచుండ అట్టివిషయములలో దేనికైన నొకదాని బ్రత్యుత్తర మివ్వక దొంగకు తేలుకుట్టినట్లు నటించుచు సృష్ట్యాదినుండి తైలధారలవలె వచ్చుచున్నదని జెప్పుటయే వారి పాండిత్యమును జెల్లడిచేయుచున్నది.

ఇటుపైన చండాలస్వర్గమున దలక్రింద నూగుచుండు పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంధమందు 35 పేజీలో "నకారాంతమగు వర్మశబ్దమున మన...యతుల జాతికి రాగానే వర్మః అని యకారాంతమైన...నకారాంతము లకారాంతములు నగుటలో వింతయేమియున్నది." అనియిట్లు తిండిమెతుక్కై తెలివి తక్కువగుటచే నాక్షేపించియున్నారుగాని జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకుల నిర్ణయము మరియు క్షత్రకులాదర్శమను సిరెండింటిలోనుండు కూర్మాదిశబ్దములను గూర్చి నేమియు నాక్షేపించి వ్రాయకబోవుటచే నాయాభాగములను గొంతవరకు నొప్పుకొన్నట్లు మనమూహింపదగియున్నది.

సూ. నపుంసకమనపుంసకేనైకవచ్చాన్యతరస్యాం॥

అను నీపాణినీసూత్రము నపుంసక శబ్దములు అనపుంసకములనగా స్త్రీలింగ పుంల్లింగములుకూడా గావచ్చునని జెప్పుచున్నది. ఇట్లు నకారాంతము లకారాంతమగుటలో నాశ్చర్యవిషయము గాదుగాని చండాలస్వర్గమున దలక్రింద నూగులాడుచుండుట నాశ్చర్యజనకముగ గన్పట్టుచున్నది.

శ్రుతివిరోధ ధర్మనష్టైక దీక్షాపరతంత్ర ధార్మికానుగ్రహాపరిభ్రాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంధములో 37 పేజీయందు "పామరులకు జడువురాదు కనుక వారూరక వాగ్రూపమున వ్యవహరించుచుందురు. పండితులట్లుగాక తాము

చెప్పదలచినదానిని నొకచరిత్రలో నిమిడ్చి గ్రంథముగా రచించియుంచె దరు" అనియిట్లు వ్రాసియున్నారు. ఇది మంచిమాటయేగాని ఒకా నొకప్పుడు ప్రమాదోధీమతామపి అను నీన్యాయానుసారముగ పండితు లును బొరబడుట గలుగుచున్నది. ఇందులకు దృష్టాంతమేమన్నను నొ కస్థలమున విద్యారణ్యులు శబ్దార్థమును నిర్ణయించుచుండ పొరబడియు న్నారు. అవిషయమయ్యె నిర్ణయసింధు గ్రంథకర్తయగు కమలాకరభ ట్టు నాక్షేపించి నిర్ణయసింధువను గ్రంథమున వ్రాసుకొని యున్నారు జూచుకొనుడి.

అనామర్శ్య పతిత్యక్త (ప్రథానాందో)పాధ్యాయపదవిశ్రుతః భ్రా జి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథము 57 పేజీయందు "వేదములో నున్న కూర్మశబ్దమును నిఘంటువులో నున్న రాట్ వర్మ బలవాన్ అను నీప్రకృతిశబ్దములను గ్రహించి వానికి దేశ్యములగు కమ్మ, రెడ్డి, వెలమ, బలిజశబ్దములు వికృతు (తద్భవ ము) లని వ్రాయసాహసించిరి. అనియిట్లు వ్రాసిన పాషండ కులావ తంసులగు నీపాషండ పతిత పాకయాజిగారి పాండిత్యము మరియు నె చ్చట విదారించకనే తేటతెల్లముగ నింతకముందు గొంత దెలియబడిన ను ఇపుడు స్పష్టముగ కరతలామలకమువలె దెలియబడినది కూర్మశ బ్దము వేదములో నిదియొగాక దేశీయముగాదనియు, రాట్, వర్మ, బలవాన్ అను నీశబ్దములు నిఘంటువులలో నెప్ప వేదములలో నెచ్చట ను జెప్పియుండలేదని ఇట్లిప్పుడు జెప్పటగలిగినదో అప్పుడు యీపా షండ పతిత పాకయాజగారు వేదములను తిరనుగుణ్యముగా రచించబ డిన జయార్థప్రకాశిక మూడవభాగమున ప్రచురిన్న రాజకులనిర్ణయములో 29, 30, 31, ఈ పేజీలలోనుండు విషయములను మరియు 74 మొద లు 14 పేజీవరకునుండు విషయములను నిష్పక్షపాతముగా జూచినట్లుగ స్పడదు. ఒకవేళ నాపుస్తకమును యీలోపనుండి నాకొన్నసరకు జూచిన ను బోధయైయుండినట్లుకూడా గన్పట్టదు.

మరియు వర్మశబ్దమును వలమయుని చెన్నపురిరాజకీయ కళా శాలయందు సంస్కృతోపన్యాసకులుగా నుండి కీర్తిశేషులగు ఎమ్. శే

షగిరిశాస్త్రులుగారు శబ్దశాస్త్రమను గ్రంథమందువ్రాసి యున్నారని య్యు, తదితరశబ్దములుకూడ వైవర్మశబ్దమునుబట్టి తద్భవములై యున్న వన్నియు నిట్లు జయార్థప్రకాశిక 95 పేజీయందు వ్రాసినదానినైనను గన్నెత్తిజూడక నోటికివచ్చినట్లెల్ల వదరుబోతువలె వదరుచు వ్రాసినందులకై వీరిపాండిత్య ప్రకటనము దేటతెల్లముగ దెలియబడినదని చెప్పినమాట సయుక్తికముగ నున్నట్లు గన్పట్టుచున్నది.

సంఘసంస్కార దుర్వాద ప్రచారణ దీక్షాబద్ధకంకణ కరవిరాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథములో 60 పేజీయందు "వీరిబోధకులోనై రెడ్డి, వెలమ, కమ్మ, బలిజ శాఖలవారు వాదముకొరకు క్షత్రియులమైతిమని యనుకొందురను కొందుము. వీరినిజూచి చాకలి మంగలి మాల మాదిగె తురక దూదేకులు క్రైస్తవులును క్షత్రియులమనిన కారనుట కాధారములేదుకదా అప్పుడువారు వీరొకటి కావలసివచ్చునేమో మన...యతులాలోచించినారా" అనియిట్లు వ్రాసియున్నారు.

జ్ఞానకర్మపదభ్రష్టులును, బ్రాహ్మణనామధారులును, వేదాధికారము వేదాధ్యయనాధికారములేని పాషండులును, పతితులును, అపాంక్తేయులును, శూద్రతుల్యులును, అయిన తాము శ్రుతిధర్మసంజీవనిలో గోదావరిపెంటలవరన్ అను నీవ్యాసమున 12, 13 పేజీలయందు తాము బ్రాహ్మణులమనియును, తమకు వేదాధికారము, వేదాధ్యయనాధికారము గలదనియును, ఇట్లు దౌర్జన్యముమీద చెప్పుకొన్నపగది బూర్వోక్తులగు చాకలి మంగలి మొదలగువారు చెప్పుకొనదరనిగదా నీకర్నిప్రాయము. అట్లైనట్టికిని జెప్పుకొనరని నేదలచుచున్నాను. వీరుయనినచో నీపాషండ పతిత పాకయాజిగారు బూర్వోక్తముగ జెప్పుకొన్న దానివలె వీరు దౌర్జన్యమున చెప్పుకొనరు. కారణమేమనియెదరేని ఆపాషండ పతిత పాకయాజిగారు స్వార్థపరులై యున్నారు అంకువలన స్వార్థీదోషం నపశ్యతి. అను నీన్యాయానుసారము చెప్పుకొనుట గలిగినది. లేనిచో బ్రాహ్మణత్వము, వేదాధికారము వేదాధ్యయనాధికారము లేనట్టి తముకవిగలవని చెప్పుకొనుట గలుగునా చా

కలి మంగలి మొదలగువారై తేనో పరార్థపరులు. అందువలన పట్లు జెప్పుకొనుటకు యత్నింపరు. అట్లొకవేళ జెప్పుకొనినను శాస్త్రమొప్పదు. లోకమంతకన్న మున్నె యొప్పదు. కాబట్టి పై ప్రశ్న వేయుటకే యవకాశము లేదు.

# స్మృతివిమర్శన కౌశలము.

సంఘసంస్కార దుర్వాద ప్రచారణ దీక్షాబద్ధ కంకణ విరాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగా దర్శమను నీగ్రంథము 61 పేజీలో "మనశాస్త్రములు నాలుగుజాతులవారికిని బాలురకు నామకరణములు జేయునప్పుడు వారి వ్యవహారనామముల కనుబంధముగా బ్రాహ్మణులు శర్మ, క్షత్రియులు వర్మ, వైశ్యులు గుప్త, శూద్రులు దాసయను నుపనామములను బెట్టుకొనవలయునని శాస్త్రములుపదేశించుచున్నవి." అనియిట్లు జెప్పియున్నారు.

ఈయభిప్రాయమునుబట్టి చూడ వీరికి శాస్త్రజ్ఞానములేనట్లు దెలియుచున్నది. ఏలయనినచో వీరు మనశాస్త్రములనునప్పుడు, సూ. శాస్త్రయోనిత్వాత్॥ అను నీసూత్రమునకు శ్రీమచ్ఛంకర భగవత్పాదులు భాష్యమువ్రాయునప్పుడు శాస్త్రమన వేదమని భాష్యము వ్రాసియున్నారు. అట్టి వేదచతుష్టయములో శూద్రుడు దాసుడనిగాని అట్టి శూద్రుడు సేవకావృత్తిజేయవలయుననిగాని యెచ్చటను విధించియుండలేదు, ఇట్టి వేదచతుష్టయములో నట్టి విషయములు లేకపోయినను స్మృతులలో జెప్పియున్నది గదా ఎందులకు ప్రమాణముగ గ్రహించకూడదనినచో అది మరొండు ప్రశ్న యగునుగాని ఏతద్విషయమై దెలియ జేయునట్టి ప్రశ్నగ నుండలేదు. ఒకవేళ స్మృతుల ననుసరించి జెప్పినప్పుడు నూహాలననుసరించి జెప్పినప్పుడును, మాలవారిలోను మాలదాసులుగలరు. అట్టివారితో వీరికెక్కుడు పరిచయముండుటగాబోలు స్మృతి నిబద్ధమైన దాసశబ్దమునకు నెంతయో కష్టపడి నాలగ

వతరగతి జూచుకొనుట కుపయోగపడునట్టి శబ్దార్థచంద్రికాది నిఘంటువులనుండి యాదాసశబ్దమునకు నుత్కృష్టార్థమును గనబఱచియున్నారు.

ఇందువలన తమ ధర్మశాస్త్రపాండిత్యమును సార్థకపఱచుకొనుటయైనది. ఇకనైనను తమశక్తిని తాము దెలుసుకొని సాంఘిక విషయములో పాలుగొనకయుందురని హెచ్చరించుచున్నాను.

అకట వికట విద్వజ్జన పీఠభోగ పదవిభ్రాజి పామండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథములో 65 పేజీయందు "నరాణాం నాపితోధూర్తః శూద్రేభ్యోప్యధికస్మృతః."...మనుష్యులలో శూద్రులకంటె నాపితుడధికధూర్తుడుగా జెప్పబడుచున్నాడు.

అనియిట్లుగ నీశ్లోకమునకర్థము వ్రాసియున్నారు. ఇట్లుభిన్నముగ నర్థముజెప్పినను భక్షితేపిలశునే నవ్యాధిశాంతిః. అనగా రోగనివర్తి కొరకు వెల్లుల్లిపాయలను భక్షించినను నావ్యాధిమాత్రము నివర్తించక వెల్లుల్లిపాయలను దినిన దోష మొకటి సంభవించుటయేగాక దత్కాలమున ప్రత్యక్షముగ నోటికంపుగొట్టుటమాత్ర మొకటి గలిగియున్నదన్నట్టు దెలియబడుచున్నదిగాని మరొంకవిధమునలేదు.

అదిఎట్లన్నను యిట్టియర్థమును ఏవ్యాఖ్యానమునుండి బైటికి వెడలదీసితిరని ప్రశ్నించితిమేని గుట్టు బైటబెట్టి తాభ్యావారి కవిత్వము గొంత వాక్యముగొంత యున్నట్లు స్వకవిత్వముచే జెప్పబడెనని జెప్పుదురు. ఇట్టి స్వకవిత్వముచే జెప్పుటకు వీరేగాక నందగోనాబాలగోపాలురలోకూడ సమర్థులైనవారు గలరు. కాని వ్యాఖ్యానకర్తలైన వనుకవక స్వయముగజెప్పిన అర్థమునకు వారే ప్రమాణభూతులై యున్నారుగాని తదితరులెవరును ప్రమాణముగ గ్రహించినవారుండరనిదృఢముగ జెప్పుచున్నాను.

ఈశ్లోకమునకర్థము మీకు దెలియుటకై జయార్థప్రకాశిక మూడవభాగము (ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము) అను నీగ్రంథము 119, 120 పేజీలనుండియు, మునిభావబోధిని ద్వితీయభాగమునుండియు వ్రాయబడిన యర్థమును ఈక్రిందవ్రాయుచున్నాను.

"శ్లో॥ నరాణాం నాపితో ధూర్త శ్శూద్రేభ్యోప్యధికస్స్మృతః॥ వృద్ధమనుః. శూద్రకన్యా సముత్పన్నో బ్రాహ్మణేన తు సంస్కృతః। అపరో నాపిత ప్రోక్త శ్శూద్రకర్మాధికోపినః॥ యాజ్ఞవల్క్యేన తు. శూద్ర ఏవ నాపిత ఉక్తః॥ శూద్రేషు దాసగోపాల కులమిత్రార్ధసీరిణః। భోజ్యాన్నా నాపితాశ్చైవేతి। శంఖేన తు ప్రతిలోమజో యమ ఉక్తః। యత్తు సూతసంహితాయా మూర్ధ్వనాపితోధో నాపితశ్చేతి ద్వైవిధ్యముక్తమత ఏవోశనా॥ నాభేరూర్ధ్వం తు వపనం తస్మాన్నాపిత ఉచ్యత ఇతి॥ జాతివివేకే మార్గనాపిత యోర్జాతో యోసౌ సాంఖిల్యసంజ్ఞకః। హీనస్సగుహ్య కేశానాం కుర్యాద్వపనముంజసేతి."

మునిభావబోధిః ద్వితీయ్యభాగము.

ఇందుల భావమేమన్నను "మనుష్యులలో నాపితుడు ధూర్తుడు (అనగా మోసముచేయువాడు) వీడు శూద్రులకన్న నధికుడు శూద్ర కన్యకయందు బ్రాహ్మణునివలనబుట్టె సంస్కృతుడగువాడు మఱియొక నాపితుడని జెప్పబడును. వీడు శూద్రులకన్న కర్మాధికుడని వృద్ధమనువుజెప్పెను. (ఈయభిప్రాయము యింతకు బూర్వమున జెప్పియుండినను ఆయభిప్రాయము విద్యారణ్యవ్యాఖ్యానమున, శ్లో॥ అసంస్కారాత్తునాపితః॥ పరాశరస్మృతికి వ్యాఖ్యానమొనర్చుటలోను వ్యా సంస్కారాభావేతునాపిత ఇత్యుచ్యతే॥ అను నీప్రకారము విద్యారణ్యుల వారు వ్యాఖ్యానమునననుసరించియు పరాశరస్మృతి మూలగ్రంధము ననుసరించియు, ఖండింపబడినదని వ్రాయుచున్నాము. అనియిట్లు జయార్ధప్రకాశిక జెప్పుచున్నది.) యాజ్ఞవల్క్యుడైతే శూద్రుడే నాపితుడనిజెప్పెను. శూద్రులయందు దాస గోపాల కులమిత్రులును తనుకృషి జేయువాడును నాపితుడును భోజ్యాన్నులని జెప్పిరి. సూత సంహిత యందు ఊర్ధ్వనాపితుడని, అధోనాపితుడని, ఇట్లు ద్వైవిధ్యముగ నున్నది. అదిగావుననే నాభికంటె నూర్ధ్వమందు వపనము జేయువాడు నాపితుడని శుక్రుడు చెప్పెను. మార్గనాపితులకు బుట్టినవాడు సాంఖిలు

డు వీడు హీనుడు గుహ్యాకేశవపనము జేయువాని జాతివివేకమను గ్రంథము చెప్పుచున్నది.

అనియిట్లు మునిభావబోధిని ద్వితీయభాగమందును, జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్న రాజకులనిర్ణయమునందు 119, 120 పేజీలయందు జెప్పబడియున్నది.

ఈపాషండ పతిత పాకయాజిగారు బూర్వోక్తమైన జయార్థప్రకాశికలోని శ్లోకముల నన్నిటిని గ్రహింపక మొట్టమొదట వ్రాసిన శ్లో॥ నరాణాం నాపితోధూర్త శ్శూద్రేభ్యోప్యధికస్స్మృతః॥ అను నీశ్లోకమును మాత్రము గ్రహించి మార్గమున బోవువాడు ఇల్లుతు నింటివిూదనొకబెడ్డ వేసెనన్నట్లు స్వంతకవిత్వముచే అకట వికట విద్వజ్జన వీరభోగవదవిభ్రాజి పాషండ పతిత పాకయాజి అను సినామమును సార్థకపఱచుకొనుటకై ప్రయత్నించి నర్థమును వ్రాసియున్నారు. ఇట్లువ్రాయబడినయర్థము మునిభావబోధినికిని క్రిందిశ్లోకమగు శ్లో॥ శూద్రకన్యాసముత్పన్నో బ్రాహ్మణేనతుసంస్కృతః। అపరో నాపితప్రోక్త శ్శూద్రకర్మాధికోపిసః॥ అనగా శూద్రకన్యయందు బ్రాహ్మణునివలనబుట్టి సంస్కారమొందినవాడు నాపితుడని జెప్పబడును. వీడు శూద్రులకన్నను కర్మాధికుడని వృద్ధమనువుజెప్పెను. మఱియు యాజ్ఞవల్క్యసతు శూద్రఏవనాపితశ్శక్తః। అనగా యాజ్ఞవల్క్యుడును శూద్రుడే నాపితుడని జెప్పుచున్నాడు. అనియిట్లు జెప్పియున్నదానికిని మఱియు మను యాజ్ఞవల్క్య పరాశరస్మృతులలో జెప్పియున్న.

శ్లో॥ శూద్రేషు దాసగోపాల కులమిత్రార్ధసీరిణః। భోజ్యాన్నా ఏతే శూద్రేషు భోజ్యాన్నా। సగోపాల ఇత్యుక్తేయో భోజ్యోః ప్రైర్న సంశయః॥ సహార్ధిక ఇత్యుక్తేయో భోజ్యైర్విప్రైర్న సంశయః। దాసాది వణిక్కుంభకారోపి భోజ్యాన్న ఏవ। సదానాపితో ... కుంభకారకృషీవలః। బ్రాహ్మణైరపిభోక్తవ్యాః పంచైతే శూద్రయోనయః॥

ఇత్యాదివాక్యములలో ఈశూద్రులయందు దాసనాపిత గోపాలాదులు భుజింపతగినవారు అనియిట్లు జెప్పియుండుటచే శూద్రులకన్నను

దాసనాపిత గోపాలాదులు శ్రేష్ఠులని స్తనందులకు సహితము దెలియు చుండ ఈపాషండ పతిత పాకయాజిగారికి దెలియకబోవుట కారణము తెలియకయున్నది.

ఇదియునుంగాక పైశ్లోకములలో శంఖేనతు ప్రతిలోమజోయముక్తః. అనగా నొకడైనశంఖమహర్షి వలన నీనాపితునిప్రతిలోమజనిగా జెప్పబడెను. అను నీవాక్యమువలన మనము గుర్తెరుగతగిన దేమన్నను ఒకశంఖమహర్షిమాత్రము నీనాపితుని ప్రతిలోమజునుగ జెప్పబడెనుఅని యిట్లు జెప్పియుండుటచే తదితరులగు మను యాజ్ఞవల్క్య పరాశర వశిష్ఠాది మహర్షులందరు నీనాపితుని శూద్రులకెల్ల శ్రేష్ఠమైన కర్మగలవాడనియు సచ్ఛూద్రుడనియు నిట్లుగ జెప్పినట్లు దెలియబడినది. ఇట్లుగజెప్పి యుండుటచే నట్టికార్యములను విద్యారణ్యులు గ్రహించి దాసనాపిత గోపాలాదులను శూద్రులలోకెల్ల సచ్ఛూద్రులగ భావించి వ్యాఖ్యానమొసర్చియున్నవారుగాని ఈపాషండ పతిత పాకయాజిగారు జెప్పినట్లు ప్రతిలోమజునిగ విద్యారణ్యులు వ్రాసెచ్చటను జెప్పియుండలేదు. ఇందువల్ల మనుష్యులలో నాపితుడు ధూర్తుడనియు శూద్రులకంటె శ్రేష్ఠుడనియు మరియు శూద్రులకర్మలకన్న నధికకర్మగలవాడనియు ఇట్లు మునిభావబోధినిలో నుదహరించిన యర్థమును బట్టి జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకులనిర్ణయము నీగ్రంథములో 119, 120 పేజీలలో జెప్పబడిన యర్థమే శాస్త్రసమ్మతమైయున్నదని మీకెల్లరుకు దెలియబఱచుచున్నాను.

త్రుతిరియర్థపర్మరక్షణైక దీక్షాపరాంత్రి ధార్మికానుగ్రహ పరిభ్రాజి పాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శనమను నీగ్రంథమునందు 68 పేజీలో "వెనుక శూద్రులు ఘృతాదులను స్నేహపాచితములగు పిండివంటలను మాత్రమే దినదగునని వ్రాసియుండుటచే నట్లే దాసనాపిత గోపాలాదులకడను ఘృతాదులను స్నేహపాచితములగు భక్ష్యములను గ్రహింపవచ్చునని జెప్పయున్నవాడు"

అనియిట్లు ఒకవంకకెన్నియైనది యెరుగని ఈపాషండ పతిత పాకయాజిగారు వ్రాసియున్నారు. ఈయభిప్రాయముచే వీరికి పరాశ

రస్మృతి నన్వయించుకొను శక్తి లేనట్టుగ దెలియుచున్నది. ఏలయనిన చో పరాశరస్మృతిలోని ౧౧ అధ్యాయము, ౧౯ శ్లోకమగు నీక్రింది శ్లోకమునజూడుడీ.

శ్లో॥ శుష్కాన్నం గోరసం స్నేహం శూద్రవేశ్మన ఆగతమ్। పక్వం విప్రగృహేపక్వం భోజ్యంతన్మనురబ్రవీత్॥

విద్యారణ్యకృతవ్యాఖ్యానము. అ॥ ఘృతంతైలం తథాక్షీరమి త్యత్ర శూద్రసంబంధినాం భోజనమభ్యనుజ్ఞాతం। ఇదానీంశూద్రతండులాదీనా మభ్యనుజానాతి। శుష్కాన్నవ్రీహి- తండులాది గోరసః క్షీరాదిస్నేహ స్తైలాది తత్సర్వం శూద్రగృహా దానీయ బ్రాహ్మణగృహేయది పక్వంభవతి తదాతదన్నం భోజ్యం। పక్వాపక్వయోస్సాధారణ నిషేధపూర్వ ముదాహృత సోయము పచ్ఛూద్రవిషయః। అతఏవమధ్యమాంసరతా ఇత్యుక్తమ్॥

పరాశరమాధవీయము. ౩౧౦ పత్రము.

ఇందులభావమేమన్నను, విద్యారణ్యులవారు ఈశ్లోకమునకుబూర్వశ్లోకమగు నీక్రిందిశ్లోకమున,

శ్లో॥ ఘృతంక్షీరం తథాతైలం భక్ష్యంస్నేహేన పాచితమ్। గత్వా నదీతటే విప్రోభుంజీయాచ్ఛూద్ర భోజనమ్॥

పరాశరస్మృతి ౧౧ అధ్యాయము. ౧౩ శ్లోకము.

శూద్రులయిండ్ల ఘృతతైల క్షీరాదులను, స్నేహపాచితములైన భక్ష్యములను గొని నదీతటములయందు భుజించవచ్చునని యీశ్లోకమునకు వ్యాఖ్యాన మొనర్చునపుడనుజ్ఞ యివ్వబడినవాడై ఆవిషయము ౧౯ శ్లోకవ్యాఖ్యానావసరమున జెప్పుచు ఇప్పుడు అనగా పరాశరస్మృతిలోని ౧౧ అధ్యాయము ౧౯ శ్లోక వ్యాఖ్యాన మొనర్చునపుడు శూద్రులవద్దనుండి బియ్యము మొదలైనవి గొనివచ్చి తమయింట పక్వ మొనర్చి భుజించవచ్చునని అభ్యనుజ్ఞ యివ్వబడినదనియు, అందువలన యట్టిఅన్నమును భుజించవచ్చుననియు, అటుపిమ్మట నింతకుబూర్వము పక్వాపక్వమైన పదార్థములలో నెట్టానినైనను గ్రహించుటకు వలనుపడ

డదని జెప్పినది అసచ్ఛూద్రుల విషయమని పై వాక్యములోని యీక్రింది వాక్యము చే జెప్పబడియున్నది.

పఙ్క్త్యేకత్వయోస్సాధారణ నిషేధపూర్వ ముదాహృత స్సాయమ సచ్ఛూద్రవిషయః॥

ఇట్లు ప్రస్తుతమున వ్యాఖ్యానకర్త ౧౮ వ శ్లోక వ్యాఖ్యానావసరమున అసచ్ఛూద్రులనుగూర్చి జెప్పియున్న విషయము పై వ్యాఖ్యానములోని యీ క్రింది వాక్యము వలన నట్టి అసచ్ఛూద్రులెవ్వరైనది నిర్ణయించి జెప్పుచున్నది.

తఏవ మద్యమాంసరతా ఇత్యుక్తమ్।

అనగా నట్టి అసచ్ఛూద్రులు మద్యమాంసరతులై యుందురని పరాశరులవారు జెప్పినట్లు జెప్పియున్నారు. అట్లు అసచ్ఛూద్రుల విషయమై జెప్పిన శ్లోకము యీ ౧౯ వ శ్లోకమునకుపూర్వశ్లోకములలో చేరిన ౧౮ వ శ్లోకమైన యీక్రింది శ్లోకమైయున్నది.

శ్లో॥ మద్యమాంసరతంనిత్యం నీచకర్మ ప్రవర్తకం। తంశూద్రంవర్జయే ద్విప్రశ్శ్వపాకమివదూరతః॥

పరాశరస్మృతి ౧౧ అ. ౧౮ శ్లోకము.

అనగా నిత్యము మద్యమాంసరతుడై నీచకర్మయందు ప్రవర్తించుచుండునట్టి అసచ్ఛూద్రుని విడువదగినదనియు నొకవేళ యిట్టి అసచ్ఛూద్రుడే ద్విజశుశ్రూషరతుడై మద్యమాంస వివర్జితుడై స్వకర్మయందు నిరతుడై యుండినచో అట్టిశూద్రుని విడువతగినదనియు నిట్లు గ నీక్రిందిశ్లోకము చే జెప్పియున్నాడు.

శ్లో॥ ద్విజశుశ్రూషణరతాన్మద్యమాంస వివర్జితాన్।
స్వకర్మనిరతాన్నిత్యంతాం శూద్రాన్నత్యజేద్ద్విజః॥

పరాశరస్మృతిః. ౧౧ అధ్యాయము. ౧౯ శ్లోకము.

ఈరెండుశ్లోకములనగా ౧౮, ౧౯ శ్లోకములకు పై అర్థమునుదెలియజేయునట్టి ఆంధ్రపరాశరస్మృతి, తృతీయబింబము. ౧౮౮౩ పద్యమును యీక్రిందవ్రాయుచున్నాను.

చ. అనిశము మద్యమాంసరతుఁడై రథచోదక వర్తనాది జీ
వనుఁడగు నీచశూద్రునిళ్వపాకునియట్లుద్వ్యజించుటొప్పగు
మ్మనమున బాలులంగొలచి మాంసముకల్లును మానిస్వీయ క
ర్మనిరతుఁడైన శూద్రుని ధరంద్యజయించుట యొప్పదేప్పుడున్॥

ఇందువలన దెలియబడినదేమన్న ను శూద్రులగువారిండ్ల ఘృతాదికమును, స్నేహపాచితములైన భక్ష్యములను గాని తటాకాదుల సమీపమున భుజించవచ్చుననియు, మఱియు శూద్రుల యిండ్లలో బియ్యము మొదలగు పదార్థములను గొనివచ్చి తమయింట వంటజేసి భుజించవచ్చుననియు, అసచ్ఛూద్రులగు వారివలన పక్వాపక్వమైన పదార్థములతో నెద్దానినైనను గ్రహించగూడదనియు, అట్టి అసచ్ఛూద్రులు నిత్యము మద్యమాంసరతులై యుందురనియు, ఒకవేళ అట్టి అసచ్ఛూద్రుడైనను మద్యమాంస వర్జితుడై స్వకర్మ నిరతుడైనచో అట్టివానిని విడువక బూర్వోక్తమైన శూద్రునిగూర్చి ద్విజాదెట్లు ప్రవర్తించుటకలిగినదో అట్లు వీఁవిషయమందు నట్లుగనే ప్రవర్తించ వలయుననియు, ఇట్లుగ దెలియబడినది. ఇటులుండగ నొకవేళ బ్రాహ్మణాదులు అసచ్ఛూద్రులగువారియింటగాక శూద్రులగువారి యింట నాపత్కాలములయందు భుజించినచో,

శ్లో॥ ద్రుపదాం,

అను నీమంత్రమును నూరుపర్యాయములు జపించుటగాని లేక మనస్తాపముచేతగాని తద్దోషమును పోగొట్టుకొన వలయునని ప్రాయశ్చిత్తవిధిగా నీక్రిందిశ్లోకముచే పరాశరస్మృతి ౧౧ అధ్యాయము. ౨౦ శ్లోకమున జెప్పియున్నారు.

శ్లో॥ ఆపత్కాలేనవిప్రేణ భుక్తం శూద్రగృహేయది।
మనస్తాపేనశుద్ధ్యేత ద్రుపదాంవా జపేచ్ఛతమ్॥
పరాశరస్మృతి ౧౧ అ. ౨౦ శ్లోకము.

అనియిట్లు నాపత్కాలమున శూద్రునియింట భుజించినచో ప్రా యశ్చిత్తముజెప్పి అటుపిమ్మట దాస నాపిత గోపాల కులమిత్ర అర్ధశీరి ఆత్మనివేదకులను శూద్రులలో శ్రేష్ఠులైన సచ్ఛూద్రులగు వీరియాదవ్వర యింట భుజించవచ్చునని పరాశరస్మృతిలో ౧౧ అధ్యాయము ౨౧ శ్లోకమగు నీక్రిందిశ్లోకమున జెప్పియున్నారు. (సచ్ఛూద్రవిచారము)

శ్లో॥ దాసనాపిత గోపాల కులమిత్రార్ధశీరిణః। ఏతే శూద్రేషు భో జ్యాన్నా నాయశ్చాత్మానం నివేదయేత్॥

పరాశరస్మృతి ౧౧ అ. ౨౧ శ్లోకము.

క. నాపితదాసాన్నంబులు। గోపాలాన్నంబు మరియు గులమిత్రాన్నం౦। బాపయునర్ధికునన్నము। పాపడగావచ్చు శాస్త్రసమ్మతము గుటన్॥ ఆంధ్రపరాశరస్మృతి 3 బింబము. ౮౮ పద్యము.

ఈయాంధ్ర పరాశరస్మృతి శ్లోకమునకు సరియగు పద్యమై యున్నది. ఇపుడు యీసచ్ఛూద్రులయింద్ల ఘృతాదులను స్నేహపాచితములైన భక్ష్యములను భుజించడమా, లేక నన్నమును భుజించడమా, అను నీవిషయమును తెలుసుకొనతగియున్నది.

ఈశ్లోకమునందు గాని తదనుగుణ్యమైన పద్యము నందుగాని ఘృతాదులన్నియు స్నేహపాచితములైన భక్ష్యములనియు నెచ్చటను జెప్పియుండలేదు. ఆరెంటియందు మరేమిజెప్పబడిన దనగా దాసనాపిత గోపాలాదుల గృహముల నన్నమును దినవచ్చునని జెప్పబడియున్నది. ఇట్లు అన్నమునుదినమని పైప్రమాణవచనమునందు జెప్పబడియుండ నప్పుడు ఈపాషండ పతిత పాకయాజిగారు అన్నమను శబ్దమునకు ఘృతాదులని అర్థముచేసినయెడల వీరింటివారగు మాతుశ్రీగారు ఈపాషండ పతిత పాకయాజిగారికి అన్నమునకు బదులు ఘృతమును దీసుకొని వచ్చి ముందుబెట్టి దినుదినుమని జెప్పవలసియుండును.

ఇట్లు దినుమనిజెప్పిన దినవని ప్రత్యుత్తరము జెప్పినచో అత్తిత్యన్నమని గురుబాలప్రబోధిక జెప్పుచున్నది. గనుక ఘృతమును నన్నాదు అన్నమనియే నిశ్చయించుకొనవలయునని ఇట్లు ప్రత్యుత్తరమిచ్చిన యెడల నిరుత్తరులగుదురు.

ఇట్లెన్నటికిని జరుగదని నాయభిప్రాయము. అప్పటికి అన్నము మనప్పుడు ఘృతాదులని యర్థము జేసుకొనక నన్నమనియే అర్థము జేసుకొనుట కలుగుచున్నది. ఇందువలన సచ్ఛూద్ర లగు దాసనాపిత గోపాలాదుల గృహమున భుజించతగినది అన్నముగాక ఘృతాదులు గావనునట్టి అర్థమును గ్రహించుటయైనది.

ఇటుపైన దాసనాపిత గోపాలాదులు సచ్ఛూద్రులనియు కూడా గుర్తెరుగుటయైనది. మఱియు వీరికన్న తక్కువగల స్థితిగలవారెల్లరు శూద్రులనియు వారికన్న మరియు నాచార వ్యవహారములలో తక్కువగలవారెల్లరు అసచ్ఛూద్రులని ఇట్లు విద్యారణ్యవ్యాఖ్యానమునుబట్టి మనము గుర్తెరుగుటయైనది.

ఇపుడు స్మృతులలో (పరాశరాదిస్మృతులలో) సచ్ఛూద్రులు, శూద్రులు, అసచ్ఛూద్రులు, అను వీరినిగూర్చి జెప్పియుండలేదని జెప్పుట తిండిమెక్కువై తెలివి తక్కువలో మొకటి తెలివి తక్కువై యున్నది.

మరియు జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్న రాజకుల నిర్ణయమును నీగ్రంథములో 116 వ పేజీయందు.

శ్లో॥ బ్రాహ్మణా క్షత్రియో వైశ్య స్త్రయోవర్ణాద్విజాతయః।
చతుర్థఏకజాతిస్తుశూద్రోనాస్తితు పంచమః॥

అనియిట్లు వ్రాసియున్నదానిని మరల యాగ్రంథముననే 127 పేజీలో నాశ్లోకమంతయు వ్రాయుట నవసరమై తుదివాక్యమును వ్రాయుచు "అను నీశ్లోకము జెప్పుచున్నదని బూర్వమే దెలియజేసి యున్నాము." అనియిట్లు వ్రాసినదానిపైనను జూడక నాశ్లోకమునువ్రాయలేదని వ్రాయుట తిండిమెక్కువై తెలివితక్కువలో రెండవ తెలివి తక్కువై యున్నది.

మెండియు పని స్మృతులలోను సమ సజాతులలో సదాచారులు దురాచారులనుగూర్చి జెప్పుచుండ వాటినన్నిటిని గుర్తెరుగక జాతిశూద్రులలోమాత్రము సదాచారులు దురాచారులు గలరని జెప్పుట తిండిమెక్కువై తెలివితక్కువలో మూడవ తెలివి తక్కువై యున్నది.

1920 సం॥ ఆగస్టునెల 28 తేది కృష్ణాపత్రిక 6 పేజీ చలనమను వ్యాసములోని 2 వ కాలము 27 వ పంక్తిలో "బ్రాహ్మణులు ఒకప్పుడు ప్రపంచమునకంతటికిని గురుత్వము చేయగలిగిరి. నేడు అధఃపతితులై అజ్ఞానులై జంతువులవలె జీవనముగడుపుచున్నారు" అని యిట్లు వ్రాసియున్న దానిని జూచి ప్రత్యుత్తరము జెప్పజాలక హేతురహితముగ నిందారులయందు దుస్థితిని మోపి తాము దప్పించుకొనజూచుట దెలివితక్కువలో నాలగవ దెలివితక్కువయైయున్నది"

ఇట్లు లెక్కలేనన్ని తెలివితక్కువలను చెప్పుటకు నాకే లజ్జాకరముగదోచి గ్రంథవిస్తరభీతిచే వాటిని వివరించక విరమించితిని.

## యువతీవివాహమండనఖండనఖండనము.

సంఘసంస్కార దుర్మార్గ ప్రచారణ దీక్షాబద్ధకంకణ కరవిరాజీ పాషండ పతిత. శ్రీ. వీ. పాకయాజిగారు. జాతిభేదాదర్శమను నీ గ్రంథములో 74 పేజీయందు "యువతీవివాహమండనము. ఈ పేర 2-6-18 తేది నొక ముద్రిత కరపత్రికనుబంచిన మన...యుత్తరాలన మజుచి జయార్థప్రకాశిక చివర ప్రకటనములలో "రజస్వలా వివాహఖండనముండనము సిద్ధమగుచున్నదని గూడ ప్రకటనము గావించియున్నవారు." అనియిట్లు యోచనలేక నాక్షేపించి వ్రాసియున్నారు. ఇది సరియగు నాక్షేపణము కాదు. ఏలన నిటుచో శ్రీవారిమధ్యకాలములో గోదావరీజిల్లా అమలాపురం తాలూకా మాడెకుర్రు గ్రామనివాసులగు బ్రహ్మశ్రీ కొంపెల్లి సుబ్బరాయశాస్త్రిగారిచే ప్రచురింపబడిన యువతీవివాహఖండనమను నొక గ్రంథమును జూచుట కలిగినది. శ్రీవారట్టి గ్రంథమును ఖండించుటకు యత్నించి నాఖండనగ్రంథమునకు గాను యువతీవివాహమండనమనియు, ఈ పాషండ పతిత. శ్రీ. వీ. పాకయాజిగారిచే బ్రకటించిన గ్రంథమును ఖండనమొనర్చిన యాఖండన గ్రంథమునకు రజస్వలా వివాహఖండన ముండనమనియు, నిట్లుగ పేరుబెట్టబడి బ్రకటించుటకు యత్నించి బూర్వోక్తపద్ధతిని పేరులుమార్చుటయు

వది. ఇందువల్ల పాఠకమహాశయులు పేరులను బట్టియే ఖండన గ్రంథమిదియనియు సిద్ధాంత గ్రంథమిదియనియు ఇట్లు రెండిటినిగుర్తెరుగుటకు వీలైయుండునవిదలంచి పేరులుమార్చుటనయ్యెది.

ఇందున బూర్వోక్తమైన యువతీవివాహ మండన మను నీపత్రిక ను ఇచ్చుట ప్రకటించుచున్నాను.

# యువతీవివాహమండనము.

ఆర్యులారా!

శికిందాబాదు మహబూబు కాలేజి ప్రధాన సంస్కృతాంధ్రోపాధ్యాయ పదవిభాజి శివపురపు వీరభద్ర పాకయాజి చివుకుల అప్పయ్య శాస్త్రిగార్లచే ప్రణీతమైన రజస్వలావివాహ ఖండనమను గ్రంథమును మేమీమధ్య కాలములోనే జూచుటకలిగినది.

వీరుభయులు శికిందాబాదు గ్రామస్థిత మహబూబు కాలేజి సంస్కృతాంధ్రోపాధ్యాయ పదవిభాజి మానులగుటచే ఇంచుక గ్రంథశైలి (మాత్రము) చక్కగ రచించియున్నవారు. గ్రంథస్థ విషయము జూడ తప్పులతడకయై గన్పట్టుచున్నది. ఇందులకా గ్రంథస్థ విషయముకదానిని పాఠకమహాశయులగు మీకెల్లరకు విశదమగునటుల వ్రాయుచున్నాము.

వీరలచే ప్రణీతమైన ఈరజస్వలావివాహఖండనమను గ్రంథమున 18 వ పత్రమునందు "ఈవిధముగ వేదమంత్రములకు నెవరియిష్టము వచ్చినట్లర్థము వారు చేయబూనినచో వెక్కసర్థములు వాటిల్లు" అని వ్రాసియుండియు, నాగ్రంథముననే 68 వ పత్రములో "శ్రు। బ్రహ్మచర్యేణ కన్యాయువానం విందతేపతిం. అను నీనథర్వణ మాన్త్రాభిప్రాయమేమనియడదగా దీనికి మనమూర్తిగారు (ఆర్యనారాయణమూర్తిగారు) బ్రహ్మచర్యానంతరము కన్య యౌవనవంతుడైన పురుషుని వివాహము చేసుకొనవలయునని చెప్పియున్నారు. కాని యుదిలిప్పు ఈ మంత్రమందాయర్థములేదు. ఇకేమున్నదన బ్రహ్మచర్యేణ బ్రహ్మచర్య

ముచే, కన్యా పడుచు, యువాన, యౌవనవంతుడైన, పతిం భర్త ను, విందతే పొందుచున్నది. అనియర్థము. ఈయర్థము కన్య బ్రహ్మచర్యముచేత గర్భాదానము జేసుకొన వలసినదని బోధించు చున్నది. కాని వివాహమును బోధించుటలేదు."

అని పాకయాజిగారులు వ్రాసియున్నారు. పాకయాజిగారివ్రాతభాష్యవిరుద్ధమైయున్నది పై మంత్రమునకు విద్యారణ్యులుభాష్యము వ్రాసియున్నారు. ఆయర్థమునే క్రింద వ్రాయుచున్నాము జూడుడీ.

శృ॥ బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతేపతిం॥

అథర్వణవేదము 11 కాం. 3 అ. 7 సూ. 18 మంత్రము.

విద్యారణ్యభాష్యము అత్రాపి బ్రహ్మచర్యం ప్రశస్యతే। కన్యాఅకృత వివాహాస్త్రీ బ్రహ్మచర్యం చరంతి। తేన బ్రహ్మచర్యేణ యువానమ్ యువత్వగుణోపేతమ్ ఉత్కృష్టం పతిమ్ విందతే లభతే॥ అథర్వణవేదము 3 సంపుటము 114 పేజి.

ఈభాష్యార్థమేమన్నను, ఇచ్చటను బ్రహ్మచర్యము స్తుతింపబడుచున్నది. వివాహముకానటువంటి స్త్రీ బ్రహ్మచర్యము నాచరించుచున్నది. అట్టి బ్రహ్మచర్యముచేత యౌవనగుణోపేతుడైనట్టి తనకన్న ఉత్కృష్టుడైన పతిని బొందుచున్నది.

అని యీప్రకారము నీమంత్రమునకు వ్రాయుచు నీమంత్రమునకు బూర్వమంత్రమగు శృ॥ బ్రహ్మచర్యేణ తపసా॥ అను నీమంత్రముయొక్క భాష్యమున బ్రహ్మచర్యమనగా నెట్టిదో నట్టిలక్షణము చక్కగ వివరించియున్నవారు.

విద్యారణ్యభాష్యము. బ్రహ్మవేదః। తదధ్యయనార్థమ్ ఆచార్యమ్। ఆచరణీయమ్। సమిదాధానభైక్ష్య చర్యోర్ధ్వరేతస్కత్వాదికం బ్రహ్మచారిభి రనుష్ఠీయమానం కర్మ బ్రహ్మచర్యం॥

అథర్వణవేదము. 3 సంపుటము. 118 పేజి.

ఇందులకర్థమేమన్నను బ్రహ్మయనగా వేదము. అట్టివేదమును చదువుటకొఱకు ఆచరించదగిన సమిదాధానము, భిక్షాచరణము, [illegible]

ర్ధ్వరేతస్కము, మొదలుగా గలిగి నటువంటి బ్రహ్మచారులచే అను ష్ఠింపదగినటువంటి కర్మ బ్రహ్మచర్యమనబడును.

ఇట్టి బ్రహ్మచర్యమునే బూర్వోక్త మంత్రస్థయగు కన్య అవలం బించ తగియున్నదని బూర్వోదాహృత భాష్యమందు (అత్రాపి) ఇచ్చట ననుపదముచే సూచింపబడుచున్నది. ఇందువలన కన్య ఇట్టిబ్ర హ్మచర్యముచేత యౌవన వంతురాలై నటువంటి ఉత్కృష్టమగు భాష్యప దస్థ విశేషణముచే విద్యాసామర్థ్యములచేతను తనకన్న అతిశయుడైనటు వంటి భర్తను పొందుచున్నదని భాష్యాభిప్రాయమైయున్నది.

అని యీప్రకారము విద్యారణ్య మహాముని చక్కగ వివరిం చి వ్రాసియుండ పాకయాజి చిపుకుల అప్పయ్యశాస్త్రి అను నీయుభ యులు బూర్వోక్తమైన ఈమంత్రమున ద్రావిడ ప్రాణాయామమును పఠించి బూర్వోదాహృతమైన స్వవచనమునకు విరుద్ధముగా నేమమో భావ్య విరుద్ధవ్రాతలు వ్రాసియున్నవారలు.

మరియు నీరజస్వలా వివాహ ఖండనమను గ్రంథమున ఎన్ని యో లోపములు గన్పట్టుచున్నవి. గ్రంథవిస్తర భయముచే నాలోపములు గన్పరచమైతిమి. కొంతకాలములో పూర్వోక్తగ్రంథమగు నీరజస్వలా వివాహ ఖండనమను గ్రంథమును ఖండించుచు విద్యారణ్య భాష్య యుక్తమైన శృతిస్మృతేతిహాస పురాణ వాక్యములచే యువతీవివాహ మండనమని సార్థకగ్రంథమును వ్రాయుచు ఆంధ్రప్రకాశికా ముఖము ననేని లేక ప్రత్యేక గ్రంథరూపముననైనా పాఠకమహాశయులకు మీ కెల్లరకు విశదమగునట్లు వెల్లడిపరచుచున్నాము

2—6—18,
అముదాలలంక.

శ్రీమత్పరమహంస,
స్వామి జీ. యస్. బి. సరస్వతి.

ఈపత్రిక బ్రకటించి దాదాపు యిప్పటికి మూడుసంవత్సరములు గావచ్చుచున్నది. కాని యీపత్రికకు ప్రత్యుత్తరముగ్ని నీరజస్వలా వివాహఖండనమను గ్రంథమును సిద్ధాంత పఱచునని యుండవలసి యుండెను. అట్లు జరిగియుండలేదు. అట్లు జరుగుటకును వీలులేదు.

కారణమేమని యెదరేని తాము జండాలస్పర్శమున దలక్రిందు నూగులాడుచుండునట్టే నాగ్రంథముగూడా పూర్వపక్ష సిద్ధాంతములతో గూడుకొని దలక్రిందు నూగులాడుచున్నది. ఇట్టిస్థితిలో సిద్ధాంత మెట్లగును. కాబట్టి సిద్ధాంతము గాజాలదని ముమ్మాటికి వాకొనుచున్నాను.

ఇదియునుంగాక శివాగ్రహ విరాజి పాషండ పతిత శి. వి. పాకయాజిగారు జాతివిభాగాదర్శమను స్వగ్రంథములో 75 పేజీయందు "యువతీవివాహ మండన ముండనము. ఈపేరనొక పెద్ద విమర్శన వ్రాసి నాచేరచియింపబడిన వివాహఖండనము పునర్ముద్రణమగు నప్పుడందు జేర్పదలంచియున్నవాడనంబట్టి యది విడిచి ప్రకృతము యువతీ వివాహ మండనమను పేరును మాత్రమే యిందు విమర్శించుచున్న వాడను." అనియిట్లు గోడమీది పిల్లివాటముదాటుకొని పోవుట గలిగినది. తాము మున్ముందు పెద్దవ్యాసమువ్రాసి పునర్ముద్రణమగునప్పుడు ఈరజస్వలావివాహఖండనమున జేర్చునంతవరకు ప్రస్తుతము యుండునట్టి ఈరజస్వలావివాహఖండనమను గ్రంథము పై వివరించిన యువతీ వివాహమండనమును బత్రికవలన ఖండింపబడి యువతీవివాహ మండనము ను ఈచిన్నపత్రిక సిద్ధాంతమైయున్నదని స్తనందులకు సహితము వారి వాక్యములవల్లనే గోచరించుచున్నది.

ఇంతియేగాదు. అకట వికట విద్వజ్జన వీరభోగ పదవిభ్రాజి పాషండ పతిత శి. వి. పాకయాజిగారు బూర్వోక్తమైన వ్రాతలోనుదను "ప్రకృతము యువతీవివాహమండనమను పేరునుమాత్రమే యిందు విమర్శించుచున్నవాడను. (మరియును) యువతియన బురుషునితో గూడియుండునదియని గురుబాలప్రబోధిక 158 పుటలో "పుంసాయాతీతియువతి" యని జెప్పియున్నది.

అనియిట్లు జాతివిభాగాదర్శము 75 పేజీలో వ్రాసియున్నారు. ఇందులగూర్చి మనము విచారించుట కర్తవ్యమైయున్నది.

ఈవ్రాత తిండియెక్కువై కలివిదక్కువగ నుండుటచే వ్రాసినట్లు నూహించుచున్నాను. లేనిచో రజస్వలా వివాహ ఖండనమను గ్రంథము 17 పేజీలో "గురు 158 పుట పుంసాయాతీతి యువతి"

పురుషునితో గూడినది. అని వ్యుత్పత్త్యర్థము గలదు. దీనిబట్టి పురుషసంగమము జేయు జేడియగు యువతియని పేరు వాడవలయునని దెలియవచ్చినది......కాన మనసోదరులు తాము వ్రాసిన కార్యములకు శాస్త్రవిహిత నామములను బెట్టుకొనజాలనివారని యాపిమర్శనమునకు ఘోరిదపడినది " అనియిట్లు వ్రాసియుండ అట్టి యావాక్యములను శ్రీ వారుజూచియే రజస్వలా వివాహ ఖండనమను గ్రంథములోని పై వాక్యములకు శీర్షికయగు "యువతీ వివాహ మనదగునా" అను నీవాక్యము శాస్త్రవిహితమైన నామముగయుండుటచేతనే తమపత్రికకు యువతీ వివాహమండనమని పేరిడియున్నారు. ఇట్టి యభిప్రాయము నీపాషండపతిత పాకయాజిగారు గ్రహించ నేరక మరల నిచ్చట వ్రాసియున్నారు. అయినను విమర్శించుచున్నాము.

శ్రుతిధర్మ మార్గాణ్యధిపతి పదహినంరాజీ, పాషండ పతిత శి. వి. పాకయాజిగారు వ్రాసినదానిలో యువతియనునప్పుడు "పుంసా యౌతీతి యువతి" అనిగదా గురుబాలప్రబోధిక నుండి వ్రాసియున్నారు. ఇది తప్పభిప్రాయమైయున్నది. మరియు వీరి సమీపమున శబ్దార్థచంద్రిక గురుబాలప్రబోధిక అను నీగ్రంథములుతప్ప తదితరగ్రంథములు లేనట్టు పై వ్రాతలవలన దెలియుచున్నది.

ఇపుడు యువతియనుశబ్దమునకు పుంసాయౌతీతి యువతి అనునీ వ్యుత్పత్త్యర్థమును జెప్ప గూడదు. అట్లగు నెడల మరెటుల జెప్పవలయునని నచో మొట్టమొదట వేదములలో నీశబ్దముండునట్టి శ్రుతివాక్యములను గ్రహించి యందులకు విద్యారణ్యులు మొదలగువారు భాష్యములలో నాశబ్దమున కెట్లు యర్థమును వ్రాసియున్నారో దానినిముందువిమర్శించి దెలుసుకొనతగియున్నది. వేదములలో నుండు శబ్దములకును అమరకోశము మొదలగు కోశములలోనుండు శబ్దములకును కొంత తారతమ్యములు గలవు. మనము ధర్మశాస్త్రవిషయమై దెలుసు కొనుటకు ప్రయత్నించితిమేని మొట్టమొదట శ్రుతివాక్యములను విచారించ దగియున్నది. సాహిత్యవిషయమై దెలుసుకొనుటకు యత్నించితిమేని అమరకోశము అనగా గురుబాలప్రబోధిక మొదలగు కోశములను జూడ

దగియున్నది. ఇప్పుడట్లుగాక నీపాషండ పతిత పాకయాజిగారు విధుమ్న
ను పెండ్లికి నొకమంత్రమున్నట్లు అమరకోశమునుండి ధర్మశాస్త్రవి
చారణము జేయుటకు బ్రయత్నపడినారు. ఇదియ్యది,

శ్లో॥ ధర్మజిజ్ఞాసమానానాం ప్రమాణం పరమంశ్రుతిః॥

అను నీమనుస్మృతి వాక్యమునకు వ్యతిరిక్తముగ బ్రవర్తించి కృ
ష్ణాష్టమికిని, వీర్లపండుగకును సంబంధముగల్పుటకు యత్నించినట్లు యత్ని
త్నించియున్నారు. ఇదితప్పు. కాబట్టి మనము యువతీశబ్దమునకు వేద
భాష్యకర్త లెట్లు వ్యుత్పత్తివ్రాసి భాష్యము వ్రాసియున్నారో నానం
గతిని విచారించుకొనియెదము.

శ్రు॥ అపశ్యం యువతిం॥ విద్యారణ్యభాష్యము. యువతిం. యౌవనావస్థోపేతామ్॥ అధర్వణవేదము. కాండ 18. అ 3. సూ 3. మం 3. సంపుటము 4. పేజీ 181.

శ్రు॥ ఇషిరాయోషా యువతిః॥ విద్యారణ్య భాష్యము. యువతిః. యౌవనవతీ॥ అధర్వణవేదము. కాండ 19. అ 6. సూ 49. మం 1 సంపుటము 4. పేజీ 483.

శ్రు॥ యువతిర్విభర్తి॥ విద్యారణ్యభాష్యము. యువతిః. యౌవనవతీ॥ అధర్వణవేదము. కాం 19. అ 6. సూ 49. మం 8. సంపుటము 4. పేజీ 491.

శ్రు॥ యువతింనశర్యామ్॥ విద్యారణ్యభాష్యము. యువతిం. యౌవనావస్థోపేతామ్॥ ఋగ్వేదము. ఋగ్సంహిత. 8, 8, 36, 3, సంపుటము 6. పేజీ 405.

ఇట్టి ప్రమాణములు ఇన్నియోగలవు. వాటిని గ్రంథవిస్తరభీ
తిచే విరమించుటయైనది. ఇపుడు యువతీ యనునప్పుడు యౌవనవతి
యైనది యువతియని పై విద్యారణ్యభాష్యపంక్తులవలన దెలియబడినది.
కాని యీపాషండ పతిత పాకయాజి గురుబాల ప్రబోధిక ననుసరించి
జెప్పినట్లు పురుషునితో గూడినది యువతియని పై విద్యారణ్యభాష్య
మువలన దెలియబడి యుండలేదు. ఇందలి వేదవాక్యములవల్లనున్న త

ద్భావ్యపంక్తుల వల్లనున్ను, ఉపాఖండ పతిత పాకయాజిచే రచియింపబడిన రజస్వలావివాహ ఖండనములోని 17, 68 పత్రములను కుంకుమలోసి పొట్లము కట్టుకొనుటకుకూడా వీలులేనట్లు ముక్కలు ముక్కలుగ ఖండింపబడినదని తెలియజేయుచున్నాను. మరియును,

ఇపుడు యువతీవివాహమని చెప్పుట శాస్త్రసమ్మతమని ఉపాఖండ పతిత పాకయాజిచే చెప్పబడినవాక్యమునుండి చెప్పుటవలన శ్రీవారిచే ప్రకటింపబడిన యువతీవివాహమండనమను వాక్యము సశాస్త్రీయముగా నున్నదని విమర్శింపబడినది.

ఇట్టితెరి ఉపాఖండ పతిత పాకయాజిగారు జాతిసౌభాగ్యదర్శనమనుగ్రంథములో 75 పేజీయందు యువతీవివాహ మండన ముండనమని చెప్పినదాని ప్రక్కన నై హేతువులనుబట్టి ఖండనమను పదమును చేర్చి చెప్పుటచే యువతీవివాహ మండన ముండన ఖండనమను వాక్యము సిద్ధించుచున్నది. అట్టి వాక్యమును గైకొని వైశేషికయందు కూడా యువతీవివాహ మండన ముండన ఖండనమని యుంచుట లేటన్నపడినదని విన్నవించుకొనుచున్నాడను.

## ఉపసంహారము.

పాఠకమహాశయులారా !

అఖండ సచ్చిదానంద స్వరూపుడగు భగవంతునిచే నీప్రపంచమంతయు సృజింపబడినది, అందొక మనుష్యునిబోలి వేఱొక మనుష్యుడు గానరాడు. ఒకని కంఠధ్వని ననుసరించి మరొకని కంఠధ్వని యుండదు. అట్లే ఒకరిబుద్ధి వృత్తినిబోలి మరియొకరిబుద్ధి వృత్తులుండవు. పాశ్చాత్యవిశ్రుత భారత భాగవత రామాయణ ప్రముఖ మహాగ్రంథములు సకల భాషలయందును విరాజిల్లుచున్నవి. ఆధునికులచే మరికొన్ని నాటకప్రబంధ గద్య పద్యోభయమయ గ్రంథములు వ్రాయబడినవి. వ్రాయబడుచున్నవి. వ్రాయబడనున్నవి.

అయినను సంఘ విషయమును గూర్చి దెలియజేయు నిబంధన గ్రంథములు న్యూనములై యున్నవి. ఉండినవియైనను స్వార్థపరులగు వారిచే కల్పింపబడిన కల్పితవాక్యములచే నిండియున్నవి. ఇట్టి కల్పిత వాక్యముల ననుసరించి కొందరు ప్రవర్తించుచు బ్రహ్మసమాజకులు జుట్టు బొట్టు లేనివారనియు, నార్యసమాజకులు పై వారివలె బొట్టు కట్టులను దుడిచిపెట్టినను జుట్టునుమాత్రము పెట్టుకొనియుందురనియు, నిట్లు బరులను దూషించుచు తమకుండు కళంకము నణగద్రొక్కుకొని ప్రవర్తించుచున్నారు.

ఇట్టివారి ప్రవర్తనములవల్ల దాజెడ్డ గోతి వనమెల్లజెరచెనను నార్యోక్తిగ వీరునుజెడి పైపెచ్చు లోకమునుగూడ జెరచు వారగుచున్నారు. అట్టివారి గ్రంథములను విమర్శించి లోకమునకు విన్నవించుటకై యత్నించుచుండ శ్రుతి విరుద్ధ ధర్మరక్షణైక దీక్షా పరతంత్ర ధార్మికానుగ్రహ పరిభ్రష్ట పాషండ పతిత శి. వి. పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథమును బ్రకటించినదిజూచి యీగ్రంథమును విమర్శించుటకై యత్నించితిని.

ఈపాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను నీగ్రంథమును వ్రాయుటలో లేనిపోని యభూతకల్పనలనుగల్పించి వ్రాయకపోయినయెడల తమపత్రికయగు శ్రుతిధర్మసంజీవనియను యీనూతన పత్రికకు చందాదారులను యేర్పరచుట దుస్తరమైయుండును. అందుల కొఱకే యీజాతివిభాగాదర్శమను నీగ్రంథములో పెట్టిపోకళ్ళన్నిబోయియున్నారు.

ఇట్లు పై వివరించిన నాయొక్క భావమును మీకు దృఢముగ దెలియుటకై ఈపాషండ పతిత పాకయాజిగారు స్వయముగ జెప్పినట్టి వాక్యములను వారిగ్రంథములనుండి యెత్తి యీక్రింద వివరముగ మీకు జూపుచున్నాను.

పోరాటమువ్రాయని పత్రికలను గొనుటకు జనుల కారాటము కదుగదా. రజస్వలావివాహఖండనము 50 పేజి. 21 పంక్తి.

అనియిట్లు జెప్పియుండుటచే వీరిపత్రికలలో వ్రాయు వ్రాతలన్ని పోటాటములను కల్పించుకొని పత్రికలకు మిథ్యావచనములను వ్రాయుచు నందువలన జీవనోపాధి సంపాదించుకొనుచు లోకమును వంచన జేయుచున్నారను సంగతి స్పష్టముగ నిందువలన దెలియుటయైనది.

ఇంతియేకాదు ఈపాషండ పతిత పాకయాజిగారు జాతివిభాగాదర్శమను గ్రంథములో 32 పేజీయందు "కానవారియశస్సును సహింపలేక సత్యేతరమువ్రాయుటకంటె మహాపాపకార్యము వేరుండదు. కావున బ్రతిజ్ఞాపూర్వముగ నాయభిప్రాయమును నివేదించుచున్నవాడ" అనియిట్లు తనుప్రతిజ్ఞను దెలియునట్లు వ్రాసియున్నారు.

ఇట్లు ప్రతిజ్ఞజేసి వ్రాసినవారు వెలమవారు క్షత్రియులని జెప్పి నిర్ణయించునట్టి ౧ పద్మనాయకులచరిత్ర, వెలమవారు క్షత్రియులనినిర్ణయించి మ. రా. రా. శ్రీ గురుజాడ రామమూర్తిగారిచే జెప్పిన ౨ రావువారిచరిత్ర, పిఠాపురప్రాంతనివాసులగు మ. రా. రా. శ్రీ రావు ధర్మా రాయశింగారిచే వ్రాయబడి వెలమవారు క్షత్రియులనిజెప్పునట్టి 3 రావువారిచరిత్ర, ౪ ఆంధ్రులచరిత్రము, ౧, ౨, 3, భాగములు. ఈ మొదలగు గ్రంథములను, మరియు కుట్బీవారును, కూర్మకులావతంసులును, మరాటివారును, ఈమొదలగు వారందరు క్షత్రియులని జెప్పునట్టి ౫ వంశభాస్కరము, ౬ రాజపుత్రస్థానచరిత్ర, ఈమొదలగుగ్రంథములను, వెండియు బూర్వోక్తులగు కుట్బీవారును, కూర్మకులావతంసకులును, మరాటివారును, ఈమొదలగువారైన వీరే వెలమవారుగను, కమ్మవారుగను, ఈమొదలగు వారుగనైయున్నారని జెప్పునట్టి బూర్వోదాహృతమైన ౭ పద్మనాయకులచరిత్ర మొదలగు గ్రంథములను, ఇంతియేకాదు. రెడ్డివారు క్షత్రియులనిజెప్పునట్టి ౮ రాఠోడుచరిత్రము, ౯ వంశభాస్కరము, రాజపుత్రస్థానచరిత్రము ఈమొదలగు గ్రంథములను, మఱియును, ౧౦ కమ్మవారు క్షత్రియులని ఆరు ఏడు కమ్మ మహాజన సభల కగ్రాసనాధిపతులగు వారిచే దీర్మానింపబడిన దీర్మానములను, వెండియు; ౧౧ బూర్వోక్త విధిగనే కమ్మవారు సూర్యవంశజులగు క్షత్రియులని జెప్పునట్టి చాదరీపత్రిక మొదలగు ప

క్షత్రికలను, ఇంతియేగాక, ౧౨ రెడ్డివారు క్షత్రియులని రెడ్డి మహా జనసభలో దీర్మానించుకొనిన దీర్మానములను, ఇంతియేగాదు ౧౩ బలిజవారు క్షత్రియులమని చెప్పునట్టి మెడ్రాసులో స్థాపింపబడిన నాయుడు సంఘముయొక్క దీర్మానములగు ఈమొదలైన మహాజనసభలయొక్క దీర్మానములను, వెండియు ౧౪ పురాతన దానశాసనములు, ౧౫ దేశచరిత్రలు, ౧౬ గౌర్మెంటువారిచే బ్రకటింపబడిన పబ్లికుగజట్లను, ౧౭ గౌర్మెంటువారివలన న్యాయస్థానములయందు దీర్మానింపబడిన దీర్మానములను, ఈమొదలగు వాటినన్నిటిని పరిశోధించి ఆయావిషయములను మఱుగుపరచక ఖండనజేసుకొని వచ్చినప్పుడును, వెండియు జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకుల నిర్ణయమను గ్రంధములోని విషయములను సశాస్త్రీయముగ ఖండనజేసుకొని జాతివిభాగాదర్శమను నీగ్రంధమును బ్రకటనజేసినప్పుడును పాఠకమహాశయులు గ్రంధములోని యదార్థస్థితిని గ్రహించి తత్ప్రకారముగ బ్రవర్తించుటకువీలుండును.

ఇపుడట్లుగాక నాలగవ తరగతి బాలురకు ముఖ్యముగ నుపయోగించునట్టి ౧ లక్ష్మీనారాయణము, ౨ శబ్దార్థచంద్రిక, 3 శబ్దరత్నాకరము, ౪ ఆంధ్రభాషార్ణవము, ౫ ఆంధ్రనామ సంగ్రహము, ఈమొదలగు నిఘంటువులచేతను, కమ్మవారు మొదలగువారు క్షత్రియులని తెలియనట్టి సమయములో ౧ అమరవాది రామయనామధేయకవి, ౨ కొప్పరాజు సుబ్బరాజుకవి, 3 శ్రీతాతంభట్టు గురుమూర్తిశాస్త్రి, ౪ కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. ౫ ములుగు పాపయారాధ్యులు, ౬ శ్రీచర్ల వెంకటశాస్త్రి, ౭ శేషకవిగారు, ౮ ఇమ్మానేని శరభలింగకవి, ౯ దిట్టకవి నారాయణమహాకవి, ౧౦ రాపాక లక్ష్మీకవి వర్యులు, ఈమొదలగువారిచే రచియింపబడిన ౧ ద్రౌపతీపరిణయము ౨ కాంచీమహాత్మ్యము, 3 కృష్ణామహాత్మ్యము, ౪ శ్రీకృష్ణ భారతము, ౫ సరసహృదయానురంజనము, అహల్యాసంక్రందన విలాసము, దేవీభాగవతము, ౬ వెంకటాద్రిగుణరత్నావళి, ౭ సుబ్బనృపాలీయము, ౮ అలంకారచంద్రోదయము, ౯ రంగరాయచరిత్ర, ౧౦ భ

దా్రియుదభ్యుదయము, ఈ మొదలగు ప్రబంధములచేతను, ఇంతియే గాదు ప్రమాదోధీమతామపి అను నీన్యాయాను సారముగ ప్రచ్ఛన్న రూపధారులగు కమ్మవారు మొదలగువారిని క్షత్రియులని గుర్తించ లేనట్టి మారన శ్రీనాథాది మహాకవులచే రచియింపబడిన ౧ ఆంధ్రిమార్కండేయ పురాణము, ౨ కాశీఖండము, భీమేశ్వరపురాణము, ఈ మొదలగు పురాణగ్రింథములచేతను జాతివిభాగాదర్శమను గ్రింథము ను సిద్ధాంతముచేయబూనుకొని నప్పుడు చీనాట్లును, చెంపకు తెంపకాయ తలకు మొట్టికాయయును తగులుటతప్ప నాజాతివిభాగాదర్శమను గ్రింథము మెన్నటికిని సిద్ధాంతముమాత్రము గాజాలదని దృఢముగ వ్రాయుచున్నాను.

ఈమహాకవులలో పూర్వకవులగు మారన శ్రీనాథాదులుమాత్రము కమ్మవారు మొదలగువారు ప్రచ్ఛన్నరూపమును బొందియుండుట చేతనే గాబోలు శూద్రులనిజెప్పక చతుర్థకులజులనిమాత్రము జెప్పియున్నారు. చతుర్థకులజులనునప్పుడు ప్రచ్ఛన్నత్వమును బొందిన క్షత్రియులని గుర్తెరుగతగియున్నది గాని శూద్రులని గుర్తెరుగుటకు వీలులేదు. ఏలయనియెదరేని చతుర్థకులజులనువారిలో గొందరు ధనంజయసగోత్రముగలవారై యున్నారు. ఈధనంజయస గోత్రము ప్రవరఖండములో విశ్వామిత్రగణమునం దుదహరింపబడియున్నది. విశ్వామిత్రమధుచ్ఛంద ధనంజయులను రాజర్షిప్రవరులు గోత్రకర్తలుగా గన్పట్టుచున్నారు. ఇట్టి ధనంజయ గోత్రము గలవారెట్లు శూద్రులగుదురో దెలియకయున్నది. ఇట్టి చతుర్థవంశమున జనించినవారికి ధనంజయగోత్రము గలిగియున్న దని కొన్ని ప్రమాణములగు శాసనములనుండి మనము గ్రహించ తగియున్నది. ఇట్టిశాసనములలో కోటభూతిమ శాసనమునుండి,

చతుర్థవంశమున జనించె నుగ్రరిపు సైన్యజయుండు ధనంజయుండిల౯.

అను నీవాక్యముచేతను, మరియు చతుర్థకులజులని పేరు బొందిన ధనంజయగోత్ర సంజాతుండగు కోటకేతరాజు యొక్క దానశాసనములచేతను, దుర్జయ కులాభరణుండగు బుద్ధరాజు మున్నగువారలచే జేయబడిన దానశాసనముల చేతను, గోనబుద్ధారెడ్డి కుమార్తెయగు

కుహ్వాంబికయొక్క దానశాసనముచేతను, అల్లాడరెడ్డి కోరుమిల్లి శా సశాసనముచేతను, మరియు నిట్టిశాసనములు యెన్నియోగలవు. వాటి నన్నిటిచే బైయంశమును మనము గుర్తెరుగవచ్చును. మరియును శ్రీ వారివిషయములనన్నిటిని ఆంధ్రక్షత్రియుల విమర్శనమను గ్రంథములో విపులముగ విమర్శించి వ్రాసియున్నారు గనుక నావిషయములన్నిటిని మరల నిచ్చట విమర్శించుటచే గ్రంథవిస్తరమగునని యెంచి విరమిం చు కొంటిని.

ఇంతియేగాదు ప్రచ్ఛన్నరూపముతో నుండు ధర్మజ, భీమార్జున, నకుల, సహదేవులను గూడియు ద్రౌపదిని వీరినందరిని విరాటనగరనివా సులును, తదితరులును, పూర్వోక్త నామములచే పేరులుపెట్టి పిలువక, కంకుభట్టు, వలలుడు, బృహన్నల, తంత్రిపాలుడు, దామగ్రంధి, సై రంధ్రి అని యిట్లు పిలుచుచుండిరి. మరియును ఈవిరాటపర్వమనుగ్రం థమునంతయు వెదకితిమేని సర్వసాధారణముగ నీనామములే గన్పట్టును గాని పూర్వనామములు గన్పట్టని కతన ప్రచ్ఛన్నరూపముతో నుండు కమ్మవారు మొదలగువారినిగూర్చి తత్కాలావస్థనుబట్టి మహాకవులంద రు శూద్రులని వర్ణించక మరియేమనివర్ణించెదరు. ఇంతియేకాదు. ద్రౌ పదీస్వయంవరకాలమున బ్రాహ్మణులందరు ప్రచ్ఛన్నరూపముతో నుం డు పాండవులనుగూర్చి బ్రాహ్మణులని వర్ణించియుండలేదా. ఇట్లువర్ణిం చిన వర్ణనలన్నియు చిరకాలముగ నిలచియుండెనా. అట్లుగనే మహాక వులందరు ప్రచ్ఛన్నరూపముతో నుండు కమ్మవారు మొదలగు వారిని శూద్రులని వర్ణించిన వర్ణనలన్ని శాశ్వతములై యుండవని మాత్రము ముమ్మాటికి వాకొనుచున్నాను. ఇట్టితరి ఈపాషండ పతిత పాకయాజి గారు ప్రచ్ఛన్నరూపమునయుండు కమ్మవారు మొదలగువారిని వర్ణించి నవర్ణనలే ప్రమాణములని వాదించుట వెఱ్ఱిలో వెఱ్ఱియైయున్నదని గట్టి గ నొక్కి వక్కాణించుచున్నాను.

అనియిట్లు మీకు దెలియబఱచుచు నీపాషండ పతిత పాకయా జి శుభోధలకు లోనుగాక యుందురని మోక్షదాయకియగు దాక్షాయ

